శ్రీమతే రామానుజాయ నమః





తిరుమంగై మన్నన్ అనుగ్రహించిన

# తిరుక్కుఱున్దాణ్డకమ్

( శ్రీ పెరియవాచ్చాన్‌పిళ్ళై ద్రావిడవ్యాఖ్యానం, భావదీపికా వివరణం, అరుమ్పదం, శ్రీ కాంచీ అణ్ణంగరాచార్య స్వామివారి దివ్యార్థదీపికా వ్యాఖ్యకు అనువాదంతో )

పండితరత్న, వేదాంత వాచస్పతి, సత్సంప్రదాయ విద్వన్మణి

**డా॥ ఉ.వే. శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యస్వామి**



ఉ.వే. కందాళ వేంకటాచార్యస్వామివారి

81వ తిరునక్షత్రమహోత్సవ జ్ఞాపిక - 2011



పెరియవాచ్చాన్‌పిళ్ళై - శెంగనల్లూరు



దివ్యార్థ దీపికా వ్యాఖ్యను అనుగ్రహించిన
మహావిద్వాన్, పద్మవిభూషణ
ఉ.వే. శ్రీమాన్. ప్ర.భ. అణ్ణంగరాచార్య స్వామివారు, కాంచీపురం

శ్రీమతే రామానుజాయ నమః



తిరుమంగై మన్నన్ అనుగ్రహించిన

# తిరుక్కుఱున్దాణ్డకమ్

( శ్రీపెరియవాచ్చాన్‌పిళ్ళై ద్రావిడవ్యాఖ్యానం, భావదీపికా వివరణం, అరుమ్బదం, శ్రీ కాంచీ అణ్ణంగరాచార్య స్వామివారి దివ్యార్థదీపికా వ్యాఖ్యకు అనువాదంతో )


పండితరత్న, వేదాంత వాచస్పతి, సత్సంప్రదాయ విద్వన్మణి

**డా॥ శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యస్వామి**



ఉ.వే. కందాళ వేంకటాచార్యస్వామివారి

81వ తిరునక్షత్రమహోత్సవ జ్ఞాపిక - 2011

# తిరుక్కుఱున్దాణ్డకమ్ - తిరుమంగై మన్నన్

**( శ్రీపెరియవాచ్చాన్‌పిళ్ళై ద్రావిడవ్యాఖ్యానం, అరుమ్పదమ్,**
**శ్రీ కాంచీ అణ్ణంగరాచార్య స్వామివారి దివ్యార్థదీపిక వ్యాఖ్యకు అనువాదంతో )**


**భావదీపికా వివరణము :**
**పండితరత్న, డా॥ శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యస్వామి**



ప్రథమ ముద్రణము - జూలై 2011

ఆవిష్కరణము - 14-7-2011

సందర్భము - ఆచార్య తిరునక్షత్రోత్సవము

వేదిక - శ్రీత్రైవర్ణిక వైష్ణవ రామానుజ కూటం, విశాఖపట్టణం

ప్రతులు - 800

వెల - అమూల్యం.





ముఖచిత్రం - తిరుమంగైమన్నన్, కుముదవల్లి త్తాయార్,
తిరువాలి తిరునగరి.

**ఈ గ్రంథం భగవద్భాగవతాచార్యకైంకర్యనిష్ఠులు**
**శ్రీమతి కరాలపాటి నాగమణి, శ్రీమాన్ కరాలపాటి నాదబాబు**
**దంపతులు భక్తి ప్రపత్తులతో సమర్పించిన పవిత్రద్రవ్యంతో**
**ఆచార్య తిరునక్షత్రోత్సవ సందర్భంలో వారి**
**నూతన గృహప్రవేశ మహోత్సవ స్మృతిచిహ్నంగా ముద్రించబడింది.**

**ప్రతులకు**

1. శ్రీమతి కె.జానకి గారు
   18-3-38(ఎ)
   గుండాలవారివీధి
   విజయనగరం
   ☎ 08922-225070

2. శ్రీమాన్ కరాలపాటి నాదబాబు
   శ్రీలక్ష్మీ జ్యూవలరస్
   26-15-17, టౌన్‌కొత్తరోడ్
   మెయిన్‌రోడ్, విశాఖపట్టణం-530 001
   ☎ 99491 19222

డి.టి.పి. : 1. యస్.చంద్రశేఖర్, తిరుపతి.
2. శ్రీమతి ఏ.యస్. జయలక్ష్మి, భవానినగర్, తిరుపతి.

ప్రింటింగ్ : సి.ఎన్. ప్రింటర్స్, ప్రకాశంరోడ్, తిరుపతి.

శ్రీమతే రామానుజాయ నమః

సువచశ్శ్రీవల్లభ, పండితరత్న,
శాస్త్రవిద్వన్మణి, వాచస్పతి,
**ఉ.వే. శ్రీమాన్. డా॥ టి.పి. శ్రీరామచంద్రాచార్య స్వామివారు**
సంపాదకులు, భక్తినివేదన

## మంగళాశాసనం

ఆళ్వారులలో తిరుమంగైయాళ్వార్ బహువిలక్షణులు. వాశిలో, రాశిలో, నమ్మాళ్వారులకు దీటుగా కవిత వెలయించినవారు. లోకవృత్తానుశీలనచణులు; చతుర్విధ కవితాచతురులు. వీరి వైయక్తిక జీవితం విలక్షణమైనది. వీరు సమర్పించిన ప్రబంధ చయమూ విలక్షణమైనదే!

చతుష్కవి శిఖామణులైన వీరు లఘు, గురు - ప్రబంధాలను ఆఱింటిని రచించినారు. వాటిలో తిరుక్కుఱున్దాణ్డగమ్ ఒకటి. ప్రకృతం, ఈ ప్రబంధానికి **వ్యాఖ్యాతృ చక్రవర్తి శ్రీ పెరియ అచ్చాన్ పిళ్ళ** గారు గావించిన తమిళ వ్యాఖ్యానానికి పండిత **రత్న, వ్యాఖ్యాతృ శిరోమణి** ఉ.వే. శ్రీమాన్ డా॥ ఇ.ఏ. సింగరాచార్య స్వామివారు గావించిన ఆంధ్ర వివరణం ముద్రణ భాగ్యాన్ని పొందుతోంది. దీనితోపాటు కాంచీ శ్రీ ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారి దివ్యార్థదీపికా వ్యాఖ్యానానికి వీరు చేసిన అనువాదం కూడా ప్రచురింపబడుతున్నది.

ఈ ఏడు, ఆచార్యకైంకర్యరూపమైన ఉ.వే. శ్రీమాన్ డా॥ కందాళ వేంకటా**చార్యస్వామివారి** తిరునక్షత్ర మహోత్సవ సందర్భంగా తమ కైంకర్యముగా శ్రీవైష్ణవ సంప్రదాయాభినివిష్టులు, **శ్రీమాన్ కరాలపాటి నాదబాబు**, శ్రీమతి నాగమణి దంపతులు ఈ గ్రంథ ముద్రణ, సమర్పణభారాన్ని ఆనందంగా స్వీకరించినారు.

శ్రీమాన్ నాదబాబుగారు శ్రీమాన్ వేంకటాచార్యస్వామివారి సన్నిధిని భగవద్విషయం సేవించి, ఆచార్య కృపకు పాత్రులైన పరమ భాగవతులు.

శ్రీమాన్ డా॥ వేంకటాచార్య స్వామివారి సుపుత్రిక, **ఉభయ వేదాంత విదుషీమణి**, **ల.సౌ. శ్రీమతి జానకమ్మగారి** పర్యవేక్షణలో, ఈయేడు తిరునక్షత్రమహోత్సవ సభలను విశాఖపట్టణంలో నిర్వహింప సిద్ధపడిన ఆచార్యకైంకర్యనిష్ఠులు, శ్రీనాదబాబు దంపతులు. వీరికి ఇతోధికంగా, శ్రియఃపతి కటాక్షంచేత భగవద్భాగవతాచార్య కైంకర్యనిష్ఠ పరిఢవిల్లాలని భాగవతమంగళాశాసనం లభించాలి.

భాగవత విధేయుడు
**శ్రీరామచంద్రాచార్య**

శ్రీమతే రామానుజాయ నమః

ఉభయవేదాన్త వాచస్పతి, ద్రావిడవేదాన్తవిశిష్టపండిత, పండితరత్న
విద్యాప్రవీణ, భాషాప్రవీణ,
**ఉ.వే. శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామివారు,** ఎం.ఏ
స్థానాచార్యులు, శ్రీఆదికేశవ & ఎమ్బెరుమానార్ స్వామివార్ల కోవెల
నరసాపురం-534 275, తేది : 22-6-2011

స్వస్తిశ్రీర్దిశతాత్

## తిరుక్కుఱున్దాణ్డకమ్ - భగవదనుభవం

**కలయామి కలిధ్వంసం కవిం లోకదివాకరమ్ ।**
**యస్య గోభిః ప్రకాశాభిః అవిద్యం నిహతం తమః ॥**

"మాఱన్ పణిత్త తమిౙ్మఱైక్కు, మఱ్ఱైయర్కోన్ అఱుఙ్గమ్ కూఱ అవతరిత్త" అని మామునులు కృపజేసినట్లు, స్వామి నమ్మాౙ్వార్లు అనుగ్రహించిన తిరువిరుత్త - తిరువాశిరియ - పెరియ తిరువన్దాది - తిరువాయ్మొౙి అనే ద్రావిడవేద చతుష్టయానికి అంగములుగా పరకాలసూరి వరుసగా పెరియతిరుమొౙి, తిరుక్కుఱున్దాణ్డకమ్, తిరువెౙుకూఱ్ఱిరుక్కై, శిఱియ తిరుమడల్, పెరియ తిరుమడల్ - తిరునెడున్దాణ్డకమ్ అనే ఆఱు దివ్య ప్రబంధాలను కృపజేసినారు.

పైవానిలో, మొదటి దివ్యప్రబన్ధమైన పెరియ తిరుమొౙిలో - సాక్షాత్ వయలాలి మణవాళన్ద్వారా మన్త్రరాజమైన తిరువష్టాక్షరిని ఉపదేశంగా కలియన్ పొందారు, తత్ఫలంగా మంత్రరాజప్రతిపాద్యుడైన శ్రియఃపతి స్వరూపగుణ విభూతులను, స్వామి వేంచేసియున్న దివ్యదేశముల వైభవాన్ని, క్షేత్రరామణీయకతను విస్తారంగా అనుభవించారు. ఈ అనుభవం **"తిరుప్పిరిది"** (అష్టాక్షరీ మహామంత్రం అవతరించిన క్షేత్రం) నుండి ప్రారంభమై **"తిరుక్కోట్టియూర్"** దివ్యదేశంవరకు - షుమారుగా ఎనుబది (80) మించిన సాగినది. చివరగా శ్రీరామకృష్ణావతారములలోని దివ్యకల్యాణగుణాల్ని చేష్టితాల్ని అనుభవించారు. ఈ అనుభవంలో ఆౙ్వార్లకు సంసారపరమపదవిభాగం తెలియలేదు. అవిచ్ఛిన్నమైన ఇట్టి భగవదనుభవం పరమపదంలోగదా నుండును.

ఇట్టి స్థితిలో భగవానుడు ఆౙ్వార్లకు సంసారస్థితిని దెలిపి, దానిని వారు సహింప లేకున్నచో వెంటనే నిత్యవిభూతికి తీసికొని వెడదామని, ఓర్చే స్థితిలో నున్నచో క్రమంగా పరమపదం ప్రసాదిద్దామని భావించాడు. ప్రకృతిహేయత, దాని బాధకత్వాన్ని జూచిన ఆౙ్వార్లు సర్వేశ్వరునితో మధురవివాదానికి దిగి, ఇట్లు స్వామికి విన్నపించినారు.

"స్వామిన్! ఈ ప్రకృతిలో నా ఉనికి ఎట్లున్నదనగా, **"అఱ్ఱామ్ కరై వాళ్ మరమ్పోల్ అఞ్జుకిన్రేన్"** – అనగా ఏటి ఒడ్డుననున్న వృక్షంవలె భయపడుచున్నాను. ఎప్పుడు ప్రవాహవేగానికి చెట్టు కూకటివేళ్లతో పెకలింపబడునో తెలియదుగదా! **"ఇరుపాడు ఎరి కొళ్ళియినిల్ ఎఱుమ్బే పోల్"** – రెండు అంచులలో మండే కొఱవికట్టె మధ్యలోనున్న చీమ స్థితివలె నా స్థితియున్నవి. ఒక ప్రక్క జననం, మఱియొక్క ప్రక్క మరణం – ఇవియే కట్టె మొదలు చివర మండే అగ్నులు. మిగుల బాధాకరాలు – అని విన్నపించారు.

ఆళ్వార్లు ఇంతగా పరితపించుచున్నా, సర్వేశ్వరుడు వీరిద్వారా లోకోద్ధరణ హేతువులైన మధురదివ్యప్రబన్ధాల్ని అవతరింపజేయదలంచి ఉదాసీనుడైనాడు.

ఈ ఔదాసీన్యాన్ని సహింపలేని ఆళ్వార్లు భగవానుని నామములను అను సంధించియు, అవతారములందలి గుణచేష్టితాల్ని పాడియు, స్వామి వేంచేసియున్న దివ్యదేశాల్ని సేవించియు ప్రాణాల్ని నిలబెట్టుకొనుటకు ప్రయత్నించినారు. ఆళ్వార్ల ఈ స్థితి అధికంగా నేతిని త్రాగినవాడు పిపాసతో మిక్కిలి నీటిని త్రావినట్లున్నది. మిక్కిలి బాధకే కారణమైనది. మఱియు, తాపార్తుడు మడుగులో దిగి మునిగియు, అందులోని జలాన్ని త్రాగియు, నెత్తిన చల్లుకొనియు ఆత్మధారణ చేసినట్లు పరిణమించినది. స్వామి నమ్మాళ్వార్లు తిరువాయ్‌మొళిలో **"అళువన్ – తొళువన్ – ఆడి క్కాణ్బన్ – పాడి యలత్తువన్"** అనగా "స్వామిని గూర్చి గొంతెత్తి ఏడ్చుదును. స్వామి పాదాలను ఆశ్రయించుదును; నృత్యం చేసి స్వామిని దర్శింతును. గుణకీర్తనం చేసి విలపింతును" – అని తమ భగవద్విశ్లేషవ్యసనాన్ని వ్యక్తం చేసినట్లే కలియన్‌గూడ ఈ దివ్యప్రబన్ధంలో అట్టి స్థితినే పొందినారు.

మఱియు, "పెరు నిలమ్ కడన్ద నల్లడిప్పోదు **అయర్ప్పిలన్ – అలఱ్ఱువన్ – తళువన్ – వణఙ్గువన్ అమర్న్దే"** అనగా – త్రివిక్రమావతారంలో లోకాల్ని గొలిచిన భగవానుని పాదపద్మాలను విస్మరింపను, స్వామి గుణాల్ని కీర్తింతును. (వానిని) "కౌగలింతును ప్రణమిల్లుదును" అను నమ్మాళ్వార్ల అనుభవం – ఈ "తిరుక్కుఱున్దాణ్డకమ్" దివ్యప్రబన్ధంలో (కలియన్‌ది) సర్వత్ర గోచరించును.

చివరి దివ్యప్రబన్ధమైన తిరునెడున్దాణ్డకమ్‌లో 30 పాశురాలు గలవు. దీనిలోని పాశురముల సంఖ్య 20వది మాత్రమే. కావున పైదానికంటె నిది సంఖ్యలో (పాశురాలు) చిన్నదిగాన, **"కుఱు"** (చిన్న) దాండకమ్ – **తిరుక్కుఱున్దాణ్డకమ్** అయినది. ఇంతియే గాక– తిరునెడున్దాణ్డకమ్‌లో గల మాతృ – సఖీ – నాయకీ భావాలు, పరభక్తి పరజ్ఞాన– పరమభక్తులు, **"మచ్చిత్తాః మద్గతప్రాణాః బోధయన్తః పరస్పరమ్"** అనే స్థితులు,

తిరుమంత్ర ద్వయ – చరమ శ్లోకముల సమన్వయంలో ప్రస్తుత దివ్యప్రబన్ధంలో లేవు. కావున ఈ కారణంచేత గూడనిది **"తిరుక్కుఱున్దాణ్డకమ్"** అయినదని సమన్వ యింపవచ్చును. ఈ దివ్యప్రబన్ధంలో కలియన్‌యొక్క మిక్కుటమైన అర్తినే జూడవచ్చును.

ముఖ్య విషయం. **"ఉలకమేత్తుమ్ కండియూర్ అరఙ్గమ్ మెయ్యమ్ కచ్చి పేర్ మల్లై ఎన్ను మఴినార్.... ఉయ్యలల్లాల్ మఱ్ఱైయార్క్కు ఉయ్యలామే"** అనగా – లోకం స్తుతించే తిరుక్కండియూర్ (హరశాపవిమోచన క్షేత్రం), తిరువరంగమ్, తిరుమెయ్యమ్ (సత్యాద్రి), కాంచీక్షేత్రం, మల్లై (మహాబలిపురం) మొదలగు క్షేత్రములలో భక్తులకొఱకై ప్రతీక్షించే శ్రియఃపతిని ఆశ్రయించినవారికే ఉజ్జీవనం గాని, ఉపాయాన్తర నిష్ఠులకు ఉజ్జీవనం లేదు. కారణం – పరమపదం – క్షీరాబ్ధి – అంతర్యామి – విభవం – ఇవన్నియు. ఉపాయాన్తరములలోనే చేరును. ఇది తిరుమఙ్గై మన్నన్ దృఢాధ్యవసాయం. దానిని ఈ దివ్యప్రబన్ధం చివర నిష్కర్షించినారు. పెరియ తిరుమొఴిలో ఈ ఆళ్వార్లే **"అడియోముక్కే ఎంబెరుమాన్ అల్లిరో। నీర్ ఇన్దళూరీరే"** – మాబోటి అగతికులకే (ప్రపన్నులకే) స్వామిగదా! మీరు – అని తిరువిన్దళూర్‌లో వేం చేసియున్న **"ఇన్దళూర్ అన్దణనై"** భావశుద్ధి గల చోట మాట తప్పని పరిమళరంగ నాథునిగూర్చి తమ అర్తిని దెల్పినారు.

ఇది తిరుమంగై ఆళ్వార్ల అర్చాప్రావణ్యము. మఱియు, పరాకాష్ఠ జెందిన భాగవత నిష్ఠ వీరిలో గల మఱియొక విశేషము. **"తామర్చయేత్ – తాం ప్రణమేత్ – తాం వదేత్ తాం విచిన్తయేత్"** అని పాంచరాత్రంగూడ ఆశ్రయింపదగినది అర్చామూర్తి యనియే బోధించుచున్నది. **"కరుమ్బినిన్ శాఱుపోల"** – చెఱకు రసంవలె పరమభోగ్యాలు ఇందలి పాశురాలు.

వ్యాఖ్యాతృ చక్రవర్తియగు పెరియ వాచ్చాన్‌బిళ్ళైగారు సారసంగ్రాహక మధుర వ్యాఖ్యను ఈ దివ్యప్రబన్ధానికి అనుగ్రహించారు. వీరి వ్యాఖ్యలన్నియు **"నామూలం లిఖ్యతే కించిత్ నానపేక్షిత ముచ్యతే"** అనే పద్ధతిలో ప్రకాశించుచుండును.

ఆంధ్రజనావళి సంప్రదాయ (ఆళ్వార్ల శ్రీసూక్తులలోని) సౌరభమాధుర్యాల్ని అనుభవింపవలెనను ఉదారాశయంలో ఈ దివ్యప్రబన్ధవ్యాఖ్య తెలుగు జేయబడినది. దీనికి అవతారికాసహిత సరళానువాదాన్ని, విశేషాల్ని గూర్చినవారు **ఉభయ వేదాంత వాచస్పతి మొ॥ బిరుదాంచితులు, వ్యాఖ్యానిపుణులైన డా॥ ఉ.వే. శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్య స్వామివారు.** చాలాకాలమునుండి వీరు అందించు అవతరణికాసహిత స్తోత్రవాఙ్మయ దివ్యప్రబన్ధ అనువాదాలు పండితామోదాన్ని పొందిన వైశిష్ట్యం గలవి. భక్తిసంప్రదాయ విశేషాల్ని సులభంగా అనుభవించు పాఠకలోకానికి ఇది సత్యంగా

"నల్లకాలమ్" అనుట పునరుక్తమగును. వీరి పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానానువాదంతో పాటు, శ్రీకాంచీ అణ్ణంగరాచార్య స్వామివారి దివ్యార్థదీపికకు వీరు చేసిన అనువాదం కూడా ముద్రింపబడడం ప్రపన్నజనభాగ్యవిశేషం.

**కీర్తిమూర్తి, ఉభయవేదాన్త విద్వత్తల్లజులైన ఉ.వే. శ్రీమాన్ కందాళ వేంకటచార్య** స్వామివారి దివ్యానుగ్రహాన్ని విజయనగరం గోష్ఠి పొందినట్లు, విశాఖపట్నం గోష్ఠికూడ పొందినది. శ్రీమాన్ స్వామివారు ఈ శ్రీ త్రైవర్ణిక వైష్ణవరామానుజ గోష్ఠిని కూడ తమ సంప్రదాయ ప్రవచనములతో, గ్రంథకాలక్షేపములతో నానందింపజేసినారు.

శ్రీమాన్ స్వామివారి పిమ్మట వారి తిరుక్కుమార్తె **ఉభయవేదాన్త విదుషీమణి శ్రీమతి జానకమ్మగారు** తమ ప్రవచన కాలక్షేపాదులతో ఉత్తేజితుల్ని చేశారు. ఇది ఈ గోష్ఠియొక్క భాగ్యవిశేషము. దీని ఫలితంగానే పండితసభలు, గ్రంథావిష్కరణం మొదలగు సంప్రదాయకార్యక్రమాలు మిక్కిలి ఉత్సాహంతో ఈ గోష్ఠివారు జరుపుచున్నారు. అస్తు.

ఈ వంవత్సరము ఆచార్యవరివస్యగా **"తిరుక్కుఱున్దాణ్డకమ్"** దివ్యప్రబన్ధాను వాదాన్ని తమ పవిత్రద్రవ్యంతో ప్రకటింపజేసినవారు **శ్రీమాన్ కరాలపాటి నాదబాబు గారు, వీరి ధర్మపత్ని శ్రీమతి నాగమణిగారు.** వీరు గతంలో విశాఖలోని శ్రీత్రైవర్ణిక వైష్ణవ రామానుజకూటం అధ్యక్షబాధ్యతలను నిర్వహించుచు- సంప్రదాయ కార్యక్రమాల్ని మిక్కిలి ఉత్సాహంతో నడిపించుచుండుట విదితచరమే (తెలిసిన విషయమే).

శ్రీమాన్ నాదబాబుగారికి, వారి కుటుంబానికి ఇతోఽధికమైన ఆయురారోగ్య ఐశ్వర్యాదులను, శక్తియుక్తులను అస్మత్కులదైవమైన స్వామి ఎంబెరుమానార్లు ప్రసాదింతురు గాక!, అని యాశించుచున్నాను. స్వస్తి.

**శ్రీమదాలిశ్రీనగరీనాథాయ కలివైరిణే ।**
**చతుష్కవిప్రధానాయ పరకాలాయ మంగలమ్ ॥**

ఇట్లు

భాగవత విధేయుడు

**కె. వేంకటాచార్యులు**

**శ్రీమతే రామానుజాయ నమః**

పండితరత్న, శాస్త్రరత్నాకర, శాస్త్రవిద్వన్మణి

**ఉ.వే. శ్రీమాన్ డా॥ ఎస్.వి. రంగరామానుజాచార్య స్వామివారు**

అధ్యక్షులు, ఉభయవేదాంతాచార్య పీఠం (శ్రీరంగం)
జీయర్ ఇంటి గ్రేటెడ్ వేదిక్ అకాడమీ, శ్రీరామనగరం,
శంషాబాద్ మండలం, రంగారెడ్డి జిల్లా, హైదరాబాద్.

* * *

దివ్యప్రబంధవాఙ్మయంలో నమ్మాళ్వారుల తరువాత విశేషంగా పరిగణింపదగిన ఆఱు దివ్యప్రబంధాలను అనుగ్రహించి స్థిరకీర్తులైన మహనీయులు తిరుమంగై ఆళ్వారులు. సాక్షాత్తు శ్రీమన్నారాయణునే ఆయుధంతో బెదిరించి పరమ రహస్యమైన మంత్రాన్ని పరిగ్రహించిన పరాక్రమం వీరిది. కనుకనే **"వాళ్రి పరకాలన్"** అని తామనుగ్రహించిన తనియన్‌లో **"మాయోనై - వాళ్వలి యాల్ మందిరమ్ కొళ్ తూయోన్"** భగవంతునినుండి తమ ఖడ్గశక్తిచేత అష్టాక్షరీ మహామంత్రాన్ని పొందిన పరమపవిత్రులు - అని కీర్తించారు భగవద్రామానుజులు.

శ్రీరంగమణిమండపాది నిర్మాణంలో వీరికి గల ప్రావణ్యాన్ని శ్రీరంగరాజస్తవంలో ఈక్రింది విధంగా కీర్తించడం జరిగింది.

**జితబాహ్యజినాదిమణిప్రతిమా అపి వైదికయన్నివ రంగపురే ।**
**మణిమండపవప్రగణాన్ విదధే పరకాలకవిః ప్రణమేమహి తాన్ ॥**

తాను జయించి స్వాధీనపరచుకున్న జైనాదిమణిప్రతిమలనుకూడా వైదిక సంస్కారసంపన్నం చేయాలనే భావనతో కాబోలు శ్రీరంగంలో మణిమండప ప్రాకారాదులను పరకాలకవి నిర్మించినారట. వారికి ప్రణమిల్లుదుము - అంటారు స్తోత్రకర్త. వీరికి గల దివ్యదేశప్రావణ్యం నిరతిశయం. కనుకనే **'తిరుక్కుఱున్దాణ్డకమ్'** అనే ప్రబంధంలో ఇలా అంటారు ఆళ్వార్లు.

**పిణ్డియార్ మణ్డై యేన్ది పిఱర్మనై తిరితన్దుణ్ణుమ్,**
**ముణ్డియాన్ శాపమ్ తీర్త్త వొరువనూర్, ఉలక మేత్తుమ్**
**కణ్డియూర్ అరఙ్గమ్ మెయ్యమ్ కచ్చి పేర్ మల్లై యెన్ఱు**
**మణ్డినార్, ఉయ్యలల్లాల్ మఱ్ఱైయార్క్కుయ్యలామే ॥**

పరమశివుని శాపాన్ని పోద్రోలిన అద్వితీయుడైన 'స్వామి' కి చెందిన తిరుక్కణ్డియూర్, శ్రీరంగం, తిరుమెయ్యం, కాంచీపురం, తిరుప్పేర్, తిరుక్కడల్‌మల్లై - అనే దివ్య దేశములందు నిర్భరప్రావణ్యం కలవారు తప్ప మిగిలినవారు ఉజ్జీవింపజాలరంటారు ఆళ్వార్లు.

మఱొక పాశురంలో, కేవలం మాంసప్రచురమైన దేహంలో మాత్రమే సుఖించడానికి ఉపకరించేవాటిని (భోగ్యవస్తుజాతాన్నే) అపేక్షించేవారు, స్వామి యొక్క స్పృహణీయస్వరూపాన్ని భోగింపలేనివారును - మనుష్యజన్మ ఎత్తడానికి అనర్హులని, అట్టివారు మనుష్యజన్మ గురించి భావించలేరని అంటారు - "వానిదై ప్పాయలై, మాలై" అనే పాశురంలో

భగవత్కైంకర్యాన్ని తప్ప మరేమీ ఆశింపని నిష్ఠ కలవారు ఆళ్వారులు. తన మనస్సు ఋజువుగా లేదని, కనుకనే 'భక్తి' పట్ల ప్రీతి కలగటం లేదని వాపోయిన ఆళ్వార్లు, భక్తిపట్ల ప్రీతి కలిగేలా అనుగ్రహించమని స్వామిని ప్రార్థించారు. స్వామి దివ్యమంగళ విగ్రహభావన వారిని ఈడుపడేలా చేసింది.

**శిత్తముమ్ శెవ్వైనిల్లాతు ఎన్ శెయ్‌కేన్ తీవినై యేన్,**
**పత్తిమైక్కన్బుడైయే నావతే! పణియాయెన్దాయ్,**
**ముత్తొళి మరకతమే! మ్ముళజ్గొళి ముగిల్వణ్ణా!, ఎన్**
**అత్తా! నిన్నడిమై యల్లాల్ యాతుమొన్షతిరిగిలేనే** అంటారు.

ఈ ప్రబంధంలో భగవానుని వివిధావతారాలనుకూడా భావించారు. **'పాయిరమ్'** అనే పాశురంలో కూర్మావతారాన్ని, **'కేట్క యాన్'** అనే పాశురంలో వరాహావతారాన్ని , **'కాత్తినై, మున్ పొలా'** ఇత్యాది పాశురాలలో శ్రీరామావతారాన్ని, **'నిలియినై'** అనే మొదటి పాశురంలోనే శ్రీకృష్ణావతారాన్ని, **'మూవరివ్'** అనే పాశురంలో త్రివిక్రమావతారాన్ని, **'ఉళ్లమో'** అనే పాశురంలో వామనావతారాన్ని, విశేషించి **"మున్ పొలా"** అనే పాశురంలో శ్రీరామాయణగాథా విశేషాన్ని కీర్తించారు ఆళ్వారులు. **'మాయ మాన్'** అనే పాశురంలో వివిధావతార వైభవాలను కీర్తించారు.

ఆకారంచేత చిన్నదే అయినా **'తిరుక్కుఱున్దాణ్డగమ్'** అనే తిరుమంగై ఆళ్వారుల ఈ ప్రబంధం అర్థగాంభీర్యం కలిగి ఉంది. ఇందులో ఆళ్వారుల ఆర్తి అడుగడుగునా గోచరిస్తుంది. వీరి పశ్చాత్తప్తహృదయం చాలా విస్పష్టంగా సాక్షాత్కరిస్తుంది.

ఇలాంటి ఈ ప్రబంధానికి పెరియవాచ్చాంబిళ్లై అనుగ్రహించిన వ్యాఖ్యానమే కాక, ఉవే. అణ్ణంగరాచార్య స్వామివారుకూడా దివ్యార్థదీపికను అనుగ్రహించారు. ఈ రెంటినీ తెలుగు చేసి ఆంధ్రపాఠకలోకానికి అందిస్తున్న మాన్యమిత్రులు, పండితరత్నేత్యాది ఉవే శ్రీమాన్ సింగరాచార్యస్వామివారు. వారి యీకృషిని లోకవిశదం చేస్తున్న ఉవే శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి శిష్యులు శ్రీమాన్ కరాళపాటి నాదబాబు, నాగమణి దంపతులు ధన్యులని భావిస్తూ, వారికి ఇతోధికశక్తి సామర్థ్యాలను శ్రియఃపతి కృపచేయాలని స్వామిని ప్రార్థిస్తూ, ఎన్నో ద్రావిడగ్రంథాలపై గల వాఖ్యలు యథాతథంగా ఆంధ్రానువాదంతో లోకానికి అందాలని విశేష శ్రమకోర్చి, జిజ్ఞాసులోకాన్ని ఉజ్జీవింపజేస్తున్న శ్రీమాన్ సింగరాచార్యస్వామివారు శతాధిక వయస్సుతో, ఆయురారోగ్యాలతో సుభాషితులు కావాలని ఆశిస్తూ 'సెలవు' తీసుకుంటున్నాను.

ఇట్లు
బుధజనవిధేయుడు
**S.V. రంగరామానుజాచార్యులు**

**Jeeyar Integrated Vedic Acadamy**
**Srirama Nagaram, Shamshabad**
**Hyderabad**

శ్రీమతే రామానుజాయ నమః

# ఆచార్యవైభవము - ఆనందానుభవము

* * *

భగవద్భక్తి సంపన్నులయిన భాగవతోత్తములకు కరాలపాటి నాదబాబు, నాగమణి దంపతుల దాసోహములు.

మా ఆచార్యులు ఉ.వే. శ్రీమాన్ డా॥ కందాళ వేంకటాచార్యస్వామివారు వారి 81 వ తిరునక్షత్ర సందర్భమున విశాఖపట్నము శ్రీ త్రైవర్ణిక వైష్ణవరామానుజ కూటములో **"ఆచార్యవరివస్య"** చేసుకొనే సదవకాశము మాకు కలిగినది. ఈ మహోత్సవ జ్ఞాపికగా ప్రకటించుకుంటున్న ఈ గ్రంథానికి ముందుమాటగా మా ఆచార్యుల వైభవాన్ని, వారివలన మాకు కలిగిన ఆనందాన్ని మీఅందరితో చెప్పుకుందామని మా మనసుకు కుతూహలం కలిగింది. వివరించడానికి తగిన మాటలు రావటం లేదు. భగవంతుని ఆనందమవే ఒక్క గుణాన్ని వర్ణించలేక వేదముకూడా వెనుదిరిగిందని, పరమాత్మ గుణవైభవాలు మాటకు, మనస్సుకుకూడ అందనిది అని పెద్దలు చెపితే విన్నాము. **"భగవంతుని కన్న ఆచార్యులు మిన్న, ఆచార్యుల కన్న దైవం మఱొకటి లేదు, ఉన్నా నాకు తెలియదు"** అనే సంప్రదాయం కదా మనది. కనుక, ఆచార్యవైభవముకూడా మాటకు, మనస్సుకు ఉందదు - అని అర్థమయింది. అయినా, మా మనస్సు మీ ముందుంచాలని ప్రయత్నం చేస్తున్నాము. ఆత్మీయులైన మీరు మనసారా ఆశీర్వదిస్తారని ఆశిస్తున్నాము.

**"ఆచార్య స్సహరిస్సాక్షాత్"** అంటారు. సాక్షాత్తు శ్రీహరే ఆచార్యులు. హరినామస్మరణము వలన అన్ని పాపాలూ పోతాయి. అలాగే, ఆచార్యనామస్మరణము సకలపాపాలను పోగొడుతుంది. ఆచార్యసేవ సకలఫలములను ఇస్తుంది. ఎన్నో జన్మల సుకృతఫలంగా సదాచార్యులు లభిస్తారట. ఆటువంటి సదాచార్యుని ఆశ్రయించి భగవంతుడిని పొందాలిట. ఆచార్యులు ఆశ్రయించకపోతే, భగవంతుని అనుగ్రహము కలుగదు - అని పెద్దలు చెప్తారు. నీటిలో ఉంటే సూర్యుడు కమలాన్ని వికసింపజేస్తాడు. నీటిలో లేకపోతే సూర్యుని వేడితో కమలము వాడిపోతుంది. అలాగే మంచి ఆచార్యులను ఆశ్రయిస్తేనే భగవంతుడు ఆనందిస్తాడు. సదాచార్యసమాశ్రయణమువలన కలిగే ఆనందమూ మాటలకు అందనిది. "మనమంతా భగవద్రామానుజుల పాదాలను ఆశ్రయించి ఆటువంటి ఆనందాన్ని పొందుతున్నాము" అనే విషయాన్ని మనకు

ఉత్తారకులు, ఉపకారకులు అయిన ఆచార్యులు తెలియజేస్తారు. మాకు అటువంటి **ఉపకారకులైన ఆచార్యులే ఉ.వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారు.**

శ్రీమాన్ మా పూర్వీకులు కరాలపాటివంశీయులు, మాతల్లిదండ్రులు, కరాలపాటి రాధాకృష్ణయ్య, సత్యవతమ్మ దంపతులు, మా పెద్దలు మద్రాసు పట్టణవాస్తవ్యులు. కాని, తరువాత వ్యాపారరీత్యా విశాఖపట్నం రావడము జరిగింది. సుమారు 40 సం॥పైగా విశాఖపట్నంలో బంగారం వ్యాపారం చేసుకుంటూ సుఖజీవనాన్ని సాగిస్తున్నాము. మా తల్లిదండ్రులు, పెద్దలు ధార్మికమైన సాంప్రదాయికమైన ప్రవృత్తి కలవారు. వారి పుణ్యమువలన వారి సంతానమైన మేమంతా హాయిగా ఉన్నాము.

మా ఆచార్యస్వామివారితో మా పెద్దలకు మంచి అనుబంధము ఉంది. మా అమ్మమ్మగారు భగవద్భాగవతకైంకర్యనిరతి కలిగినవారు. వారి సంస్కారమే మా అమ్మగారిదికూడా. మా తండ్రిగారి ఆమోదము దానికి తోడైంది. మా ఆచార్యుల పెరుమాళ్ళ కైంకర్యమునకు వినియోగపడాలని మా పెద్దలు సమర్పించిన వస్తువులను **ఆచార్యపత్ని శ్రీమతి చిత్రానీళగారు** ఇప్పటికి జ్ఞాపకము చేసుకోవడము వారి ఆత్మీయతకు నిదర్శనము. ఈనాటికి మాకు ఈ విధముగా ఆచార్యకైంకర్యము చేసుకొనే అవకాశము కలిగినందుకు ఎంతో ఆనందిస్తున్నాము.

**ఉ.వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారు** విలక్షణమైన ఆచార్యులు. శిష్యుల విషయములో వారికి చెప్పలేనంత వాత్సల్యము. ప్రత్యేకముగా దాసునిపట్ల ప్రేమ ఉంది. **తమ ఆచార్యులు, మాకు పరమాచార్యులు అయిన ఉ.వే. శ్రీమాన్ తె.కం. గోపాలాచార్య స్వామివారిని** మా ఇంటికి **తీసుకొని** వచ్చేరు. ఆ మధురస్మృతి ఎప్పటికీ ఆనందాన్నిస్తుంది. మా ఇల్లు పై అంతస్తులో ఉంది. **శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారు, ఉ.వే. శ్రీమాన్ వేంకటాచార్యస్వామివారు** చెరొక ప్రక్క నిలబడి తమ ఆచార్యులకు సహాయపడుతూ వారిని మేడపైకి తీసుకొని వచ్చారు. "**నన్నింత కష్టపెడుతున్నారు. మీకు నాదబాబుగారు అంత ఆత్మీయులా?**" అని పరమాచార్యులవారు వారిని ప్రశ్నించడము ఇంకా జ్ఞాపకం ఉంది. ఆ విధముగా భాగవతాభిమాన పాత్రుల మయినాము. శిష్యులకొరకు, వారి మంచికొరకు, సంప్రదాయ ప్రచారముకొరకు మా ఆచార్యస్వామివారు ఎంత శ్రమకైనా సిద్ధపడేవారు. ప్రతి ఆదివారము విశాఖపట్నము వచ్చి (విజయనగరము నుండి) ఇక్కడున్న మా కులస్థులకు వారు చేసిన మేలు సాటి లేనిది. విశాఖపట్నమువారిని కూడా సత్సంప్రదాయపరులుగ తీర్చిదిద్దాలనే వారి తపన ఆశ్చర్యాన్ని కలిగించేది. ఇక్కడకూడా ఒక రామానుజకూటాన్ని ఏర్పాటు చేయడములో

ప్రధానపాత్ర వహించిన మహనీయులు వారు. రామానుజ కూటము ఏర్పడిన తరువాత ప్రతివారము వచ్చి సంప్రదాయరహస్యగ్రంథాలను కాలక్షేపంగా అనుగ్రహించేవారు. వారి భగవద్విషయ కాలక్షేపగోష్ఠిలో పాల్గొనే భాగ్యము దాసునికి కలిగింది. పొరుగూరు నుండి వచ్చినా మాకంటే ముందుగానే వచ్చి కాలక్షేపానికి సిద్ధంగా ఉండేవారు. రామానుజకూటములో ఒక్కొక్క స్తంభము దగ్గర ఒక్కొక్కరుగ పట్టుమని పదిమంది లేనినాడుకూడా అదే ఉత్సాహముతో, ప్రేమతో, విశదముగా గ్రంథకాలక్షేపము జరిగేది. శిష్యులపట్ల ఇంత ప్రేమ గల ఆచార్యులంటారా! - అని ఆశ్చర్యము కలిగేది. ప్రత్యక్షముగ అనుభవిస్తున్నాము కనుక నమ్మకము కలిగేది. అటువంటి మహనీయులు మనకు ఆచార్యులు - అని అనుకున్నప్పుడు ఆనందముతో ఒళ్ళు పులకరించేది. ఈ పెన్నిధిని మాకు అందించిన భగవంతునికి కృతజ్ఞతతో మోకరిల్లాలని అనిపించేది.

ఈనాడు వారు స్వామి సన్నిధికి చేరినా, వారు చూపిన మార్గములో నడుచు కుంటూ రామానుజసేవాభాగ్యముతో తరిస్తున్నాము. కొంతకాలం పాటు రామానుజ కూటము అధ్యక్షత బాధ్యతకు వహించి యథాశక్తి సేవ చేసుకోగలిగేము. పెద్దల అనుగ్రహమువలన ఈ మధ్య నూతన గృహనిర్మాణము చేసుకున్నాము. శుభపరంపరలు తరలి వచ్చినట్లుగ ఆచార్యతిరునక్షత్ర మహోత్సవము ఈ సంవత్సరము విశాఖపట్నము రామానుజకూటములో నిర్వహించడము, మాకు గ్రంథప్రకాశము చేసుకొనే కైంకర్యము లభించడము ఆచార్యానుగ్రహమని భావిస్తున్నాము.

ఈ సందర్భములో తిరుమంగై ఆళ్వార్లు అనుగ్రహించిన "తిరుక్కుఱున్దాణ్డకమ్" అనే దివ్యప్రబంధము తమిళ, తెలుగు వ్యాఖ్యానములతో వెలువరించుకుంటే బాగుంటుందని పెద్దలు నిర్ణయించారు. "ఎన్నుడై చ్చొల్ క్కిళవిగళ్ తూయ మామాలై **కొణ్డు శూట్టువన్ తొణ్డనేన్**" దాసుడనైన నేను నామాటలనే పరిశుద్ధమైన మాలికలను నీకు సమర్పిస్తున్నాను అంటారు ఈ దివ్యప్రబంధములో తిరుమంగై ఆళ్వార్లు. అలాగే మా ఆచార్యులపట్ల భక్తివిశ్వాసపూర్ణమైన మా మనస్సునుండి వెలువడిన అక్షర ప్రసూన మాలికలను వారి పాదాల దగ్గర సమర్పిస్తున్నాము.

ఈ గ్రంథమును తమ ఆంధ్రవివరణముతో అందముగ తీర్చిదిద్ది, ముద్రణ బాధ్యతనుకూడా తామే వహించిన సహృదయులైన ఉ.వే. శ్రీమాన్ శింగరాచార్య స్వామి వారికి ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేస్తూ దాసోహములు సమర్పిస్తున్నాము. మా ప్రార్థనను మన్నించి తమ అమోఘమైన మంగళాశాసనములను కృపచేసిన పెద్దలు, భాగవతోత్త ములు ఉ.వే. శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామివారికి, ఉ.వే. శ్రీమాన్ సముద్రాల వేంకటరంగరామానుజాచార్యస్వామి వారికి, ఉ.వే. శ్రీమాన్ కిదాంబి

వేంకటాచార్యస్వామివారికి సవినయముగ దాసోహములు సమర్పిస్తున్నాము. ఈ తిరు నక్షత్రమహోత్సవము పరమహంసపరివ్రాజకాచార్యులు, **శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయర్ స్వామివారి మంగళాశాసనములతో, శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయర్‌స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణతో వారి మంగళ శాసనములతో** నిర్వహించుకోవడము మా అదృష్టము. వారికి అనేక దాసోహములు సమర్పిస్తున్నాము. ఈ కైంకర్యావకాశమును మాకు కలిగించి మమ్ములను ప్రోత్సహించిన మా ఆచార్యకుటుంబమునకు, ప్రత్యేకముగ **ఆచార్య పత్ని అమ్మగారికి, ఆచార్య పుత్రి శ్రీమతి జానకమ్మగారికి కృతజ్ఞతతో** దాసోహములు సమర్పిస్తున్నాము. మా శ్రీ త్రైవర్ణిక వైష్ణవ రామానుజకూటము, విశాఖపట్నంగోష్ఠివారు ఈ కార్యక్రమాన్ని శ్రద్ధతో నిర్వహిస్తు న్నందుకు అభినందిస్తున్నాము.

మాది చిన్న కుటుంబము. మా వంశాకురము **చిరంజీవి వంశీకృష్ణ** విద్యా వంతుడు వివేకవంతుడు. వినయసంపన్నుడు. భాగవత మంగళాశాసనముతో కుల ప్రదీపకుడై, ఆయురారోగ్య ఐశ్వర్యవంతుడై విలసిల్లాలని ఆశిస్తున్నాము. ఆచార్యాను గ్రహముతో పరంపరగా మేము భగవద్భాగవతాచార్య కైంకర్య పరులము అయేటట్లు ఆశీర్వదించమని భాగవతోత్తములను ప్రార్థిస్తున్నాము. ఈ గ్రంథము సంప్రదాయాసక్తు లైన విజ్ఞులకు ఆమోదయోగ్యమైనది అవుతుందని భావిస్తున్నాము.

**ఆచార్య శ్రీచరణములే మాకు శరణములు.**

ఇట్లు

భవదీయులు, భాగవతవిధేయులు

**కరాలపాటి నాదబాబు నాగమణి దంపతులు**

**విశాఖపట్నము**

# నివేదిక

పరకాలసూరి ముఖపద్మజాతమధుకల్పవాఙ్మయం
తదనూనభవ్యపరభక్తిభావశబలం మహోజ్జ్వలమ్ ।
మురభిత్స్వరూప గుణజాతరూపవిభవాదిసంస్తవం
లఘుదాండకాఖ్యమధురప్రబంధ మమసందధీమహి ॥

## నాలాయిరంలో తిరుకుఱున్దాణ్డకమ్

"మాఱన్ పణిత్త తమిళ్ మఱైక్కు ఆఱఙ్గమ్ కూఱ అవతరిత్త మఙ్గైయర్ కోన్" అని శ్రీమద్వరవరమునులచే ఉపదేశరత్తినమాలై ప్రబంధంలో కీర్తింపబడ్డ తిరుమఙ్గై మన్నన్ అనుగ్రహించిన ఆఱు దివ్యప్రబంధాల వరుస క్రమంలో రెండవ ప్రబంధం తిరుక్కుఱున్దాణ్డకమ్. ప్రపన్నజనకూటస్థులైన నమ్మాళ్వార్లు ప్రసాదించిన తిరువిరుత్తమ్, తిరువాశిరియమ్, పెరియ తిరువన్దాదీ, తిరువాయ్ మొళి- అనే నాల్గు ప్రబంధాలు క్రమంగా ఋగ్వేద, యజుర్వేద, అధర్వణవేద, సామవేదస్థానీయాలని, ఈ నాల్గు ప్రబంధాల అర్థాన్ని నిర్ణయించడంలో ఉపకరించే తిరుమఙ్గైఆళ్వార్ల ప్రబంధాలు ఆఱు షడంగస్థానీయాలవి అభిజ్ఞులైన పూర్వాచార్యుల సూక్తి, తిరుమఙ్గైమన్నన్ అనుగ్రహించిన ప్రబంధాల క్రమం పెరియ తిరుమొళి, తిరుక్కుఱున్దాణ్డకమ్, తిరువెళుకూర్రిరుక్కై, శిఱియ తిరుమడల్, పెరియ తిరుమడల్, తిరునెడున్దాణ్డకమ్ - అని కూడా పూర్వాచార్యుల వివరణం.

## తిరుకుఱున్దాణ్డక ప్రమేయం

"మాయోనై వాళ్వలియాల్ మన్దిరఙ్గొళ్ మఙ్గైయర్కోన్" అని కీర్తింపబడే తిరుమఙ్గైమన్నన్ తన శౌర్యవీర్యపరాక్రమాలతో సర్వేశ్వరుని మెప్పించి, తిరుమంత్రాన్ని, దాని అర్థాన్ని ఉపదేశంగా పొంది, తదర్థానుసంధానంవల్ల కల్గిన అనుభవంయొక్క పరీవాహరూపంగా మొదటి ప్రబంధమైన పెరియ తిరుమొళి ప్రబంధాన్ని ప్రసాదించారు. భగవానుని స్వామిత్వ- సౌలభ్యాలు అష్టాక్షరిలో ప్రధానంగా స్ఫురించడంవల్ల, ఆ స్వామిత్వ సౌలభ్యగుణాలకు పర్యంతసీమ అర్చావతారాలు కనుక, తిరుమంగై మన్నన్ ప్రధానంగా పెరియ తిరుమొళిలో బదరికాశ్రమం నుండి ఆరంభించి దివ్యదేశాలను పెక్కింటిని కీర్తించారు. ఉత్తరదేశ దివ్యదేశాలు, తొణ్డనాడులోని దివ్యదేశాలు, మధ్యదేశ దివ్యక్షేత్రాలు, చోళనాడులోని దివ్యదేశాలు, పాండ్యదేశ దివ్యదేశాలు- అనే క్రమంలో ఉత్తర దిక్కునుండి దక్షిణదిశ

చివరకుగల పలు దివ్యదేశాలను, అక్కడ నెలకొని ఉండే అర్చామూర్తులను ఆళ్వార్లు అభివర్ణించారు. ఈ ఆళ్వార్లు ఈ విధంగా దివ్యదేశప్రావణ్యాన్ని కలవారై తమను, పరమపదాన్ని, సంసారంలోని నైచ్యాన్ని మఱచి ఉండడాన్ని గమనించిన భగవానుడు వీరిని పరమపదానికి తీసికొని పోవడంకోసంగా, ఈ సంసారంలోని హేయతను తెలియజేశాడు. అపుడు తిరుమంగై మన్నన్ పెరియ తిరుమొళిలోని "మాఱ్ఱముళ" అని ప్రారంభం అయే చివరి దశకంలో ఆ సంసారనైచ్యాన్ని "ఆఱ్ఱఙ్కరై వాళ్ మరమ్పోల్ అఞ్జుకిన్ఱేన్", "పామ్బోడొరు కూరైయిలే పయిన్ఱాప్పోల్" ఇత్యాదిగా అనుసంధిస్తూ భయపడి, "స్వామీ! నన్ను నీ చరణాల దరికి చేర్చుకో" అని ప్రార్థించారు. ఈ విధంగా భగవదనుభవాన్ని నిరాటంకంగా పొందాలని ఆశపడే వీరికి భగవానుడు సాక్షాత్కరించినందువల్ల, దాహాన్ని మిక్కుటంగా కలవాడు ఒంటిపై, ముఖంలో, తలపై నీటిని చేతులారా ఎత్తి జల్లుకొనేటట్లుగా, భగవానుని త్రికరణాల ద్వారా అనుభవించి కొంత సమాశ్వాసాన్ని పొందినవారై, "ఈ ఆనందానుభవం నాకు దివ్యదేశాలను అనుభవించినందువల్ల కల్గింది. ఈ దివ్యదేశాలను అనుభవించగల్గిన వారు భాగ్యశాలురు" అని రెండవ ప్రబంధమైన తిరుక్కుఱున్దాణ్డకమ్‌లో పలికారు. ఇది క్లుప్తంగా ఈ ప్రబంధ ప్రమేయం. ముదలాళ్వార్లు భగవానుని పరరూపంలో ఊనికను కల్గినవారుకాగా, పెరియాళ్వార్లు, గోదాదేవి, నమ్మాళ్వార్లు శ్రీకృష్ణావతారంలో, కులశేఖరప్పెరుమాళ్ శ్రీరామావతారంలో ఊనికను కలవారు. తిరుమఙ్గై మన్నన్ భగవానుని అర్చా రూపాలలో ఊవికను కలివారు. ఈ విషయాన్ని ప్రకృతప్రబంధంలోని "పిణ్డియార్ మణ్డైయేన్ది" అనే 19వ పాశురంలో వారు వ్యక్తం చేశారు.

దివ్యసూరులు ప్రబంధాలన్నీ అడుగడుగునా పరతత్త్వనిర్ణయాన్ని చేస్తాయి. ఈ విషయాన్ని ప్రస్తుత ప్రబంధంలో కూడా గమనించవచ్చు. "మూవరిల్ ముదల్వ నాయ", "పిణ్డియార్ మణ్డయేన్ది" ఇత్యాది సూక్తులు ఇందుకు ఉదాహరణలు. ఇందులోని పలు పాశురాలలోని ప్రయోగాలు ఉత్తమ ధ్వనికావ్యానికి ఉదాహరణలు. "పవళత్తూణై", "కరుమ్బినిన్ శాఱుపోల" - ఇత్యాదులు ఉదాహరణులు.

ఈ ప్రబంధం "దాణ్డక" మనే ఒక విలక్షణ ద్రావిడ భాషాచ్ఛందస్సులో రచింపబడింది. కనుక, ఈ ఛందస్సును గూర్చి కొన్ని అంశాలు విన్నపింపబడు తున్నాయి. ఇవి శ్రీ ఎం. శ్రీనివాసన్ గారి "తమిళ్ ఇలక్కణవరలాఱు" అనే గ్రంథంనుండి కృతజ్ఞతా పూర్వకంగా గ్రహింపబడ్డాయి.

## ద్రాండకమ్ - ఒక విలక్షణ ద్రావిడచ్ఛందోవిశేషం

"దాండకమ్" అనేది ఒక విధమైన విలక్షణ ద్రావిడచ్ఛందస్సు. ఈ దాండక ఛందస్సులో రచింపబడ్డ కృతులు "దాణ్డక"మనే పేరుతో వ్యవహరింపబడడం పరిపాటి. ఈ ఛందస్సునుగూర్చిన లక్షణాలు "యాప్పరుజ్కల విరుత్తి" అనే ద్రావిడ లక్షణగ్రంథంద్వారా, "వీరశోళ్ళియ" మనబడే ఇంకొక ద్రావిడ లక్షణగ్రంథంద్వారా తెలుస్తున్నవి. ఈ విధమైన దాండక చ్ఛందోరీతిలో రచింపబడ్డ కృతులు మొట్ట మొదటగా తమిళంలో భక్తివాఙ్మయంలోనే కన్పిస్తున్నవి. "తిరునావుక్కు అరశర్" అనే ప్రసిద్ధ తమిళకవి రచించిన "తిరుముఱై" అనే గ్రంథంలోని ఆఱవ తిరుముఱై సంపూర్ణంగా ఈ దాండక చ్ఛందస్సులోనే కూర్చబడింది. ఇందులోని 981 పాటలను కల్గిన 99 దశకాలు (పదికాలని వీటికి పేరు) "తిరుద్దాండకమ్" అనే పేరుతో వ్యవహరింపబడుతున్నాయి. ఆళ్వార్ల దివ్యప్రబంధ వాఙ్మయంలో తిరుమఙ్గై ఆళ్వార్లు పాడిన దాండకకృతులు రెండు. అవి పాశురాల నిడివిలోని హెచ్చు తగ్గులనుబట్టి "తిరుక్కుఱున్దాణ్డకమ్, తిరునెడున్దాణ్డకమ్" అని పిలువబడు తున్నాయి. ఈ "దాణ్డకమ్" - అనేది దండకమనే సంస్కృత చ్ఛందోవిశేషానికి మాఱురూపమేనని, ద్రావిడచ్ఛందస్సులోని ఒక విలక్షణ ప్రక్రియావిశేషమని - ఈ విధంగా రెండు విధాలైన వాదాలున్నాయి. సంస్కృతభాషలో "దణ్డకమ్" అని వ్యవహరింపబడే ఒక ఛందస్సు ఉన్నది. ఇది చాలా దీర్ఘమైన నాల్గు పాదాలను కల్గిన ఛందోవిశేషమని క్రీ.శ. 2-3 శతాబ్దాల కాలానికి చెందిన "పింగళ ఛంద"మనే ఛందోలక్షణగ్రంథం తెల్పుతున్నది. ఈ విధమైన ఛందస్సులోని ప్రతిపాదంలో 27 అక్షరాలకు తగ్గకుండా 999 అక్షరాలకు మించకుండా ఉండాలని చెప్పబడింది. వృత్తరత్నాకరంలో కూడా "ఏవమేకోన సహస్రాక్షర వృద్ధిర్భవతి దండకమ్ వృత్తమ్" అని తెలుపబడింది. ఈ దాణ్డకమనే ఛందోవిశేషమే ద్రావిడభాషలో "దాణ్డకమ్"గా అయినది- అని కొందఱి సాహిత్య విమర్శకుల వాదన. అయితే, ద్రావిడభాషా కుటుంబానికి చెందిన ఇతరభాషలైన తెలుగు, కన్నడ, మళయాళ భాషలలోమాత్రం ఈ ఛందస్సు పేరు సంస్కృతభాషలోవలె "దణ్డక"మనే వ్యవహరింపబడుతున్నది.

సంస్కృతభాషలోని దండక ఛందస్సునే ద్రావిడభాషలోని "దాండకమ్"గా నిర్దేశిస్తూ వీరశోళ్ళియమ్ అనే లక్షణగ్రంథం, యాప్పరుజ్కలవిరుత్తి అనే లక్షణ గ్రంథం దండకలక్షణనిర్దేశాన్ని చేశాయి. ఇక్కడ విశేషమేమి? అని అంటే, ఈ ఛందస్సు వీరశోళ్ళియంలో "దండక"మనే వ్యవహరింపబడగా, యాప్పరుజ్కల విరుత్తిలో మాత్రం "దాణ్డక"మని నిర్దేశింపబడింది.

సంస్కృతచ్ఛందస్సు ప్రకారం వృత్తం (విరుత్తమ్) అనే సాధారణ నామం నాల్గు పాదాలను కల అన్ని ఛందస్సులను తెలుపుతుంది. పాదాలలో గల అక్షర సంఖ్యనుబట్టి ఛందస్సు అని, దణ్డకమని విభాగింపబడింది. ఒకటి నుండి ఇర్వై ఆఱువరకు గల పరిమితిలో అక్షరాలను కల పాదాలు నాల్గింటితో కూడిన శ్లోకం ఛందమనబడుతుంది. 27గాని, అంతకంటే ఎక్కువ సంఖ్యలోగాని అక్షరాలు ప్రతిపాదంలో ఉంటే అది దణ్డక మనబడుతుంది. దీనినే "దాణ్డకవిరుత్తమ్" అనే పేరుతో యాప్పరుఙ్కలవిరుత్తి వ్యవహరించింది. ఈ లక్షణ గ్రంథంలో మఱి కొన్ని విశేషాలుకూడా ప్రస్తావింపబడ్డాయి. ఒకే పాశురంలో చందవిరుత్తపాదం, దాణ్డకవిరుత్త పాదం- అనే రెండు కలిసివస్తే అది ఛందద్దాణ్డకమని పిలువబడు తుంది. ఛందంలోని, దాండకమ్‌లోని పాదాలలో గల అక్షరసంఖ్యను లెక్కించేటపుడు హ్రస్వ ఉకార, ఇకారాలను ప్రత్యేకాక్షరాలుగా లెక్కించవచ్చు. సంస్కృత ఛ్ఛందస్సులో వలె, హ్రస్వాచ్చు లను, హ్రస్వాచ్చులతో కూడిన హల్లులను లఘువులుగాను, పొల్లు అక్షరాలకు పూర్వం ఉండే అచ్చు లేక, హల్లు, దీర్ఘాచ్చు, దీర్ఘాచ్చులతో కూడిన హల్లు, సంయుక్తాక్షరానికి ముందున్న వర్ణం గురువులుగాను లెక్కింపబడతాయి. (ఉదా:- **అల్, కల్, ఆ, కా, ఆల్, కాల్**- ఇత్యాదులు)

అయితే, యాప్పరుఙ్కలవిరుత్తిలో తెలుపబడ్డ ఈ వివరణలలో కన్పించే కొన్ని వైరుధ్యాలు గమనించదగినవి. సంస్కృతభాషలోని దండక ఛ్ఛందస్సులో ఒక్కొక్క పాదంలోని అక్షరాలు 999 అనే సంఖ్యకు మించకూడదని చెప్పబడగా, ఇక్కడ 47 అక్షరాలకు మించి ఉండకూడదని చెప్పబడింది. సంస్కృతచ్ఛందస్సులో వలె హ్రస్వ ఉకార- ఇకారాలను ప్రత్యేకాక్షరాలుగా లెక్కించడంకూడా ద్రావిడ భాషాచ్ఛందస్సుకు ఏవిధంగాను పొసగదు. అంతేకాక, సంస్కృతచ్ఛందస్సులోవలె లఘువు, గురువు - అనే రీతిలో లెక్కించడం ద్రావిడచ్ఛందస్సుకు అనుగుణంకాదు ఈవిధమైన కారణా లనుబట్టి సంస్కృతభాషలోని దండకమనే ఛందస్సునే ద్రావిడభాషలో దాండకమనే ఛందస్సుగా పైలక్షణ గ్రంథకారుడు చూపించాడని స్పష్టపడుతున్నది. అతడు పల్కిన దాండకలక్షణాలకు అనుగుణంగా విషమసంఖ్యలో అక్షరాలను కల్గిన పాదాలను కల ఏ లక్ష్యాన్ని అతడు చూపించలేక పోవడంకూడా పై విషయాన్ని బలపరుస్తున్నది. నాల్గు పాదాలలోను అక్షరాలసంఖ్య సమంగా ఉండే "అళవియల్ దాణ్డకమ్", విషయసంఖ్యలో ఉండే "అళవ*ళి*ద్దాణ్డకమ్"- అనే రెండు రీతులకు మాత్రమే అతడు ద్రావిడ సాహిత్యంనుండి లక్ష్యాలను ప్రదర్శించగలిగాడు. అతని కాలానికి ముందున్న తిరునావుక్కు అరశర్, తిరుమఙ్గై ఆళ్వార్ మొదలైన

వారి దాణ్డకకృతులనుండి అతడు ఏ ఉదాహరణాన్ని చూపించలేదు- అనే విషయం కూడా గమనార్హం. ఈ కృతులలో దేనిని గూర్చికూడా అతడు ఎక్కడా ప్రస్తావించ లేదు. ఈ గ్రంథాలలోని దాండక ఛందస్సులో రచింపబడ్డ పాశురాల పాదాలలో 27గాని, అంతకంటే తక్కువ సంఖ్యలోగాని అక్షరాలను కల్గి ఉండడమే దీనికి కారణం కావచ్చు.

తిరుమంగై ఆళ్వార్ల తిరునెడున్దాణ్డక ప్రబంధంలోని కొన్ని పాదాలు 27 అక్షరాలు, మఱికొన్ని పాదాలలో 28, 29 అక్షరాలు ఉన్నాయి. ఈ ప్రబంధంలోని ముప్పై పాశురాలలో గల (30 X 4) మొత్తం 120 పాదాలలో పైన తెలుపబడ్డ రీతిలో దాణ్డకలక్షణానుసారంగా 27 గాని, అంతకంటే ఎక్కువ సంఖ్యలో గాని అక్షరాలను కల్గి ఉన్నవి 24 పాదాలు మాత్రమే. అయినా, ఏ ఒక్క పాశురంలోను మొత్తం నాల్గు పాదాలలో అక్షరాల సంఖ్య దాణ్డకచ్ఛందోలక్షణానుసారంగా లేదు - అనే విషయం కూడా గమనించదగినది. యాప్పరుఙ్కల విరుత్తి లక్షణగ్రంథకారుడు పల్కిన రీతిలో హ్రస్వ- ఉకారాన్ని ప్రత్యేకాక్షరంగా లెక్కించి అక్షరాల సంఖ్యలో చేర్చినప్పటికీ మొత్తం 27 అక్షరాలు పలు పాదాలలో లేవు- అనేది కూడా గమనార్హం. ఉదాహరణకు, "ఇన్దిరఙ్కుమ్ పిరమఙ్కుమ్" (4) అని ఆరంభం అయే తిరునెడున్దాణ్డకమ్ 4 వ పాశురంలోని 3వ పాదంలో, 4వ పాదంలో రెండు చోట్ల హ్రస్వ ఉకారం ఉన్నది. ఈ హ్రస్వ ఉకారాలను ప్రత్యేకాక్షరాలుగా లెక్కించినా, ఆ పాదాలలో క్రమంగా 25, 26 అక్షరాలే వాటిలో ఉన్నాయి. పైన పేర్కొన్న కారణాలను బట్టి యాప్పరుఙ్కల విరుత్తి గ్రంథకారుడు తెల్పిన దాణ్డకచ్ఛందస్సు లక్షణం తమిళంలోని దాణ్డక ఛందస్సుకు పొసగలేదు- అని తెలుస్తున్నది.

**తమిళచ్ఛందోలక్షణగ్రంథాలలోని దాణ్డకలక్షణం :**

ఇపుడు, "దాణ్డకమ్" ద్రావిడ ఛందస్సే- అని వాదించేవారి వాదాన్ని కొంచెం గమనిద్దాం. దానికి ముందు ఆళ్వార్లు పాడిన దాణ్డకప్రబంధాలు కూర్పబడ్డ వైఖరిని తెలియడం దాణ్డకాన్నిగూర్చిన పరిశీలనకు కొంత ఉపయోగిస్తుంది.

ఆళ్వార్ల కాలానికి తరువాత వృద్ధి పొందిన ఛందోలక్షణానుసారంగా పరిశీలిస్తే, ఆళ్వార్ల తిరునెడున్దాణ్డకమ్ ఎనిమిది గణాలను కల్గిన "కళినెడిలడి ఆశిరియవిరుత్త" ఛందస్సులో కూర్పబడ్డ ముప్పై పాశురాలను కల్గినది- అని తెలుస్తున్నది. (**కుఱలడి, శిన్దడి, అళవడి, నెడిలడి, కళినెడిలడి** - అనేవి అయిదు విధాలైన పాదాలు) అదే విధంగా "**తిరుక్కుఱున్దాణ్డకమ్**" ఆఱు గణాలను కల్గిన

కళినెడిలడి ఆశిరియ విరుత్తంలో కూర్చబడ్డ ఇరవై పాశురాలను కల్గినది. ఈ దాణ్డక ప్రబంధాలను దృష్టిలో పెట్టుకొని పన్నిరు పాట్టియల్ అనే ద్రావిడ లక్షణ గ్రంథంలో-"మూవిరణ్డేనుమ్ ఇరు నాన్గేనుమ్ శీర్‌వకై నాట్టిచ్చెయ్యుళి నాడవర్ కడవుళర్ పుకళ్‌వన దాణ్డకమ్, అవర్రుళ్ అఱుశీర్ కుఱియదు నెడియదు ఎణ్ శీరామ్" అనే కుఱున్దాణ్డక, నెడున్దాణ్డక లక్షణాలు నిర్వచింపబడ్డాయి. "దాణ్డక చతురర్" అని ప్రసిద్ధి పొందిన తిరునావుక్కు అరశర్ తిరుమంగై యాళ్వార్లకంటే ఎక్కువ దాణ్డక పాశురాలను, అంటే - (98) దాణ్డక పాశురాలను పాడినా, అవి ఏవీ పన్నిరు పాట్టియల్‌లో ప్రస్తావింపబడకపోవడం విస్మయాన్ని కల్గించకమానదు. తిరునా వుక్కు అరశర్ దాణ్డకపాశురాలు ఏవీ ఆ గ్రంథంలో లక్ష్యాలుగా ప్రదర్శింపబడలేదు. ఇదే విధంగా, ఇంకా పలు లక్షణ గ్రంథాలలో కన్పించే దాణ్డక ఛ్ఛందస్సులక్షణాలలో కూడా వ్యత్యాసం కన్పిస్తుంది.

ఇక్కడ ఇంకొక విశేషం ఏమంటే- తిరుమఙ్గై ఆళ్వార్ల తిరుక్కుఱున్దాణ్డకమ్ లోని "ఆవియై అరఙ్గమాలై" (12) ఇత్యాది పాశురానికి, పెరియ తిరుమొళి ప్రబంధంలోని "కైయిలఙ్గాళి శఙ్గన్" (5-9-1) అనే పాశురానికి ఏవిధమైన భేదం ఛందోవిషయంగా లేదు. దానికి ముందు గల పాశురం దాణ్డకచ్ఛందస్సుకు సంబంధించినదిగా, రెండవది అఱుశీర్ ఆశిరియవిరుత్తంగా తెలుపబడడానికి గల కారణమేమో స్పష్టంగా తెలియలేదు. అదే విధంగా, "నెళ్ళురుకి క్కణ్ పనిప్ప" అనే (12) తిరునెడున్దాణ్డక పాశురానికి, "పిఱై తఙ్గు శడైయానై" (3-4-9) అనే పెరియ తిరుమొళి పాశురానికి ఏ భేదం లేకపోయినా, ఒకటి దాణ్డక ఛ్ఛందస్సుకు చెందినదిగా, ఇంకొకటి ఎణ్ శీర్ ఆశిరియ విరుత్తంగా చెప్పబడడంకూడా గమనార్హం. తొణ్డరడిప్పొడి ఆళ్వార్ల "తిరుమాలై" ప్రబంధంలోని పాశురాలు అన్నీ కుఱున్దాణ్డక పాశురాలవలె అఱు శీర్ ఆశిరియవిరుత్తంలో రచింపబడినవే. కాని, వాటికి దాణ్డకమనే పేరులేదు.

ఈ ప్రశ్నకు- యాప్పరుఙ్కలవిరుత్తికారుడు ఇచ్చిన ఈ క్రింది వివరణం కొంత సమాధానాన్ని ఇస్తున్నది. ఆ వివరణం ఏమంటే- "దాణ్డకమ్ ఎన్పదు తొల్‌కాప్పియరాల్ కొచ్చక ఒరుపోకు ఎనవుమ్, కాక్కైపాడినియార్ పోన్ఱ ఒరుశార్ ఆశిరియరాల్ పావినమాకవుమ్ కొళ్ళపట్టతు" అని. ఈవివరణాన్నిబట్టి దాణ్డకమనేది కొన్ని (వృత్తాల) పాశురాల సమూహంగా కొంతమంది లక్షణకర్తలు అభిప్రాయ పడ్డారని తెలుస్తున్నది. ఈ విధమైన కొన్ని వృత్తాల సమూహం సంస్కృతభాషలోని "దణ్డక" ఛందోవిశేషాలలోని ఒక దణ్డకమై, ద్రావిడభాషలో "దాణ్డక"మనే పేరును

పొంది ఉండవచ్చునని - ద్రావిడసాహిత్యవిమర్శకులైన శ్రీ డా. ఎం. శ్రీనివాసన్ గారి అభిప్రాయం.

సంస్కృత భాషలోని దణ్డకలక్షణాన్నిబట్టి దండక మనేది నాల్గు పాదాలను కల్గినదై, ఒక్కొక్క పాదంలో 27 అక్షరాలనుండి 999 అక్షరాలవరకు కల్గినదై ఉండవచ్చును. ఈ విధమైన దైర్ఘ్యాన్ని పాదాలు కల్గి ఉండడంవల్ల అసంపూర్ణ క్రియారూపాలతో కూడినవై ఉండే తీరు దాణ్డకవృత్తాలలో ఏర్పడింది. గమనించదగిన ఈ ప్రత్యేకతను ద్రావిడ దాణ్డకచ్ఛందస్సులో చూడవచ్చు. ఉదాహరణంగా, "మిన్నురువాయ్" అనే తిరునెడున్దాణ్డక ప్రబంధంలోని మొదటి పాశురాన్ని గమనించవచ్చు. ఈ పాశురం లోని పాదాల చివరలోగాని, మధ్యలో గాని, చివరలో కాని సంపూర్ణ క్రియారూపం లేకుండా, అసంపూర్ణమైన క్రియను తెలిపే పలు కృదంతరూపాలు ప్రయోగింప బడడాన్ని గమనించవచ్చు. ఈ రీతిని ఈ ప్రబంధం లోని చాలా పాశురాలలో చూడవచ్చు. ఇదే తీరు తిరుక్కుఱున్దాణ్డకంలో కూడా కన్పిస్తుంది. ఈ ప్రబంధంలోని మొదటి పాశురంలోని నాల్గవ పాదంలో గల "విదియునై' అనే పదం తరువాత వచ్చే "కణ్డుకొణ్డ... నినకిలేనే" అనే సంపూర్ణక్రియారూపంనుండి వేఱుచేసి, ఆ తరువాత గల మూడు పాశురాలను ఏకవాక్యంగా, చేసి అన్వయిస్తే ఆళ్వార్లు భగవానుని వరుసగా నాల్గు పాశురాలలో కీర్తించడం ఈ క్రింది రీతిలో కన్పిస్తుంది.

"వితియునై, పవళత్తూణై, నినైయ వల్లార్ కతియునై, అణ్డమాళుమ్ మతియునై, మాలై, వితియునై, కాఱ్ఱినై, పులనై, తీయై, ఇలఙ్గై శెఱ్ఱ ఏఱ్ఱినై, ఎఱిల్ మణిత్తిరళై, ఇన్ప ఆఱ్ఱినై, అముదన్దన్నై, అవుణర్ ఉయిర్ ఉణ్డ కూఱ్ఱినై, వానోర్క్కు అముదమ్ కొణ్డ అప్పనై, ఎమ్బిరానై, మాలిరుమ్శోలై మేయ మైన్దనై, కేళలాయ్ ఉలకమ్ కొణ్డ పూక్కోళు వణ్ణనారై వేట్కైమీదూర విళుఙ్గినేనే".

ఇదే రీతిలో మధ్యలో 5వ పాశురం తప్ప 6, 7, 8 పాశురాలలోకూడా ఇటువంటి అనుగతమైన క్రమాన్ని గమనించవచ్చు. 9వ పాశురంనుండి 11 చివరి వరకు గల మూడు పాశురాలు భగవానుని సంబోధిస్తూ పల్కినవి. 12 నుండి 20 వరకు గల మిగిలిన పాశురాలలో ఆళ్వార్లు తమకు కల్గిన వివిధాలైన భగవదనుభవా లనుగూర్చి పల్కి ఈ ప్రబంధాన్ని పూర్తిచేశారు. అందువల్ల ఈ విధంగా అనుగతమైన పాఠం పర్యక్రమాన్ని కల పాశురాలతో కూడిన ఈ ప్రబంధాలను మిగిలిన ప్రబంధాల నుండి వేఱు చేసి, వీటికి "దాణ్డక" ప్రబంధాలని పేరు పెట్టి ఉండవచ్చునని శ్రీ ఎం.శ్రీనివాసన్ గారి అభిప్రాయం.

దాణ్డకప్రబంధాలను ఇతరప్రబంధాలకంటే విలక్షణమైనవిగా చెప్పడంలో ఇంకొక కారణాన్నికూడా శ్రీనివాసన్ గారు అభ్యూహించారు. ఈ దాణ్డకప్రబంధాలు ఒక విలక్షణమైన, శ్రవణపేయమైన ప్రక్రియలో గానం చేయబడడం అనేది ఈ కారణమని వారు అన్నారు. నాలాయిర దివ్యప్రబంధంలో "ఇయఱ్పా" అనే మూడవ సహస్రంలోని పాశురాలు తప్ప, మిగిలిన మూడు సహస్రాలలోని పాశురాలు "ఇశైప్పాక్కళ్" (సంగీతాత్మకంగా గానం చేయబడే పాశురాలు). తిరుమఙ్గై యాళ్వార్ల దాణ్డకప్రబంధాలు పెరియ తిరుమొళి అనబడే రెండవ సహస్రంలో చేర్చబడడంవల్ల, ఇవి "ఇశైప్పాక్కళ్" అనే విషయం స్పష్టం. తిరునెడున్దాణ్డక ప్రబంధంలోని 21వ పాశురంలో గల "నైవళమ్ ఒన్ఱారాయా నమ్మై నోక్కా" అనే ప్రయోగంలో "నైవళమ్" అనే సంగీతానికి సంబంధించిన ఒక పదం ఉన్నది. దీనిని వ్యాఖ్యాతృ చక్రవర్తి పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానిస్తూ "కేట్టారోడు శొన్నారోడు వాశియఱ నైవిక్కుమ్పడియాన అళగై యుడైత్తాన పణ్ణై నుణుక్కి" అని అన్నారు. దీనివల్ల మనస్సును ద్రవింపజేసే మధురమైన రీతిని ఈ పాశురాలు కల్గి ఉన్నాయని తెలుస్తున్నది. ఆళ్వార్ల దాణ్డక ప్రబంధంలోని సంగీతమాధుర్యాన్నిగూర్చి సూచించే ఈ పదప్రయోగం మాత్రమే కాక, గురుపరంపరాప్రభావంలో కన్పించే ఒక ఐతిహ్యంకూడా ఈ సందర్భంలో అనుసంధేయం. తిరుమఙ్గై యాళ్వార్లు తామే శ్రీరంగనాథుని సమక్షంలో తిరునెడున్దాణ్డక ప్రబంధాన్ని భగవానుని మనస్సు కఱగే రీతిలో గానం చేశారని ఆ ఐతిహ్యం తెల్పుతున్నది. దీనినిబట్టి ఈ ప్రబంధాలు మనస్సును మిక్కిలి ఆకర్షించే ఒక విలక్షణమైన గానప్రక్రియలో పాడబడేవి- అని తెలుస్తున్నది. "ఈ విధమైన విలక్షణగానప్రక్రియలో పాడబడడాన్నిబట్టి కూడా దాణ్డక ప్రబంధాలు మిగిలిన ప్రబంధాలకంటే ప్రత్యేకమైనవిగా పరిగణింపబడి ఉండవచ్చు. అయితే, ఈ నాడు ఆ విలక్షణమైన గానప్రక్రియ ఎటువంటిదో మనం తెలియగల్గిన స్థితిలో లేము. ఆ సంప్రదాయం ఇపుడు లోపించింది. నిజానికి ద్రావిడసాహిత్యంలోని దాణ్డకప్రబంధాలకు సంబంధించిన లక్షణవివరాలు సమగ్రంగా మనకు లభించడం లేదు. ఈ విషయంలో మరింత పరిశోధన చేయవలసిన ఆవశ్యకత ఉన్నది"అని శ్రీ శ్రీనివాసన్ గారు అభిప్రాయపడ్డారు.

ఈ విధంగా దాణ్డకమనేది ఒక విలక్షణద్రావిడ ఛందోప్రక్రియ అయినా, సుమారు 100-120 సంవత్సరాలుగా ఇంతవరకు ముద్రింపబడ్డ ఇంచుమించు అన్ని నాలాయిరదివ్యప్రబంధగ్రంథాలలో తిరుక్కుఱున్దాణ్డకమ్ లోని వృత్తం అఱు

శీర్ విరుత్తమని, తిరునెడున్దాణ్డకమ్ లోని వృత్తం ఎణ్శీర్ విరుత్తమని, సూచింప బడ్డాయి. "బహుశః కాలగమనంలో దాణ్డక మనేది విలక్షణమైన ఛందోరీతి అనే విషయాన్ని ద్రావిడ సాహిత్యలోకం మఱచిపోయిందో? ఏమో? కాని. విలక్షణ ప్రక్రియ అయిన దాణ్డకాన్ని ఒక వృత్తవిశేషంగా నిర్దేశించడం సరిగా తోచదు"- అనికూడా శ్రీనివాసన్‌గారు అభిప్రాయపడ్డారు.

తిరుమఙ్గైయాళ్వార్లు, తిరునావుక్కు అరశు- అనే ఇద్దరు తమిళకవులు తప్ప తరువాత వేఱెవరూ దాణ్డకచ్ఛందస్సులో కృతులను రచించినట్లు కానరాదు. దీనికి కొన్ని కారణాలను శ్రీ శ్రీనివాసన్ గారు ఈ క్రిందవిధంగా అభ్యూహించారు.

సామాన్యంగా చూస్తే, అఱుశీర్, ఎణ్ శీర్ విరుత్తాల ఛందస్సుకు, దాణ్డక ఛందస్సుకు వ్యత్యాసం ఎక్కువ కన్పించకపోవడం. ఈ దాణ్డక ఛందస్సు సంస్కృత చ్ఛందోవిశేషమైనా, ద్రావిడచ్ఛందోవిశేషమైనా, లక్షణకర్తలు దీని లక్షణాలను సుస్పష్టంగా నిర్దేశించకపోవడం - అనేవి ఆ హేతువులు.

దాణ్డకచ్ఛందోప్రక్రియనుగూర్చి విస్తృతమైన పరిశోధనను చేసిన శ్రీ శ్రీనివాసన్ గారు ఇంకొక ఆసక్తికరమైన విషయాన్నికూడా ప్రస్తావించారు. "దణ్డకమాలై" అనే ఇంకొక ద్రావిడప్రబంధప్రక్రియా విశేషం లక్షణగ్రంథాలలో తెలుపబడింది. ఇది "దాణ్డకమ్"కంటే భిన్నమైనది. మూడు వందల వెణ్బా వృత్తాల సంపుటి ఇది. అయితే "దణ్డక మాలై" అనే ఈ పదం ఎక్కడ నుండి ద్రావిడసాహిత్యం లోకి వచ్చింది? ఇది సంస్కృతపదమా? లేక, ద్రావిడ పదమయితే. మూలపదం ఏది? అనే సందేహాలు కలుగుతాయి. తెలుగు భాషలో "దండ" అనే పదం మాల, మాలిక- ఇత్యాది అర్థాన్ని ఇస్తుంది అని, "దణ్డకా" అనేది మాలవలె భగవానుని, లేక, ఇష్టదేవతను విరంతరంగా కీర్తించడానికి ఉపయోగించే సాహిత్య ప్రక్రియ - అని చెప్పబడుతున్నది. దీనివల్ల తెలుగులో దణ్డకప్రబంధాలకంటే ద్రావిడంలోని "దాణ్డకమ్" విలక్షణ మైనది- అని స్పష్టమవుతున్నది. ఈవిధంగా ఏరీతిలో చూచినా "దణ్డకమ్" (లేక) "దాణ్డకమ్" అనే ఛందోవిశేషాలు లక్షణగ్రంథాలలో స్పష్టంగా నిరూపింపబడలేదేమో!- అనే అభిప్రాయమే బలంగా కల్గుతుంది.

దివ్యసూరుల ప్రబంధాలలో పలుచోట్ల పరస్పర సూక్తి సామ్యాలు గోచరిస్తాయి. ఇవి సహృదయ పాఠక జనరంజకాలు. ప్రకృత ప్రబంధంలో కన్పించే కొన్ని సామ్యాలు విన్నపింపబడుతున్నాయి.

## తిరుక్కుఱున్దాణ్డకసూక్తులతో పలువురి ఆళ్వార్ల సూక్తుల సామ్యాలు

### 1. గోదాదేవి శ్రీసూక్తితో సామ్యం :

గోదాదేవి తిరుప్పావైప్రబంధంలోని ప్రారంభ పాశురంలో "నారాయణనే నమక్కే పఱై తరువాన్" అని అంటూ ప్రాప్య-ప్రాపక- అధికారినిర్దేశాన్ని చేశారు. ఈ సూక్తిలో "పఱై" అని ప్రాప్యనిర్దేశం. "నారాయణనే" అని ప్రాపకనిర్దేశం, "నమక్కే" అని అధికారినిర్దేశం చేయబడ్డాయి. ఇదే రీతిలో, తిరుక్కుఱున్దాణ్డక ప్రబంధంలోని మొదటి పాశురంలో "విదియినై" అని ప్రాప్యనిర్దేశం, "కతియినై" అని ప్రాపకనిర్దేశం, "నినైయవల్లార్" అని అధికారినిర్దేశం చేయబడ్డాయి. ఈ విధంగానే, తిరునెడున్దాణ్డక ప్రబంధంలోని 10వ పాశురంలో "పొన్నానాయ్" అని ప్రాప్యనిర్దేశం, "ముదలానాయ్" అని ప్రాపకనిర్దేశం, "తొణ్డనేన్" అని అధికారినిర్దేశం చేయబడడం గమనించవచ్చు.

తిరుమంగైమన్నన్ "కఞ్జన్ మాళ క్కణ్డు.... మతియినై" అని అంటూ మొదటి పాశురంలో కంసుని వధించి, లోకంలోని కలుపు తీసివేసిన తరువాతకూడా, "కన్న తల్లిదండ్రులు ఎమయ్యారో!" అని వారిపట్ల వ్యామోహాన్ని భగవానుడు ప్రదర్శించాడని అన్నారు. ఇదే భావాన్ని గోదాదేవి తిరుప్పావైలోని 25వ పాశురంలో- "కఞ్జన్ వయిత్రిల్ నెరుప్పెన్న నిన్ఱ నెడుమాలే!" అని అంటూ కంసుని వధించిన శ్రీకృష్ణుని మనస్సు అపుడు శ్రీవసుదేవునిపట్ల, శ్రీదేవకీదేవిపట్ల లగ్నమైనదని తెలిపారు.

### 2. నమ్మాళ్వార్ల శ్రీసూక్తితో సామ్యం :

నమ్మాళ్వార్లు తిరువాయ్మొళ్రి ప్రబంధంలో "విత్తివాయ్క్కిన్ఱు" (5-1-1) అని, "శూళ్రన్దదాల్" (2-7-6) అని, "నన్ఱుశూట్టు విత్తి ఎయ్దినమ్" (4-5-7) అని పలుచోట్ల విధిశబ్దాన్ని భగవన్నిర్హేతుక కృపాపరంగా ప్రయోగించారు. "విత్తివాయ్ క్కిన్ఱు" అనే శ్రీసూక్తిలోని "విత్తి" శబ్దాన్ని వమ్బిళ్ళై- "విత్తి యెన్గిఱతు - భగవత్కృపైయై. కేశవన్ తమర్క్కు ఇప్పాలెల్లామ్ ఇవర్ 'విత్తి' యెన్గిఱతు భగవత్కృపైయై. అతుక్కడి - అవనాల్ తప్ప వొణ్ణాతపడి యిరుక్కైయాలే". అని "విత్తి శూళ్రన్దదాల్" అనే శ్రీసూక్తిలోని "విత్తి" శబ్దాన్ని "విత్తి ఎన్గిఱతు భగవత్కృపైయై. భగవత్కృపైయై విత్తి ఎన్నానెన్? ఎన్నిల్, అవనుక్కు త్తప్పవొణ్ణాతా కైయాలే. వామ్ నినైత్తవై తలైక్కట్టవొట్టాత కర్మమ్పోలే, ఈశ్వరన్ నినైత్త కార్యజ్గళుమ్ కృపాపరతంత్రనాయ్ తలైక్కట్టమాట్టాన్" అని, "నన్ఱు శూట్టు విత్తి యెయ్తివమ్" అనే సూక్తిలోని విత్తిశబ్దాన్ని - "ఇవర్ ఇప్పోతు విత్తి - ఎన్గిఱతు, భగవత్కృపైయై; తమక్కు ఫలిక్కైయాలుమ్, అవనుక్కు త్తవిర వొణ్ణాతాకైయాలుమ్ విత్తి ఎన్గిఱార్. "విత్తి శూళ్రన్దదాల్" ఎన్ఱతితే" అని వ్యాఖ్యానించారు.

తిరుమంగైమన్నన్ కూడా తిరుక్కుఱున్దాణ్డకమ్‌లో "వితియినై" (1) అని అంటూ ఈ అర్థంలోనే "వితి" శబ్దాన్ని ప్రయోగించడం గమనార్హం. "అవన్ స్వాతంత్ర్యత్తాలుమ్, ఎన్ కర్మత్తాలుమ్ తవిర్క్కవొణ్ణాత కృపై. ఇవ్వళవాన పేఱ్ఱుక్కడియాన తమ్ముడైయ సుకృతత్తై చ్చొల్లుకిఱార్" అని అంటూ ఈ శబ్దాన్ని వ్యాఖ్యాతృచక్రవర్తి పెరియవాచ్చాన్ పిళ్ళై కూడా వివరించారు.

ఇదే రీతిలో, "వైత్త మానిది" అని అంటూ నమ్మాళ్వార్లు భగవానుని నిధిగా స్తుతించగా, తిరుమంగై మన్నన్‌కూడా -"విదియినై" అని కీర్తించారు. ఈ సూక్తులు- "తత్ యథా హిరణ్యనిధిం నిహితమ్" అనే శ్రుతిని, "నిధిరవ్యయః" అనే ఉపబృంహణసూక్తిని అనుసరించి ప్రయోగింపబడడం గమనించవగినది.

3. తొణ్డరడిప్పొడి ఆళ్వార్ల శ్రీసూక్తితో సామ్యం :

తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు తిరుమాలై ప్రబంధంలో "తొణ్డు పూణ్డు" (5) అని అంటూ భగవద్దాస్యాన్ని ఆత్మాలంకారంగా నిర్దేశించారు. ఈ సూక్తిని (తొణ్డు పూణ్డు) అడిమై పూణ్డు. తనక్కు వకుత్త శేషవృత్తియై యేఱిట్టుక్కొణ్డు.... "పూణ్డు" ఇవ్వాత్మావుక్కు దాస్యమిఱే ఆభరణమ్. "ద్రుమచీరైరలంకృతః" ఎన్గతు ఆభరణమానాప్పోలే. నమ్బెరుమాళుక్కు శేరశున్దరపాణ్డియన్ తమ్బిరాన్ పతక్కమ్ పోలే, ఇవనుక్కు దాస్యమిఱే ఆభరణమ్. అవనుక్కు అతు నెఞ్జిలే కిడప్పదొన్ఱు. ఇవనుక్కుమ్ ఇతు నెఞ్జిలే కిడప్పదొన్ఱిఱే. "ఇడుమ్బై" పూణ్డు" ఎన్గిఱతు పోలన్ఱేయిదు. ఇడుమ్బై పూణ్డు - మహాదుఃఖజ్గళై ఏఱిట్టుక్కొణ్డు" అని పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానించారు.

తిరుమంగైమన్నన్ కూడా తిరుక్కుఱున్దాణ్డకమ్‌లో - "అడిమై పూణ్డు"(5) అని అంటూ భగవద్దాస్యాన్ని ఆత్మాలంకారంగా పలుకగా. ఈ సూక్తిని పెరియ వాచ్చాన్‌పిళ్ళై- "(అడిమైపూణ్డు) - "తొణ్డు పూణ్డు" ఎన్నుమాపోలే. ఇవ్వాత్మావుక్కు ఆభరణమిఱే భగవద్దాస్యమ్. అకైయాలిఱే పూణ్డు ఎన్గిఱార్." అని అంటూ తొణ్డరడిప్పొడి ఆళ్వార్ల సూక్తిని ఉదాహరిస్తూ వివరించడంవల్ల ఈరెండు సూక్తులలోని అర్థసామ్యం స్పష్టం.

ఇదే రీతిలో నమ్మాళ్వార్ల "తీర విరుమ్బుణ్డ నీరతుపోల" అనే పాశురాన్ని అనుసరిస్తూ "ఇరుమ్బునన్తుణ్డ" అనే తిరుక్కుఱున్దాణ్డక పాశురం రచింప బడింది.

4. కులశేఖరప్పెరుమాళ్ శ్రీసూక్తితో సామ్యం :

కులశేఖరప్పెరుమాళ్ అనుగ్రహించిన పెరుమాళ్ తిరుమొழி ప్రబంధంలో భగవానుని భోగ్యతను -"ఇన్బప్పావినై" (1-4) అని అంటూ తమ పాశురాలలోని భోగ్యతతో పోల్చి నిరూపించారు. ఇదే భావాన్ని తిరుమంగైమన్నన్- "ఇన్బప్పావినై" (6) అని అంటూ తెలిపారు. దీనిని పెరియవాచ్చాన్పిళ్ళై- "శెవిక్కు తమ్ముడైయ కవిపోలే తిత్తిత్తిరుక్కుంపడి. పావెన్బతు- ఇయల్. పాట్టు- ఎన్నుమామ్" అని వ్యాఖ్యానించడం గమనార్హం.

5. పూదత్తాழ்వార్ల శ్రీసూక్తితో సామ్యం :

"పత్తిమైక్కన్బుడైయే నావతే పణియాయ్" అని అంటూ తిరుమంగై మన్నన్ అవధి దాటిన తమ భక్తిని పరిమితం చేయమని భగవానుని ప్రార్థించారు. ఈ సూక్తిని వ్యాఖ్యానించే పెరియవాచ్చాన్ పిళ్ళై- "ఎన్తనళవన్తాల్ యానుడైయ అన్బు" ఎన్నుమ్బడియే నూత్ప్రడిత్త భక్తియై అళవాక్కవేణుమ్" అని పూదత్తాழ்వార్ల సూక్తిని ఉదాహరించడంవల్ల ఈ రెండు సూక్తులలోని సామ్యం సుస్పష్టం.

6. తిరుప్పాణ్ ఆழ்వార్ల శ్రీసూక్తితో సామ్యం :

తిరుప్పాణ్ఆழ்వార్లు అమలనాదిపిరాన్ ప్రబంధంలో శ్రీరంగనాథుని పాదకమలయుగం తమ కంటిలోపల సాక్షాత్కరిస్తున్నాయని అంటూ "తిరుక్కమల పాదమ్ వన్దు ఎన్ కణ్ణినుళ్ళన" అని అన్నారు. ఈ సూక్తిని వ్యాఖ్యానించే పెరియ వాచ్చాన్పిళ్ళై - "సదా దర్శనమ్ పణ్ణుకిఅవర్కళ్ కణ్ణుక్కిలక్కానదు విరోధమ్ పణ్ణినేన్. పోక్కఱ్ఱవాతే ఎన్ కణ్ణై చ్చెమ్బుళిత్తేన్. తొడర్న్దు వన్దు శెమ్బుళిత్త కణ్ణై యుఱుత్తు ఉళ్ళే పుకున్దు నిత్త్కియాలే, "ఎన్కణ్ణినుళ్ళన" ఎన్గిఱార్. అన్ఱియే, తన్ కణ్ణాలే పార్క్కై అవద్యమెన్ఱు కణ్ణై చ్చెమ్బుళిత్తార్. కణ్ణినుళ్ళే ప్రకాశిక్కత్తొడజ్గిఱ్ఱు". (సదాదర్శనం చేసేవారి కన్నులకు లక్ష్యమైనది సుమా. నాకంటికి లక్ష్యమవుతున్నది. సాధ్యమైనంతకాలం అడ్డం పెట్టాను. (నాకు) సాధ్యం కానపుడు కళ్ళను మూసి కొన్నాను. వెంబడించి వచ్చి మూసిన కళ్ళలో ప్రవేశించి నిలచినందువల్ల "ఎన్ కణ్ణినుళ్ళన" అని అంటున్నారు.- అని భావం. లేక, తమ కంటితో చూడడం దోషం - అని కంటిని మూసికొన్నాను. కంటిలోపల (పాద పద్మాలు) ప్రకాశించడం ఆరంభించాయి) అని భావం.

ఇదే భావాన్ని తిరుమంగైమన్నన్ తిరుక్కుఱున్దాణ్డకమ్‌లో "ఎన్కణ్ణుళ్ళే తోన్ఱినారే" అనే సూక్తిద్వారా తెలిపారు. దీనిని వ్యాఖ్యానిస్తూ పెరియవాచ్చాన్పిళ్ళై-

"ఎన్ కణ్ ఇవ్వడినై నమ్ కణ్ణాలే నోక్కి అళ్ళిక్కవొణ్ణాతెన్ఱు కణ్ణై చ్చెమ్బులిత్తేన్. కణ్ణుక్కుళ్ళే తోన్ఱివార్. ఇవర్ కణ్ శెమ్బులిత్తు ప్పార్క్కిఱదెప్పోదో? ఎన్ఱు పార్త్తిరున్దాన్‌పోలే కాణుమ్ అవమమ్" (ఈ రూపాన్ని నా కన్నులతో చూచి పాడు చేయరాదు- అని కళ్ళను మూసికొన్నాను. నా కంటి లోపల ప్రకాశించాడు. వీరు కళ్ళను మూసికోవడం ఎపుడో? అని వేచి చూస్తున్నాడు కాబోలు అతడు) అని రస్యంగా వ్యాఖ్యానించడాన్ని బట్టి ఈ రెండు సూక్తుల మధ్యగల భావసామ్యం సుస్పష్టం.

7. పెరియాళ్వార్ శ్రీసూక్తితో సామ్యం :

పెరియాళ్వార్లు తమ దివ్యప్రబంధంలో "ఇన్దిరనోడు .... వెళ్ళఱై విన్ఱాయ్" (2-8-1) అని అంటూ బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు సమారాధనోపకరణాలను గ్రహించివచ్చి, తిరువెళ్ళఱై దివ్యక్షేత్రంలోని స్వామిని అర్చించి, మంగళాశాసనం చేస్తారు- అని తెలిపారు. ఆ విధంగా బ్రహ్మరుద్రేంద్రార్చితుడైన తిరువెళ్ళఱైలోని స్వామి పుండరీకాక్షుడనే విషయాన్ని కలియన్ "వానవర్ త..ళ్ కోనుమ్... శెఙ్గణ్‌మాలై" (20) అని అంటూ తిరుక్కుఱున్దాణ్డకమ్‌లో పలికారు. ఒకరు స్వామి ఊరును, పేరును, ఇంకొకరు అతని పేరును గూర్చి చెప్పారు తప్ప, విషయం మాత్రం ఒకటే.

8. పొయ్‌కై ఆళ్వార్ల శ్రీసూక్తితో సామ్యం :

పొయ్‌కై ఆళ్వార్లు ముదల్ తిరువన్దాది ప్రబంధంలోని 69వ పాశురంలో వటపత్రశాయి వృత్తాంతాన్ని ప్రస్తావిస్తూ,- "ఆ మఱ్ఱి ఆకు ప్రళయజలంలో ఉన్నదా? ఆకాశంలోనా? భూమిపైనా? ఎక్కడ ఉన్నదో చెప్పు"మని అంటూ "ఆలన్ఱు వేలైనీరుళ్ళతో... శోలై శూళ్ కున్ఱెడుత్తాయ్‌శొల్లు" అని ప్రశ్నను అడిగినట్లే తిరుమంగై మన్నన్‌కూడా తిరుక్కుఱున్దాణ్డకమ్‌లో "కేట్క యానుఱ్ఱతుణ్డు" అని చమత్కారంగా ఒక ప్రశ్నను సంధించారు.

9. తిరుమళిశై ఆళ్వార్ల శ్రీసూక్తితో సామ్యం :

భగవానుడు కృతయుగం మొదలైన ఆ యా యుగాలలో శ్వేతవర్ణం మొదలైన వర్ణాలను కల్గి ఉంటాడని తిరుమళిశై ఆళ్వార్లు "పాలిన్ నీర్మై శెమ్బొ నీర్మై" (44) అనే సూక్తిద్వారా తెలిపిన విషయాన్ని తిరుమంగై మన్నన్‌కూడా "శెమ్మైయై క్కరుమైతన్నై" (7) అనే ప్రయోగం ద్వారా వ్యక్తంచేశారు.

పలువురి ఆళ్వార్ల శ్రీసూక్తులతో తిరుక్కుఱున్దాణ్డకమ్‌లోని తిరుమంగై మన్నన్ ప్రయోగాలకు గల శబ్దార్థసామ్యాలను ఇంకా ఈ విధంగానే గమనించ వచ్చు. ఇక్కడ ఇవి కేవలం సూచనాప్రాయంగా మాత్రమే తెలుపబడ్డాయి. ఇంతేకాక, తిరుమంగైమన్నన్ మిగిలిన ప్రబంధాలలోని ప్రయోగాలతో తిరుక్కుఱున్దాణ్డకమ్‌ లోని సూక్తులకు గల శబ్దార్థసామ్యాలు కూడా గమనించదగినవి.

"ఇరుపాడెరికొళ్ళియినుళ్ ఎఱుమ్బేపోల్" అని పెరియ తిరుమొழிతో సూక్తితో (11-8-4) "ఎరినిన్ఱుణ్ణుమ్ కొళ్ళిమేల్ ఎఱుమ్బుపోల" అనే తిరుక్కుఱున్దాణ్డక సూక్తికి గల శబ్దార్థసామ్యం "మూవరిల్ మున్ ముదల్‌వన్" (9-9-1) అనే పెరియ తిరుమొழி సూక్తితో "మూవరిల్ ముదల్‌వనాయ" (6) అనే సూక్తికి గల శబ్దార్థసామ్యం, "అక్కారక్కని" (8-9-4) అనే సూక్తితో "కరుమ్బినిన్ శాఱ్ఱై" (8) అనే సూక్తికి గల అర్థసామ్యం ఈ విషయంలో ఉదాహరణాలు.

పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్య :- నాలాయిర దివ్యప్రబంధవాఙ్మయాన్ని పూర్తిగా వ్యాఖ్యానించిన పరమకారుణికులు, వ్యాఖ్యాతృచక్రవర్తి పెరియవాచ్చాన్ పిళ్ళై ఈ ప్రబంధానికికూడా నాతివిస్తృతమైన, పరమభోగ్యమైన వ్యాఖ్యానాన్ని ప్రసాదించారు. దివ్యసూరిభావమర్మజ్ఞులైన ఈ ఆచార్యవర్యులు ఆ యా సందర్భా లలో చేసిన మధురమైన వివరణలు తెన్నాచార్య సంప్రదాయతత్త్వాలకు కరదీపికలు. ఉదాహరణంగా ఒక సందర్భాన్నిమాత్రం విన్నపిస్తాను.

శ్రీపిళ్ళైలోకాచార్యులవారు శ్రీవచనభూషణమనే దివ్యగ్రంథంలో "తనక్కు త్తాన్ తేడుమ్ నన్మై తీమైయోపాతి విలక్కాయిరుక్కుమ్" అని సూత్రీకరించగా, ఈ సూత్రాన్ని శ్రీవరవరమునులు- "శేషియానవన్ భోగదశైయిల్ తన్ వ్యామోహత్తాలే 'ఆరుయిర్ పట్టతు ఎనదుయిర్ పట్టతు' ఎన్ఱుమ్బడి తన్ తిఱత్తిల్ మికవుమ్ తాழ நిన్ఱు పరిమాఱుమళవిల్, 'నా శేషభూతనన్నో! నమ్ శేషత్వత్తై నోక్కవేణ్డావో? ఎన్ఱు స్వనైచ్యానుసంధానత్తాలే పిఱ్కాలిత్తు, తనక్కు త్తాన్ తేడుకిఱ శేషత్వమాన నన్మై అనాదికాలమ్ "స్వతంత్రోఽహమ్ ఎన్ఱిరున్ద తీమైయోపాతి అవన్ భోగత్తుక్కు ప్రతిబంధకమాయిరుక్కుమెన్గై" అని వివరించారు. ఇటువంటి వివరణాన్నే పెరియవాచ్చాన్‌పిళ్ళై - "తిరువినై మరువి వాழ்వార్" (8) అనే ప్రకృత ప్రబంధసూక్తిని వ్యాఖ్యానిస్తూ తెలిపారు. "వాழ்వుక్కైక్కు నేర్‌త్తి అవన్ మేల్ విழ விలక్కాదొழிకై. ఉజ్జ్వలుక్కు నాన్ వేణు మెన్న, ఎజ్జులుక్కు నీ వేణ్డా ఎన్నుమవర్ కళ్" అనే ఆ సందర్భంలోని వ్యాఖ్యానసూక్తి స్మరణీయం. శ్రీపిళ్ళై లోకాచార్యులువారి

సూత్రానికి తిరుమంగైమన్నన్ శ్రీసూక్తి మూలంకాగా, దానిని పైవిధంగా శ్రీవరవర మునులు వ్యాఖ్యానించడానికి పెరియవాచ్చాన్‌పిళ్ళై శ్రీసూక్తి మూలం- అన్నది స్పష్టంకదా!

పెరియవాచ్చాన్ పిళ్ళై తమ కాలానికి ముందున్న ఇతరవ్యాఖ్యానాలను కూడా తమ వ్యాఖ్యలలో అక్కడక్కడ ప్రస్తావించారు. ఉదాహరణానికి - రెండవ పాశుర వ్యాఖ్యానంలో "ఇమయ మేయ" ఇత్యాది ప్రయోగానికి పూర్వులు చేసిన ఒక వివరణాన్ని ప్రస్తావించడం గమనించవచ్చు. ఆ యా సందర్భాలలో పొగిలిన ఆళ్వార్ల శ్రీసూక్తులతో గల సామ్యాలనుకూడా వీరు ప్రస్తావించారు. ఉదాహరణగా - "అడిమై పూణ్డు" అనే ప్రయోగాన్ని వివరిస్తూ - అదే అర్థాన్ని ఇచ్చే "తొణ్డు పూణ్డు" అనే తొణ్డరడిప్పొడి ఆళ్వార్ల సూక్తిని ప్రమాణంగా ప్రస్తుతించడం గమనించవచ్చు. "ఇళప్పినై" అనే 8వ పాశురాన్ని ఈ ఆచార్యవర్యులు యోగ శాస్త్రాను గుణంగా వివరించడమేకాక, ఆ సందర్భంలో పాతంజలయోగసూత్రాన్ని ప్రమాణంగా ఉట్టంకించారు. ఇది దివ్యసూరుల యోగశాస్త్ర ప్రావీణ్యాన్ని నిరూపించడమే కాక, పెరియవాచ్చాన్‌పిళ్ళైకు గల సర్వశాస్త్రవైశారద్యాన్ని స్పష్టం చేస్తున్నది. నిజానికి తిరుప్పావై, తిరుచ్ఛన్దవిరుత్తం వంటి పలు దివ్యప్రబంధాలలోని పలు పాశురాలను యోగశాస్త్రదృష్టిలో అధ్యయనం చేయవలసిన ఆవశ్యకత ఉన్నదని తోస్తుంది. ఈ విధంగా పలు రీతులలో పెరియవాచ్చాన్ పిళ్ళైవ్యాఖ్య పరమ విలక్షణమైనది.

దివ్యార్థదీపికావ్యాఖ్య :- గత శతాబ్దిలో శ్రీవైష్ణవ సంప్రదాయాన్ని, విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని ఆ సేతుహిమాచలం పలు రీతులలో ప్రచారం చేసిన మహనీయులు, పద్మవిభూషణ కాంచీ ప్ర.భ. అణ్ణంగరాచార్య స్వామివారు పెరియవాచ్చాన్‌పిళ్ళైవలె నాలాయిరంలోని దివ్యప్రబంధాలకు అన్నిటికి వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. ఈ వ్యాఖ్యానానికి దివ్యార్థదీపిక అని పేరు. తిరుక్కుఱున్దాణ్డక ప్రబంధానికి శ్రీఅణ్ణంగరాచార్యస్వామివారు రచించిన దివ్యార్థదీపికావ్యాఖ్య చాలా సులభమైన ద్రావిడభాషలో పలు విశేషార్థాలను తెలుపుతున్నది. ఉదాహరణంగా ఒక సందర్భాన్ని ప్రస్తావిస్తాను.

తిరుమంగైమన్నన్ తిరుక్కుఱున్దాణ్డకమ్‌లోని మొదటి పాశురంలో భగవానుని "మతియినై" అని నిర్దేశించారు. ఈ పదప్రయోగంలో గల స్వారస్యాన్ని పెరియవాచ్చాన్‌పిళ్ళై. "నమ్మతి కేట్టై నినైత్తు అళ్ళవేణ్డా". "అహం స్మరామి" ఎన్ను

తాన్ అవ్విఘ్రవు తీర నినైక్కుమ్" అని వ్యాఖ్యానించారు. పరమరస్యమైన, గంభీరమైన ఈ శ్రీసూక్తియొక్క భావాన్ని శ్రీఅణ్ణంగరాచార్యస్వామివారు తమ దివ్యార్థదీపికలో "మతి-ఎన్నదు వడశొల్. బుద్ధి ఎన్నదు పెయర్..." నామ్ పాఙ్గాయిరుక్కుమ్బోదు ఎమ్బెరుమానై చ్చిన్దిత్తువైత్తాల్, పిఱకు నామ్ శిన్దిక్కప్పెఱాత కుత్తై తీర అవన్తానే నమ్మై శిన్దిత్తుక్కొణ్డిరుప్పవనెన్టవాఱు... బుద్ధిక్కు వాచకమాన "మతి" ఎన్నుమ్ శొల్ ఇవ్విళవు అర్థత్తై త్తరువతు లక్షణైయాల్. బుద్ధిన్ కారియమాకియ నినైత్తల్ తానే శెయ్‌బవన్- ఎన్టై" అని వివరించడం ఒక విశేషం.

కొన్ని సందర్భాలలో సహృదయపాఠకులకు కలిగే సందేహాన్ని లేవనెత్తి దానికి సరసమైన సందర్భోచితమైన సమాధానాలను తెలుపడం చూడవచ్చు. 14వ పాశురంలో "కావియై వెన్ట కణ్ణార్" అనే ప్రయోగంలోని సామంజస్యాన్ని "విషయాంతరఙ్గళిలే విరక్తరాన ఇవర్ కావియై వెన్ట కణ్ణార్ ఎన్ట శొల్లాలే మాతర్‌కళై కుఱిత్తతు కూడుమో ? ఎన్న వేణ్డా" అని ప్రశ్నించి, "అవర్‌కళిన్ కలవియై క్కరుదిన కాలత్తిల్ ఇరున్ద నినైవై అనువాదమ్ శెయ్‌దపడి. ఎదిర్‌మత్తై ఇలక్కాకై యాకవుమామ్. కవిమఱపుక్కేఱ్ప ఉలకిల్ వఘ్రఙ్గుకిఱ శొల్లాలే కుఱిత్తాకవుమామ్" అని మూడు విధాలుగా ఆ ప్రశ్నను స్వామివారు సమాధానించారు. ఇటువంటి వివరణలు, స్వారస్యాలు ఎన్నో ఈ దివ్యార్థదీపికా వ్యాఖ్యలో కన్పిస్తాయి. కొన్ని సందర్భాలలో పాశురాలలోని పాఠభేదాలను ప్రస్తావించి, వాటి సామంజస్యాలను విచారించి సాధుపాఠాన్ని నిర్ణయిస్తారు (ఉదా - 19వ పాశురవ్యాఖ్య). పలువురి ఆఘ్వార్ల శ్రీసూక్తులను ఆయా సందర్భాలకు అనుగుణంగా ప్రమాణీకరిస్తారు.

ప్రకృతగ్రంథ ముద్రణనుగూర్చి :- సుమారు 120 ఏండ్ల క్రితం శ్రీవైష్ణవ ముద్రాపకసభవంటి పలు ధార్మికసంస్థలు ఉద్యమించి నాలాయిర దివ్య ప్రబంధానికి పూర్వాచార్యులు అనుగ్రహించిన వ్యాఖ్యలను తెలుగు, ద్రావిడ లిపులలో ముద్రించి మహోపకారం చేశారు. కాని, ఆ గ్రంథప్రతులు ఈ నాడు దుర్లభాలు, దొరికినా చాలా శిథిలావస్థలో ఉన్నందున ఉపయోగపడడం లేదు. అందువల్ల ఈ వ్యాఖ్యలనన్నిటినీ మళ్ళీ ఇపుడు పునర్ముద్రణ చేయవలసిన ఆవశ్యకత చాలా ఉన్నది. సరళమైనభాషలో ఈ వ్యాఖ్యాల అనువాదాలనుకూడా ముద్రణ చేయవలసి ఉన్నది. ఈ విషయాన్ని గుర్తించిన పలువురు ధార్మికులు, సంస్థలు ఈ కార్యనిర్వహణకు ముందుకు రావడం అభినందనీయం. ఇటీవలి కాలంలో "శిఱియ తిరుమడల్", "పెరియ తిరుమడల్", "తిరువెఘ్రుకూత్రిరుక్కై", "పెరియ తిరువన్దాది", "ఉపదేశరత్తినమాలై", "తిరువాశిరియమ్", "తిరుప్పావై" -మొదలైన

ప్రబంధాలకు పూర్వాచార్యులు అనుగ్రహించిన వ్యాఖ్యలు, వాటి అనువాదాలు ముద్రింపబడడం విశేషం. గత పది ఏండ్లుగా ప్రతిఏడు విజయనగరంలోని శ్రీత్రైవర్ణిక వైష్ణవరామానుజకూటంలో అత్యంతవైభవంగా నిర్వహింపబడే పరమపద వాసులు, సుప్రసిద్ధ ఉభయవేదాంత విద్వత్తల్లజులు, ఉ.వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి తిరునక్షత్ర మహోత్సవ కార్యక్రమంలో ఒక సంప్రదాయ గ్రంథం భగవద్భాగవతాచార్య కైంకర్యనిష్ఠులు అందించే ఆర్థికసాహ్యంతో ముద్రింప బడి, సంప్రదాయపరులైన భక్తులకు అందజేయబడుతున్నది. ఈ క్రమంలో ఇంతవరకు శిఱియ తిరుమడల్, ఉపదేశరత్తినమాలై, పెరియ తిరువన్దాది, - అవే ప్రబంధాల వ్యాఖ్యలు, వాటి అనువాదంతో పాటు ముద్రింపబడగా, ఇపుడు తిరుమంగై మన్నన్ అనుగ్రహించిన తిరుక్కుఱున్దాణ్డ ప్రబంధానికి పెరియ వాచ్చాన్‌పిళ్లై అనుగ్రహించిన వ్యాఖ్యానం, దాని ఆంధ్రవివరణం, కాంచీ ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారి దివ్యార్థదీపిక యొక్క ఆంధ్రానువాదం ముద్రింప బడుతున్నవి. ఈ ముద్రణ శ్రీవేంకటాచార్య స్వామివారి శిష్యులు, భాగవత శేఖరులు శ్రీమతి కరాళపాటి నాగమణి, శ్రీమాన్ కరాళపాటి నాదబాబు దంపతులచే ఆచార్యతిరునక్షత్రోత్సవర్భంలో నూతన గృహప్రవేశోత్సవ స్మృతిగా చేయబడుతున్నది. ఈ సత్కార్యానికి సిద్ధపడిన శ్రీమతి నాగమణి, శ్రీమాన్ నాదబాబు దంపతులకు శ్రీనివాసుని అనుగ్రహంతో ఉత్తరోత్తరాభివృద్ధి కలగాలని హృదయపూర్వకంగా మంగళాశాసనం చేస్తూ, వీరిని ఈ ప్రయత్నంలో ప్రోత్స హించిన శ్రీమతి కె.వి. జానకమ్మగారిని అభినందిస్తున్నాను. ఈ ఏడు జూలై 14వ తేదీన విశాఖపట్టణంలోని శ్రీ త్రైవర్ణిక వైష్ణవ రామానుజకూటం వారిచే శ్రీమాన్ కందాళ వేంకటాచార్యస్వామివారి 81వ తిరునక్షత్ర మహోత్సవం నిర్వహింపబడే శుభసందర్భానికి పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి అహోబల రామానుజజీయర్ స్వామివారు అధ్యక్షులుగా వేంచేసి ఉండడం, ఆ సమయలో వారి శ్రీహస్తాలద్వారా ఈ తిరుక్కుఱున్దాణ్డక వివరణ గ్రంథం ఆవిష్కరింపబడబోవడం కూడా ఈ కార్యక్రమాన్ని శోభాయమానం చేయగలవు. శ్రీమాన్ వేంకటాచార్యస్వామివారి తిరునక్షత్రమహోత్సవాలను ప్రతిఏడు అత్యంతం భక్తిశ్రద్ధలతో నిర్వహించే వారి కుమారులు శ్రీమాన్ శార్ఙ్గపాణిని, శ్రీమాన్ సౌమిత్రిని పుత్రికలు శ్రీమతి కె.వి. హరిప్రియను, శ్రీమతి కె. వి. జానకమ్మగారిని, వేంకటాచార్య స్వామివారి శిష్యబృందాన్ని హార్దికంగా అభినందిస్తున్నాను. తిరుక్కు ఱున్దాణ్డక ప్రబంధానికి పెరియవాచ్చాన్‌పిళ్లై అనుగ్రహించిన వ్యాఖ్యను కాంచీ

ప్ర.భ. అణ్ణంగరాచార్య స్వామివారి దివ్యార్థ దీపికా ద్రావిడ వ్యాఖ్యను ఆంధ్రీకరించ వలసినదిగా నన్ను ప్రోత్స హించిన శ్రీమతి కె.వి. జానకమ్మగారికి నేను చాలా కృతజ్ఞుడను. దాసుని అనువాదాన్ని సాకల్యంగా కటాక్షించి మంగళాశాసనాలను అందించిన పూజ్యులు వాచస్పతి, డా.ఉ.వే. శ్రీమాన్. టి.పి. శ్రీరామచంద్రాచార్య స్వామివారి సన్నిధిలో, ఉభయ వేదాంతవాచస్పతి, ఉ.వే.శ్రీమాన్ కె.వేంకటాచార్య స్వామివారి సన్నిధిలో, శాస్త్రరత్నాకర, పండితరత్న, ఉ.వే. శ్రీమాన్ డా. ఎస్.వి. రంగరామానుజాచార్య స్వామివారి సన్నిధిలో, ఆంధ్రానువాద సహితమైన తిరుక్కుఱున్దాణ్డక గ్రంథాన్ని ఆవిష్కరించే పరమహంస పరివ్రాజకా చార్య త్రిదండి శ్రీశ్రీశ్రీ అహోబల రామానుజజీయర్ స్వామివారి దివ్యసన్నిధిలో సాష్టాంగ దండప్రణామాలను సవినయంగా సమర్పించు కొంటున్నాను. శ్రీమాన్ అణ్ణంగరా చార్యస్వామివారి దివ్యార్థదీపికావ్యాఖ్యను అనువదించి ముద్రించడానికి అనుమతించిన సహృదయులు ఉ.వే. శ్రీమాన్. పి. బి. రాజహంసం స్వామివారికి, వారి కుటుంబ సభ్యులకు కృతజ్ఞతలను నివేదించు కుంటున్నాను. నా ఈ ప్రయత్నంలో పలు రీతులలో మార్గదర్శనం చేసి, మంగళాశాసనం చేసిన సవినయంగా ప్రణమిల్లుతున్నాను. దాణ్డకమనే తమిళ ఛందస్సును గూర్చి తమిళసాహిత్య విమర్శకులు శ్రీమాన్. ఎం. శ్రీనివాసన్ గారు రచించిన "తమిళ ఇలక్కణై వరలాఱు" అనే సద్గ్రంథంలోని విశేషాలు ఈ నివేదికలో కృతజ్ఞతా పూర్వకంగా ప్రస్తావింపబడ్డాయి. ఇంతవరకు ముద్రింపబడిన పలు ప్రతులలోని పెరియవాచ్చాన్‌పిళ్లై వ్యాఖ్యానంలో కనిపించే పలు పాఠాంతరాలుకూడా సూచింప బడ్డాయి. దాసుని అనువాదంలోని లోటుపాట్లను సహించి కటాక్షించవలసినదిగా విపశ్చిల్లోకాన్ని, పాఠకులను వేడుతూ, ఈ సద్గ్రంథాన్ని చదివి ఆనందించమని సహృదయ భాగవతలోకాన్ని ఆహ్వానిస్తూ, స్వస్తి.

జయతు పరకాలసూరి: జయతు తరాం తద్వచఃసుధాధారా ।
జయతు తమాం తద్వ్యాఖ్యా భవ్యా శ్రీకృష్ణసూరిభి: కలితా ॥

దంపతీమౌ నాగమణివాదబాబుసమాహ్వయౌ ।
వేంకటార్యప్రియౌ యాభ్యాం కృతిరేషా ప్రకాశ్యతే ॥

ఇట్లు,

తిరుపతి
2-7-2011

విన్నపించు భాగవతవిధేయుడు
ఈ.ఏ. శింగరాచార్యులు

# పొదుత్తనియన్‌లు

1. శ్రీశైలేశ దయాపాత్రం ధీభక్త్యాది గుణార్ణవమ్ ।
యతీన్ద్ర ప్రవణం వన్దే రమ్యజామాతరం మునిమ్ ॥

తిరుమలైయాళ్వార్ అనబడే తిరువాయ్‌మొళిప్పిళ్ళై అనుగ్రహానికి పాత్రమైన వారు, జ్ఞానభక్త్యాది కల్యాణగుణాలకు సముద్రంవంటివారు, భగవద్రామానుజుల పట్ల ప్రావణ్యాన్ని కలవారు అయిన శ్రీవరవరమునులకు నమస్కరిస్తున్నాను.

2. లక్ష్మీనాథ సమారమ్భాం నాథయామున మధ్యమామ్ ।
అస్మదాచార్యపర్యన్తాం వన్దే గురుపరమ్పరామ్ ॥

శ్రియఃపతిని ప్రారంభంలో కల్గినది, శ్రీమన్నాథముని- యామునమునులను మధ్యలో కల్గినది, మనకు ఆచార్యులైన భగవద్రామానుజులను చివరలో కల్గినది అయిన ఆచార్యపరంపరకు నమస్కరిస్తున్నాను.

3. యో నిత్య మచ్యుతపదామ్బుజ యుగ్మరుక్మ -
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే ।
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసిన్ధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥

ఏభగవద్రామానుజులు నిత్యంగా భగవానుని శ్రీచరణపద్మయుగమనే బంగారంలో కల గొప్ప వ్యామోహంవల్ల, ఆ పదపద్మాల కంటే వేఱయిన అన్ని విషయాలను గడ్డిపోచగా తలచి విడచి వేశారో, మాకు ఆచార్యులు, సమస్తకల్యాణ గుణ పరిపూర్ణులు, కరుణాసముద్రులు అయిన ఈ భగవద్రామానుజుల శ్రీచరణాలను ఉపాయంగా ఆశ్రయిస్తున్నాను.

4. మాతా పితా యువతయ స్తనయా విభూతిః
సర్వం యదేవ నియమేన మదన్వయానామ్ ।
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా ॥

నా వంశంలోని వారికి ఎల్లప్పుడు తల్లి, తండ్రి, భార్య, సంతానం, సంపద- ఇంకా అన్నీ ఏ నమ్మాళ్వార్ల శ్రీచరణాలే అవుతున్నవో, మన కులకూటస్థులు, అయిన ఆ నమ్మాళ్వార్ల, వకుళపూలచే అందమైన, నిత్యోజ్జ్వలమైన ఆ శ్రీచరణాలను శిరసా నమస్కరిస్తున్నాను.

5. భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ -
శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్ ।
భక్తాంఘ్రిరేణుపరకాల యతీన్ద్రమిశ్రాన్
శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్ ॥

పూదత్తాళ్వార్లు, పొయ్‌కై ఆళ్వార్లు, పేయాళ్వార్లు, పెరియాళ్వార్లు, తిరుమళిశై ఆళ్వార్లు, కులశేఖరాళ్వార్లు, తిరుప్పాణ్ ఆళ్వార్లు, తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు, తిరుమఙ్గైయాళ్వార్లు, భగవద్రామానుజులు అనే వీరిని, నమ్మాళ్వార్లను నేను నమస్కరిస్తున్నాను.



# పెరియతిరుమొళి

## తనియన్‌లు

తిరుక్కోట్టియూర్‌నంబి అనుగ్రహించినది

కలయామి కలిధ్వంసం కవిం లోకదివాకరమ్ ।
యస్య గోభిః ప్రకాశాభిః అవిద్యం నిహతం తమః ॥

ఏ తిరుమంగైమన్నన్‌యొక్క ప్రకాశించే కిరణాలచేత అజ్ఞానంవల్ల కల్గిన చీకటి (అజ్ఞానమనే చీకటి) నశింపజేయబడిందో, అటువంటి, కలిదోషాన్ని పోగొట్టడం వల్ల "కలిధ్వంసు"డనే (కలివైరి - కవికన్ఱి) అనబడే, లోకానికి సూర్యుని వంటివారైన (పరమార్థాలను ప్రకాశింపజేసేవారైన) పరకాలసూరిని ధ్యానిస్తున్నాను.

ఎంబెరుమానార్ అనుగ్రహించినది

వాళి పరకాలన్ వాళి కలికన్ఱి,
వాళి కుఱైయలూర్ వాళ్ వేన్దన్, వాళియరో
మాయనై వాళ్‌వలియాల్ మన్దిరఙ్గొళ్ మఙ్గైయర్‌కోన్
తూయోన్, శుడర్‌మానవేల్

శత్రువులకు యముడైన తిరుమంగైమన్నన్ వర్ధిల్లాలి. కలిదోషాన్ని హరించడం వల్ల "కలికన్ఱి" అనే పేరును కలవారు (తిరుమంగైమన్నన్) వర్ధిల్లాలి. తిరుక్కుఱైయ

లూర్‌లో నివసించే నాయకుడు వర్ధిల్లాలి. ఆశ్చర్యకర చేష్టితుడైన భగవానుని తమ ఖడ్గశక్తిని చూపి, తిరుమంత్రాన్ని ఉపదేశంగా పొందిన, "మంగై" దేశానికి ప్రభువులైన పవిత్రులైన తిరుమంగైమన్నన్ యొక్క కాంతిని కల్గిన గొప్ప వేలాయుధం వర్ధిల్లాలి.

## కూరత్తాళ్వాన్ అనుగ్రహించినది

**నెఞ్జుక్కిరుళ్ కడిదీపమ్ అడఙ్గా నెడుమ్బిఱవి,**
**నఞ్జుక్కు నల్లవముదమ్ తమిழ్ నన్నూల్ తుఱైగళ్,**
**అఞ్జుక్కిలక్కియమ్ ఆరణశారమ్, పరశమయ**
**పఞ్జుక్కనలిన్ పొఱి పరకాల నమువల్‌గళే**

పరకాలసూరియొక్క పాశురాలు ఎటువంటివి? అంటే - మనస్సుకు చీకటిని పోగొట్టె దీపాలు, తీరని, దీర్ఘకాలంగా అనువర్తించే జన్మలనే విషాన్ని శమింపజేసే గొప్ప అమృతం, తమిళ భాషలో ఉండే గొప్ప గ్రంథాలలోని విభాగాలు అయిదింటికి అనగా - ఎழుత్తు, శొల్, పొరుళ్, యాప్పు (వర్ణం, పదం, అర్థం, ఛందస్సు, అలంకారం) అనే విభాగాలు అయిదింటికి పూర్ణమైన లక్ష్యాలు. వేదాలసారాలు. పరమత సిద్ధాంతాలు అనే దూది సమూహాన్ని దహించే నిప్పుకణికలు.

## ఎమ్బార్ అనుగ్రహించినది

**ఎఙ్గళ్ కదియే! యిరామానుశమునియే!,**
**శఙ్గై కెడుత్తాణ్డతవరాశా!, - పొఙ్గుపుగழ్**
**మఙ్గైయర్‌కోన్ ఈన్ద మఱైయాయిరమనైత్తుమ్,**
**తఙ్గు మనమ్ నీ యెనక్కు త్తా.**

మాకు గతియైనవాడా! శ్రీరామానుజమునీ! శాస్త్రాలలో కలిగే సందేహాలను తీర్చి, అందరిని పాలించే యతిరాజా! గొప్ప కీర్తిని కల, తిరుమంగైమన్నన్ అనుగ్రహించిన, ద్రావిడ వేదమైన, వేయి పాశురాలైన పెరియతిరుమొழిని పూర్ణంగా ధరించగల్గిన మనస్సును నాకు నీవు అనుగ్రహించు.

* మాలై త్తనియే వళిప్పఱిక్కవేణ్ణుమెన్ఱు,
పోలి పదివిరున్ద కొణ్ణ్రవనే, - వేలై
అణైత్తరుళుమ్ కైయాలడియేన్ వినైయై,
తుణిత్తరుళవేణుమ్ తుణిన్దు

సర్వేశ్వరుని, ఎవరూ లేని బాటలో దోచుకోవాలని తలచి, రానిచెట్టు మూలలో దాగిఉన్న, తిరుమంగై నగరానికి ప్రభూ! వేలాయుధంతో అలంకరింపబడ్డ మీ శ్రీహస్తంతో దాసుని పాపాలను నిశ్చయంగా ఖండించివేయాలి.

తిరుమఙ్గైయాళ్వార్ తిరువడిగళే శరణమ్.

(* ఈతనియన్ అనుసంధానంలో లేదు. దీనిని సోమాశి యాండాన్ అనే ఆచార్యులు అనుగ్రహించారని కొందరు, మణవాళ మామునులు అనుగ్రహించారని కొందరు భావిస్తున్నారు - అని శ్రీసుదర్శన పత్రికాధిపతి ఉ.వే. శ్రీమాన్ ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారు తెలియజేశారు.)



శ్రీమతే రామానుజాయ నమః



తిరుమజ్గై ఆళ్వార్ అనుగ్రహించిన

# తిరుక్కుఱున్దాణ్డకమ్

పెరియవాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిన వ్యాఖ్యానమ్

అ : ముతఱ్పాట్టు. (నితియినై ఇత్యాది) కిళ్రిచ్చిరైయోడే ధనత్తై క్కాట్టి క్కొడుప్పారైప్పోలే, తన్ స్వరూపరూపగుణవిభూతికళై త్తిరుమంత్రత్తాలే కాట్టికొడుక్క క్కణ్డు తమ్ముడైయ పూర్వవృత్తత్తైయుమ్, పెఱ్ఱ పేఱ్ఱిన్ కనత్తైయుమ్ అనుసన్దిత్తు త్తలై శీయ్క్కిఱార్ - పెరియతిరుమొళ్రియిల్. తిరుప్పిరితి తొడజ్గి. ఒరునఱ్ఱుఱ్ఱ మళవుమ్ ఉకన్దరుళిన దేశజ్గళై అనుభవిత్తార్. ఒరునఱ్ఱుఱ్ఱత్తుక్కు మేల్ "మాఱ్ఱ ముళ" అళవుమ్ శెల్ల అవతారజ్గళిన్ గుణచేష్టితజ్గళై అనుభవిత్తు సంసార పరమపద విభాగమిన్ఱిక్కే ఇవర్ హ్రుష్టరాయిరుక్కిఱపడియై కణ్డు సర్వేశ్వరన్, "సంసారత్తిల్ ఇరుక్కిఱపడియై అఱివిత్తాల్ త్వరిత్తిరున్దారాకిల్ కొడుపోకిఱోమ్; ఇల్లైయాకిల్ క్రమత్తాలే కొడుపోకిఱోమ్" ఎన్ఱు పంసారత్తిల్ ఇరుక్కిఱవిరుప్పై అఱివిక్క, "అఱ్ఱజ్కరై వాళ్ర్ మరమ్పోల్" ఎన్ఱుమ్, "కాఱ్ఱత్తిడైప్పట్ట కలవర్ మనమ్పోల్" ఎన్ఱుమ్, "పామ్పోడొరుకూరైయిలే పయిన్ఱాఱ్పోల్" ఎన్ఱుమ్, "ఇరుపాడెరికొళ్ళి యినుళ్ళెఱుమ్పు పోల్" ఎన్ఱుమ్, "వెళ్ళత్తిడైప్పట్ట నరియినమ్పోల్" ఎన్ఱుమ్, "ఇడైయ నెఱివ్ద మరమే యొత్తిరామే" ఎన్ఱుమ్ కూప్పిట్టు, అతిల్, పెరువిడాయర్ ఉడమ్పిలుమ్ ముకత్తిలుమ్ నీరై [1]ఇరట్టిక్కొళ్ళుమాప్పోలే, పేశి అనుభవిత్తు, ఇతుతాన్ ఇనితాయ్, "ఇవై ఎల్లామ్ ఉకన్దరుళిన నిలజ్గళై అనుభవిక్కైయాల్ వన్దదు; ఉకన్దరుళిన నిలజ్గళిలే మణ్డినవర్ భాగ్యాధికర్" ఎన్ఱు తలైక్కట్టుకిఱార్.

*అరుమ్పదవిళక్కమ్ : నితియినై. ప్రవేశే - (తలై శీయ్క్కిఱార్) ముతల్ తిరుమొళ్రియిలే - ఎన్ఱు కణ్డుకొళ్వతు. అన్నిక్కే, ముతల్ వాక్యమ్ సఙ్గ్రహమాయ్, తిరుప్పిరితి తొడజ్గి విస్తారమాకవుమామ్. క్కూప్పిట్టు, ఇతిల్- తిరుక్కుఱున్దాణ్డకత్తిలే విడాయఱుకిఱార్ - ఎన్నపడి.*

1. ఏఱిట్టు - పాఠాంతరం.

# భావదీపికా వివరణం

## అవతారిక

ఈ తిరుమంగై ఆళ్వార్లు తమ మొదటి దివ్యప్రబంధం అయిన పెరియ తిరుమొళిలోని మొదటి దశకంలో, గొప్ప ధనాన్ని డబ్బుపంచిలో మూటగా కట్టి ఇచ్చేవారివలె తిరు అష్టాక్షరీ మహామంత్రంద్వారా తన స్వరూపరూపగుణ విభూతులను తమకు భగవానుడు సాక్షాత్కరింపజేయగా, పెరియతిరుమొళి ప్రబంధంలో పూర్తిగా వాటిని దర్శించి, అనుభవించారు, రెండవ ప్రబంధమైన (ఈ) తిరుక్కుఱున్దాణ్డకమ్‌లో తాము పూర్వం ఉన్న స్థితిని, ఇపుడు పొందిన ఫలంయొక్క గౌరవాన్ని అనుసంధించి, గొప్ప ఆనందాన్ని పొందుతున్నారు. అంటే - పెరియ తిరుమొళిలోని రెండవ దశకంలో తిరుప్పిరిది (బదరికాశ్రమం)నుండి ఆరంభించి, "ఒరువల్ శుఱ్ఱమ్" అనే పదవ శతకంలోని మొదటి దశకంవరకు భగవానుడు అభిమానించి ఆదరంతో వేంచేసి ఉండే దివ్యతిరుపతులను అనుభవించారు. దీనికి పిమ్మట పదకొండవ శతకంలోని ఏడవ దశకం చివరివరకు భగవానుని రామకృష్ణాద్యవతారాలలోని కల్యాణ గుణాలను, అపూర్వ కృత్యాలను అనుభవించి, పరమ పదంలో పొందే ఆనందాన్ని ఈ సంసారంలోనే పొందినవారై, చాలా తృప్తులైన వీరిని చూచిన భగవానుడు "ఈ సంసారంయొక్క నైచ్యాన్ని వీరికి తెలియజేస్తాను. దీనిని విడచిపెట్టి పరమపదాన్ని చేరాలనే తహతహ వీరికి ఏర్పడినట్లయితే వీరిని అక్కడకు తీసికొనిపోతాను. ఆ తహతహ కల్గకపోతే కాలక్రమంలో తీసికొనిపోతాను" అని సంసారంలోని నైచ్యాన్ని వీరికి దర్శింపజేయగా, పదకొండవ శతకంలోని ఎనిమిదవ దశకం అయిన "మాఱ్ఱ ముళ" అనే దశకంలో "ఆఱ్ఱఙ్కరైవాళ్ మరమ్‌పోల్ అఞ్జుకిన్ఱేన్" (11-8-1) (జలప్రవాహతీరంలో నిలచి ఉండే వృక్షంవలె భయపడుతున్నాను) అని, "కాఱ్ఱత్తిడైప్పట్ట కలవర్ మనమ్పోల్ ఆఱ్ఱత్తుళఙ్గానిఱ్పన్" (11-8-2) (గొప్ప గాలిలో చిక్కుకున్న తెప్పలో ఉండే వారి మనస్సు మిక్కిలి కంపిస్తున్నాను) అని, "పామ్బోడు ఒరు కూరైయిలే పయిన్ఱాప్పోలే తాఙ్గాతు ఉళ్ళమ్ తళ్ళుమ్" (11-8-3) (సర్పంతోపాటుగా ఒక ఇంటిలో నివసించే రీతిలో మనస్సులో నిలువలేక తడబడుతున్నది.) "ఇరుపాడు ఎరికొళ్ళియినుళ్ ఎఱుమ్బు పోల్ ఉరుకానిఱ్కుమ్ ఎన్ ఉళ్ళమ్" (11-8-4) (కొరివికట్టెకు రెండు వైపులా నిప్పు అంటుకొని మండుతుండగా, ఆ జ్వాలల మధ్యలో చిక్కుకొని ఉన్న చీమలవలె నామనస్సు ద్రవిస్తున్నది) "వెళ్ళత్తిడైప్పట్ట నరియినమ్‌పోల్ ఉళ్ళమ్ తుళఙ్గానిఱ్పన్" (11-8-5) (జలప్రవాహంలో చిక్కుకొన్న నక్కలగుంపు వలె

కంపిస్తున్నాను.) అని, "ఇఱైయున్ ఎఱిన్ద మరమొత్తిరామే అడైయ అరుళాయ్" (11-8-6) (గొల్లలు నఱికి కింద పడవేసిన వృక్షాలవలె నేను ఒకపక్క పడిఉండి నశించకుండా ఉండేటట్లుగా నేను నీ పాదాలు చేరేటట్లు అనుగ్రహించు) అని భగవానుని చూచి తమను దరికి చేర్చుకొమ్మని అంటూ తమ తహతహను తెలిపి, "నీశ్రీచరణాలను చేరే దారిని నాకు అనుగ్రహించాలి" అని భగవానుని ప్రార్థించారు - ఈ తిరుక్కుఱున్దాణ్డకమ్‌లో. ఈవిధంగా భగవానుని అనుభవించాలనే ఆశ చాలా ఎక్కువగా కల్గిన తిరుమంగై ఆళ్వార్ తాము కోరిన రీతిలో భగవానుడు ప్రత్యక్షం కానందువల్ల, దాహాన్ని ఎక్కువగా పొందినవాడు ఒంటిపైన, ముఖంపైన నీటిని చేతులారా తీసికొని జల్లుకొనేటట్లుగా, భగవానుని త్రికరణాలతో అనుభవించి ఆనందించినవారై, "ఈ భోగ్యత అంతా నాకు దివ్యదేశానుభవంవల్ల సిద్ధించింది, ఈ దివ్యదేశాలను అనుభవించగల్గినవారు గొప్ప భాగ్యాన్ని కలవారు" అని పల్కి ఈ ప్రబంధాన్ని ముగిస్తున్నారు.

# తిరుక్కుఱున్దాణ్డకమ్

## దివ్యార్థదీపికావ్యాఖ్య - ఆంధ్రానువాదం

### అవతారిక

తిరుక్కుఱున్దాణ్డకమనే ఈ దివ్యప్రబంధం -ఈ లోకంలోని తమస్సు (అజ్ఞానం) అంతరించేటట్లుగా ఈలోకానికి వచ్చి అవతరించి, అందమైన ద్రావిడ భాషలో చక్కని దివ్యప్రబంధాలను అనుగ్రహించిన ఆళ్వార్లలో ఒకరైన నమ్మాళ్వార్లు అనుగ్రహించిన నాల్గు వేదాల సారమైన నాల్గు దివ్యప్రబంధాలకు షడంగాలుగా అవతరించిన, తిరుమంగై ఆళ్వార్ అనుగ్రహించిన ఆఱు దివ్యప్రబంధాలలో ఒకటి. (పెరియ తిరుమొழி, తిరుక్కుఱున్దాణ్డకమ్, తిరువెழுకూఱ్ఱిరుక్కై, శిఱియ తిరుమడల్, పెరియతిరుమడల్, తిరునెడున్దాణ్డకమ్-అనేవి ఆ ఆఱు దివ్యప్రబంధాలు)

శ్రీమన్నాథములు కూర్చిన క్రమంలో రెండవ ఆయిరంలో రెండవ ప్రబంధంగా ఇది అమరి ఉన్నది.

"వెన్దియే వేణ్డి పిఱప్పొరుట్కిరఙ్గి వేల్కణార్ కలవియే కరుతి నిన్ద వానిల్లా నెఞ్జినై యుడైయేన్" (విజయాన్నే కోరి, నశించే వస్తువులనుగూర్చి కఱిగి (ఆశపడి), వేలాయుధంవంటి కన్నులను కల స్త్రీలతో సంగమాన్ని ఆశపడి - ఈ రీతిలో

స్థిరంగా నిలువని చంచలమైన మనస్సును కల వేను) అని, "శాన్దేన్దు మెన్ములైయార్ తడన్దోళ్ పుణరిన్ప వెళ్ళత్తాళ్న్దేన్" (చందనాన్ని పూసికొన్న, మృదువైన స్తనాలను కల స్త్రీల పొడుగైన బాహువుల కలయికవల్ల కలిగే ఆనందప్రవాహంలో మునిగి పోయాను) అని తామే అనుగ్రహించిన రీతిలో ఇహలోక సుఖాలలో ప్రావణ్యాన్ని కల్గి తిరుగుతూ ఉండే ఈ ఆళ్వార్లను భగవానుడు సంస్కరించి, వారినుండి కైంకర్యాన్ని స్వీకరించాలని భావించి, "లౌకికవిషయాలలో మగ్నులై తిరిగే వీరిని శాస్త్రాలను దర్శింపజేసి సంస్కరించడం వీలు కాదు; నా సౌందర్యాన్ని చూపి నివర్తింపజేయాలి" అని భావించి, తన సౌందర్యాన్ని దర్శింపజేయగా, ఆళ్వార్లు ఆ అందాన్ని చూచి, అభినివేశాన్ని పొంది, "వేమ్బిన్ పుళు వేమ్బన్ఱి యుణ్ణాతు, అడియేనాన్ పిన్నుమ్ ఉన్ శేవడియన్ఱి నైవేన్" (వేపచెట్టులోని పురుగు ఆ వేపను తప్ప ఇంకొకదానిని తినని రీతిలో, దాసుడనైన నేను నీ అందమైన శ్రీచరణాలను తప్ప ఇంకొక విషయాన్ని ఆశపడను) అనే రీతిలో (గాఢంగా) అవగాహించారు.

వీరు ఈ విధంగా తన విషయంలో అభినివేశాన్ని పొందడం గమనించిన భగవానుడు "ఇపుడు వీరికి నాపట్ల కల్గిన సంబంధం అన్యవిషయాలలోవలె కాకుండా, సంబంధజ్ఞానపూర్వకంగా కల్గినదిగా కావాలి. లేకపోతే ఈ సంబంధం వీరికి నిలుకడగా నిలువకుండా పోయినా పోవచ్చు" అని తలచి, అన్ని అర్థాలను ప్రకాశింప జేసే తిరుమంత్రాన్ని, తన సౌశీల్యాదికల్యాణగుణాలను, తిరుమంత్రార్థా నికి సీమాభూమి అయిన దివ్యదేశాలను ఆళ్వార్లకు దర్శింపజేయగా, ఆళ్వార్లు కూడా "వాడినేన్ వాడి" అని ప్రారంభించి, భగవానుడు అభిమానించిన దివ్య దేశాలను పరమప్రాప్యంగా అనుభవించారు.

ఈ విధంగా అనుభవించిన ఆళ్వార్లకు ఈ అనుభవం నిత్యంగా కొనసాగడంకోసం వీరిని పరమపదానికి తీసికొనిపోవాలని భావించి, భగవానుడు సంసారంపట్ల వీరికి జిహాస (విడిచిపెట్టాలనే కోరిక) కలిగేటట్లుగా దాని స్వభావాన్ని తెలుపగా, (దానిని) తెలిసిన వీరు చాలా భయపడి కంపించి, "మాఱ్ఱముళ" అనే దశకంలో "ఆఱ్ఱఙ్కరై వాళ్ మరమ్బోల్" (జలప్రవాహతీరంలో ఉండే వృక్షంవలె ఉన్నవాడనై), "కాఱ్ఱత్తిడైప్పట్ట కలవర్ మనమ్బోల్" (గొప్ప గాలిలో చిక్కుకొన్న తెప్పలో ఉండే వారి మనస్సువలె), 'పామ్బోడు ఒరు కూరైయిలే పయిన్ఱాప్పోల్" (సర్పంతో పాటుగా ఒక ఇంటిలో నివసించే రీతిలో), "ఇరుపాడెరి కొళ్ళియినుళ్ ఎఱుమ్బేపోల్" (కొఱవి కట్టెకు రెండువైపుల నిప్పు అంటుకొని

మండుతుండగా ఆ జ్వాలలో మధ్యలో చిక్కుకొని బాధపడే చీమల వలె), "వెళ్ళత్తి డైప్పట్ట నరియినమ్‌పోల్" (జలప్రవాహం మధ్యలో చిక్కుకొన్న నక్కల గుంపువలె) అని ఈవిధంగా తమ భయానికి పలు దృష్టాంతాలు పలికి ఆక్రందించారు.

ఈ విధంగా వీరు ఆక్రందించి ఆక్రందించి "పణియాయ్ ఎనక్కుయ్యుమ్ వకై పరక్షోతీ!" అని, "అన్దో! అడియేఙ్కరుళాయ్ ఉన్నరుళే" అని పల్కి ప్రార్థించినప్పటికీ, చిన్నబిడ్డలు "ఆకలి, ఆకలి" అని ఆక్రందించి ఏడ్చినా అజీర్ణం మొదలైన పోయి, నిజమైన ఆకలి కలిగేవరకు అన్నాన్ని పెట్టని తల్లివలె, భగవానుడు "వీరికి పరిపూర్ణంగా ముదిరిన పరమభక్తి వీరికి కలిగేవరకు నేను దర్శనాన్ని అనుగ్రహించను" అని ఉదాసీనుడై ఉండగా, ఒక్కక్షణంకూడా భగవానుని విశ్లేషించి ఉండలేని ఆళ్వార్లు, చాలా దాహాన్ని పొందినవారు నీటిలో పడి, నీటిని తాగడం నీటిని చేతులారా తీసికొని పైకి జల్లుకోవడం చేసేటట్లే, ఆ భగవానుని గూర్చి నోటితో (కీర్తించి) పల్కి, శిరస్సుతో నమస్కరించి, మనస్సుతో భావించి ధరించాలని చూస్తున్నారు - తిరుక్కుఱున్దాణ్డకమ్ అనే ఈ దివ్య ప్రబంధంలో.

"దాణ్డకమ్" అనేది తమిళంలో ఒక విధమైన ప్రబంధం ఇది. ఆఱు గణాల పరిమితిని కల పాదాలు నాల్గింటితో కాని, ఎనిమిది గణాల పరిమితిని కల పాదాలు నాల్గింటితో కాని, ఇష్టదేవతను కీర్తిస్తూ పాడే ప్రబంధం. ఆఱు గణాలను కల్గినది "కుఱున్దాణ్డకమ్" అని చెప్పబడుతుంది.

"శీర్‌మూవిరణ్డేనుమ్ ఇరు నాన్గేనుమ్ శీర్ వకై నాట్టిశెయ్యుళినాడవర్ కడవుళర్ పుకళ్‌వన దాణ్డకమ్, అవత్తాళ్, అఱుశీర్‌క్కురియతు నెడియదెన్ శీరామ్, అఱుశీరెన్ శీరడినాన్గాత్తజ్జీఱువతు దాణ్డక మిరుమిచ్చీరడి కుఱియతు వెడియదిరు నాట్పేరే" అని పన్నిరుపాట్టు - ఇయల్ విభాగంలో దాణ్డకమనే ప్రక్రియ యొక్క లక్షణం చెప్పబడడం గమనించాలి.

"కుఱున్దాణ్డకమ్"లో ప్రతిపాదంలో హల్లు అక్షరాలతో కలిపి పదిహేను అక్షరాలకు తగ్గకుండా, ఇరవై ఆఱు అక్షరాలకు మించకుండా ఉండాలి; "నెడున్దాణ్డకమ్"లో ప్రతిపాదంలో 26 అక్షరాలకు తగ్గకుండా ఉండాలనే నియమం కూడా ఉన్నది.

శైవప్రబంధాలలో కుఱున్దాణ్డకమ్ కన్పించడం అరుదైనా, నెడున్దాణ్డకమ్ మాత్రం విశేషంగా కన్పిస్తుంది.

1. నిఱియునై ప్పవళ త్తూణై నెఱిమైయాల్ నినైయవల్లార్,
   కఱియునై క్కఞ్జన్ మాళ క్కణ్డు మున్నణ్డమాళుమ్,
   మఱియునై మాలై వాళ్త్తి వణఙ్గి యెన్ మనత్తు వన్ద,
   ఏఱియునై క్కణ్డుకొణ్డ తొణ్డనేన్ విడుకిలేనే.

నిదియునై = (ఆపదలో సహాయపడే) నిధివంటివాడై, పవళ త్తూణై = పగడంవలె ఆశపడదగినవాడై, స్తంభంవలె అందఱిని ధరించేవాడై, నెఱిమైయాల్ నినైయవల్లార్ = క్రమంలో ధ్యానించగల ఉపాసకులకు, కఱియునై = ప్రాప్యమై ఉండేవాడై, కఞ్జన్ మున్ మాళ క్కణ్డు = కంసుని ఆయుస్సు అతని తలపుకు ముందే ముగిసిపోయేటట్లు చూచి, అణ్డమ్ ఆళుమ్ = లోకాన్ని రక్షించేవాడై, మఱియునై = (దాసులను) భావించేవాడైన, మాలై =(భక్తులపట్ల) వ్యామోహాన్ని కలవానిని, వాళ్త్తి = నోరార స్తుతించి, వణఙ్గి = (అతని శ్రీచరణాలలో) నమస్కరించేటట్లు, ఎన్ మనత్తు = నా మనస్సులోకి, వన్ద =తానే వచ్చిన, ఏఱియునై= కృపను కలవానిని, కణ్డుకొణ్డ = కళ్ళార దర్శించి అనుభవించిన, తొణ్డనేన్ = దాసుడనైన నేను, విడుకిలేనే = (ఇక) ఏనాడూ విడచిపెట్టను.

వ్యా : (నిఱియునై) ఎయ్ప్పినిల్ వైప్పాయ్, ఇన్నిధి యుడైయవనుక్కు మిడిపడ వేణ్డాతిరుక్కైయుమ్, ఉడైయవన్‌కాలిలే ఎల్లారుమ్ వన్దు నిఱ్కుకైయుమ్, ఉణ్డెవ ఉయిర్ నిఱ్కైయుమ్, ఆపత్తుక్కు ఉతవుకైయుమ్, ఉడైయవన్ పెరుమతిప్పనా కైయుమ్, విఱ్ఱుమ్ ఒఱ్ఱివైత్తుమ్ జీవిక్కలాయిరుక్కైయుమ్ - ఇప్పడి [1]శెయ్‌తతెన్ఱు ఏశాతిరుక్కైయుమ్ - ఏవమాది గుణఙ్గళైప్పఱ్ఱ (నిఱియునై) ఎన్గిఱార్. "వైత్తమానిధి" యిఱే. "గుహాయామ్ నిహితమ్" ఎన్ఱు పేశప్పడుకిఱ వస్తు.

(నిఱియునై) నాట్టిల్ కాణ్గిఱ నిధిపోలల్ల; ఎల్లావఱ్ఱుక్కుమ్ మేలాన నిధియా యిఱ్ఱు ఇన్నిధి. ఇన్నిధి, పుతైత్తువైత్తు ఆళవేణ్డా; నెఞ్జిలే వైత్తాళలామ్. ఓరిడత్తిలే పుతైత్తువైత్తు దేశాన్తరత్తిలే నిఱ్కచ్చెయ్‌తే వినియోగమ్ కొళ్ళవేణ్డినాల్ ఉతవాతు అన్నిధి, ఇన్నిధి - నినైత్తవిడత్తే వినియోగమ్ కొళ్ళలామ్, పఱిత్తుక్కొళ్ళారిల్లై, పఱిక్కత్తా నొణ్ణాతు; అన్నిధి యుడైయవనై అవసరమ్ పార్త్తు క్కొన్ఱు పఱిత్తుక్కొణ్డు పోవార్‌కళ్; ఇన్నిధి యుడైయవనుక్కు అప్పడిప్పట్ట ప్రమాదసమ్భావనైకళిల్లై.

(పవళత్తూణై) సర్వత్తుక్కుమ్ తాన్ ధారకనాయిరుక్కుమత్తై ప్పఱ్ఱ "తూణ్" ఎన్గిఱార్. "పవళమ్" ఎన్ఱత్తాల్ - స్పృహణీయత్తై శొల్లుకిఱతు. తూణావతు- తాన్ అనేకత్తై ధరిత్తు త్తన్ కీళ్ ఒతుఙ్గువార్క్కు నిళల్ కొడుత్తు నిఱ్పతొన్ఱిఱే, అప్పడియే

1. శెయ్‌దదేనెన్ఱు - పాఠాంతరం.

తాన్ ఎల్లార్క్కుమ్ ధారకనాయ్ త్తన్ని అడైన్దార్క్కు విట్రల్ కొడుక్కైయాలే "తూణ్" ఎన్గిఱార్.

(నెఱిమైయాల్ వినైయవల్లార్ కతియునై) "వినైతాఱుమ్ శొల్లువ్దాఱుమ్ నెఞ్జిడిన్దుకుమ్" ఎన్గిఱపడియే అడైవు పడ వినైక్కమాట్టార్కళే ఇవర్కళ్. ఆకైయాల్ "నెఱిమైయాల్ వినైయవల్లార్" ఎన్గిఱార్. వినైక్కవల్లార్క్కు నెఱ్ఱిక్కాక్కుమ్.

(కతియునై) వినైప్పార్క్కు ప్పరమగతియామ్, ప్రాప్యనామెన్నపడి. "పరవి త్తొళుమ్ తొణ్డర్ తమక్కు క్కతియే" ఎన్నక్కడవతిఱే. నితియునై ఎన్న- ప్రాప్యమ్ శొల్లిఱ్ఱు; (కతియునై) ఎన్న- ప్రాపకమ్ శొల్లిఱ్ఱు. (వినైయవల్లార్) ఎన్గైయాలే - అధికారివిశేషమ్ శొల్లిఱ్ఱు.

ఇప్పడి ఉపాయోపేయఙ్గళ్ తానేయాయిరుక్కిఱవన్ ఆర్క్కు? ఎఙ్గే ఉతవక్కణ్డోమ్? ఎన్నిల్, (కఞ్జన్ మాళక్కణ్డు) "తన్నై కాలిల్ పెరు విలఙ్గు తాళవిழ" ఎన్నుమ్, "తన్నైకాలిల్ విలఙ్గఱ వన్దు తోన్ఱియ" ఎన్నుమ్, "ఒరుత్తి మకనాయ్ ప్పిఱన్దు" [1]ఇత్యాదిప్పడియే- తన్నై ప్పిళ్ళైయాక పెఱ్ఱవర్కళ్ కాల్కట్టఱుత్తు అవర్కళై వాழ్విత్తాన్ - ఎన్గిఱార్.

(కఞ్జన్ మాళ క్కణ్డు) కంసనుడైయ ఆయుస్సు మాళుమ్బడి పార్త్తు. (మున్) అవన్ నినైనై అవనుక్కు మున్నే శెయ్తు ముడిక్కై. (అణ్డమాళుమ్) జగత్తై సనాథమాయ్త్తు. (అణ్డమాళుమ్) "రామో రాజ్య ముపాసిత్వా" ఎన్నుమాపోలే నాట్టై ఈరక్కైయాలే తడవి, కంసన్ కాలత్తిఱ్పట్ట నోవు తీర రక్షిత్తు.

(మతియునై) కంసనై క్కొన్న నాట్టుక్కు క్కళై పిడుఙ్గిన పిన్బుమ్, అచ్చియుమ్ ఐయరుమ్ ఎన్ శెయ్తార్కళ్? ఎన్న "ఋణం ప్రవృద్ధ మివ" ఎన్న పడుకిఱపడి. (మతియునై) నమ్మతికేట్టై నినైత్తు అఞ్జవేణ్డా. "అహం స్మరామి" ఎన్న తాన్ అవ్విழవు తీర వినైక్కుమ్.

(మాలై) "మాలాయ్ ప్పిఱన్ద" నమ్బియిఱే. ఆశాలేశముడైయార్పక్కల్ [2]వ్యాముగ్ధనాయిరుక్కుమవనై.

(వాழ్త్తి వణఙ్గి) వాయ్ పడైత్త ప్రయోజనమ్ పెఱ వాழ్త్తి, అవన్ తిరువడి కళిలే వణఙ్గి. (ఎన్ మనత్తు వన్ద వితియునై) "మనమ్ పుకున్దాయ్ పుకున్దతఱ్పిన్ వణఙ్గుమ్" ఎన్గిఱపడియే ఆశాలేశమిన్ఱిక్కేయిరుక్క క్కిడక్కై ప్పాయిలే వెళ్ళమ్ కోత్తాప్పోలే. (ఎన్ మనత్తు వన్ద) ఈழమ్ కనా క్కాణ్బారిల్లైయిఱే, ఎల్లా అవస్థై

1. ఎన్నుమ్ ఇత్యాదిప్పడియే - పాఠాంతరం. 2. ముగ్ధనా - పాఠాంతరం.

యిలుమ్ వరువాన్ అవనితే. అతుక్కాడి (నితియినై) అవన్ స్వాతన్త్ర్యత్తాలుమ్, ఎన్ కర్మత్తాలుమ్ తవిర్క్కవొణ్ణాత కృపై. "నితివాయ్క్కిన్ఱు కాప్పారార్", "నితి శూల్న్దతాల్" ఇవ్వళవాన పేర్ఱుక్కడియాన తమ్ముడైయ సుకృతత్తై చ్చొల్లుకిఱార్.

(కణ్డుకొణ్డ తొణ్డనేన్ విడుకిలేనే) - శువడఱివిక్కున్దనైయుమితే వరుత్త ముళ్ళతు; పిన్నై ఇత్తలై అత్తలైయామిత్తనై. (కణ్డుకొణ్డ) "నాన్ కణ్డుకొణ్డేన్" ఎన్ఱు అరశడియిలే కాట్టిక్కొడుత్త కాట్చి, "ఏతు శెయ్తాల్ మఱక్కేన్" ఎన్ఱు మఱన్ఱు విడవొణ్ణాత పడియితే మనస్సిల్ పుకున్దు కాట్టిక్కొడుత్తతు. (కణ్డుకొణ్డ) కేట్టతు కణ్డాప్పోలే ఇరుక్కిఱతు కాణుమ్. స్వరూపజ్ఞానమ్ పిఱన్దవరాకైయాలే. పణ్డే ఉణ్డాయ్ ఇఴన్దతు కణ్డాప్పోలే ఇరుక్కిఱతు. అవన్ మాల్; నాన్ తొణ్డన్; ఇవి విడ ఉపాయముణ్డో? అవనుక్కు ఎన్పక్కల్ స్నేహ మిల్లై ఎన్నవొణ్ణాతు; నాన్ అతిల్ ఈడుపట్టిలేన్ ఎన్నవొణ్ణాతు; ఆన పిన్బు ఎత్తై చ్చొల్లి విడువతు?

అరు : ముతల్పాట్టు. (విఱ్ఱుమ్ ఒఱ్ఱి వైత్తుమ్ జీవిక్కై) యావతు - ఉపదేశాదికళైప్పణ్ణి బోధయన్తః పరస్పరాదికళాలే ధరిక్కై.

ఇన్నిధి వైక్కుమిడ మేతు? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్. (గుహాయామ్ - నిహితమ్ - ఎన్ఱు) గుహై - హృదయకమలమ్. సామ్యమరుళిచ్చెయ్తు ఆధిక్య మరుళిచ్చెయ్కిఱార్ (నాట్టిలిత్యాది) నినైక్కప్పోకామైక్కు హేతు ఏతు? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్ (నినైక్కవల్లార్ క్కిత్యాది) (నెఱ్ఱి క్కాక్కుమ్) - అవనుడైయ స్వరూపాదికళ్ నినైక్కవొణ్ణాతపడి తకైయుమ్ - ఎన్నపడి.

కతి - ప్రాపకమాకవుమామ్. కంసన్ పోన పిన్బు సనాథమాయ్త్తు ఎన్నపడి. మతియినై - మాతాపితాక్కళుక్కాతల్; ఆశ్రితర్ క్కాతల్. వరుకై అసమ్భావితమో? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్ (ఈఴమ్ కనావిత్యాది) కణ్డతై యొఴియ క్కాణాతవఱ్ఱై స్వప్నమ్ కాణార్ ఎన్నపడి. అరశు - తిరువరశు.

భావదీపిక - వ్యాఖ్యానం : (నిదియినై) - వెలకట్టడానికి సాధ్యం కాని నిధివంటి వాడు - అని భావం. నిధి అనే ధనసంచయానికి, భగవానునకు పలు రీతులలో సామ్యం ఉన్నందువల్ల భగవానుని "నిధి" అని నిర్దేశిస్తున్నారు. 1. బీదరికంలో (జ్ఞానహీనదశలో) జ్ఞానమనే సంపదను అనుగ్రహించడం, 2. దీనిని కలవానికి ఆకించన్యం (జ్ఞాన రాహిత్యం) దుఃఖరాహిత్యం కల్గడం, 3. ఇది ఉన్నది అని అంటే ప్రాణాలు నిలచి ఉండడం, 4. దీనిని కలవాని పాదాలపై అందఱు వాలి నమస్కరించడం, 5. ఆప త్కాలంలో సహాయపడడం, 6. దీనిని కలవాడు గొప్ప

గౌరవాన్ని పొందడం, 7. దీనిని వ్యయం చేసి, (శిష్యులకు ఉపదేశించి), పంచుకొని తనకంటే (మిగిలిన జ్ఞానులకు ఉపదేశించిన) ఉజ్జీవించేటట్లుండడం, 8. ఈవిధంగా చేసినా ఏనింద పొందక పోవడం - అనే స్వభావాలు నిధికి ఉన్నట్లే భగవానునకుకూడా ఉన్నాయి కనుక, "నితియునై" అని అంటున్నారు. "ఎయ్ప్పినిల్ వైప్పినై" (పెరియతిరు-7-10-4) అని, "వైత్తమానిది" (తిరువాయ్-6-7-11) అని భగవానుడు నిధిగా కీర్తింపబడ్డాడు కదా! రహస్యంగా దాచి ఉంచబడే నిధివలె "గుహాయాం నిహితమ్" (తై. ఆనంద-1) (గుహవంటి హృదయంలో ఉండే పరమాత్మను) అని ఉపనిషత్తులలో పరమాత్మ చెప్పబడ్డాడు కదా!

(నిదియునై) - లోకంలో కన్పించే నిధికంటే ఈ నిధికి పలు వైలక్షణ్యాలున్నాయి. ఈ నిధిని దొంగల భయంవల్ల దాచుకొని కాపాడుకోవలసిన అవసరం లేదు. మనస్సులో పదిలపఱచుకొని ఉపయోగించుకోవచ్చు. ఒకచోట దాని ఉంచిన నిధి వేఱొక దేశంలో ఉన్నపుడు అక్కఱకువస్తే అపుడది అక్కడ సహాయపడదు. ఈ నిధి ఎక్కడ అయినా తలచినంతనే సహాయపడగలదు. ఆ నిధినివలె ఈనిధిని దోచుకొనిపోయేవారెవరూ లేరు. నిజానికి దోచుకొని పోవడానికి వీలు కాదు. లౌకికనిధిని కలవానిని సమయాన్ని చూచి చంపి దొంగలు ఆ నిధిని ఎత్తుకొని పోగలరు. ఈ నిధిని కలవానికి అటువంటి ఆపదలువచ్చే అవకాశం లేనే లేదు. ఇతరులకు ఇస్తే తఱిగిపోయే లౌకికనిధివలె కాకుండా ఇది ఇచ్చే కొద్దీ వృద్ధి చెందుతుంది. ఇంకా ఇటువంటి పలు సామ్య-వైలక్షణ్యాలను గమనించవచ్చు.

(పవళత్తూణై) - అన్ని వస్తువులను ధరించేవాడు తాను కనుక, భగవానుని (ఆళ్వార్లు) "తూణ్" (స్తంభం) అని అంటున్నారు. 'తూణ్' (స్తంభం) అనేది తాను పలు వస్తువులను ధరించి నిలచి, తన కింద ఆశ్రయాన్ని పొందినవారికి నీడ నిచ్చేది కదా! ఆ రీతిలోనే భగవానుడు అందఱికి ధారకుడై, తనను రక్షణగా పొందినవారికి నీడనిచ్చేవాడు కనుక "తూణ్" అని అంటున్నారు.

అందులోను, "ఇనుపస్తంభం" అని అనకుండా, "పవళత్తూణ్" అని అన్నందువల్ల దర్శించడానికి భోగ్యమై ఉండేవాడు భగవానుడు- అని తెలుపబడుతున్నది.

(నెఱిమైయాల్ నినైయవల్లార్ కఠియునై)- "నినైతొఱుమ్ శొల్లుమ్ తొఱుమ్ నెఞ్జు ఇడిన్దు ఉకుమ్" (తిరువాయ్-9-6-2) (నీ కల్యాణగుణాలను తలచినప్పుడు, పల్కినప్పుడు ప్రీత్యతిశయంతో మనస్సు భగ్నమై కలుగుతున్నది.) అనే రీతిలో భగవానుని ధ్యానించడం ఆరంభిస్తే అతని స్వరూపాదులు చాలా అభినివేశాన్ని కల్గిస్తాయి. కనుక, క్రమానుసారంగా అతని ధ్యానించడం వీలుకాదు. అందువల్ల

అతనిని ధ్యానించడానికి అతనినే ఉపాయంగా పరిగ్రహించాలి. దీనినే "అతనిని క్రమానుసారంలో ధ్యానించ గల్గినవారికి రక్షకుడై ఉంటాడు" అని అంటున్నారు. "నినైక్కవల్లార్కు నెఱ్ఱి క్కాక్కుమ్" అనే వ్యాఖ్యానశ్రీసూక్తికి "అతనిని క్రమానుసారంగా ధ్యానించే వారిని భగవానుడు రక్షిస్తాడు" అనే అర్థాన్ని గ్రహించాలి. (అరుంబదవివరణంలో వివరించిన రీతి సరికాదు.) క్రమానుసారంగా ధ్యానించాలని కోరే ఉపాసకులకు తాను ప్రాపకుడై, వారిని రక్షించి, వారి ఉపాసనం నెఱవేరేటట్లు భగవానుడు చేస్తాడు - అని భావం.

(కతియునై) - ముందు తెల్పిన రీతిలో కాకుండా వేఱే అర్థాన్నికూడా గ్రహించ వచ్చు. ఈ విధంగా తలచే ఉపాసకులకు గొప్ప ప్రాప్యంగా ఉండేవాడనే భావాన్ని చెప్పవచ్చు. "పరవిత్తొழுమ్ తొణ్డర్‌తమక్కు క్కతియే" (పెరియ తిరు-7-1-7) (భక్తితో కొలిచే దాసులకు గతి) అనే రీతిలో గతిశబ్దం ప్రాప్యాన్నికూడా తెలుపుతుంది కదా! "నిదియునై" అని అంటూ భగవానుని ప్రాప్యత్వాన్ని, "కతియునై" అని ప్రాపకత్వాన్ని, "నినైయ వల్లార్" అని అతనిని ఉపాసించే అధికారులను తెలుపు తున్నదనికూడా గ్రహించ వచ్చు.

ఈవిధంగా ప్రాప్యప్రాపకాలుగా తానే అయినట్లుగా ఎక్కడ ఎవరి విషయంలో చూచాము? అని అంటే, దానికి ఇక సమాధానాన్ని పల్కుతున్నారు.

(కఞ్జన్ మాళక్కణ్డు) - "తన్నైకాలిల్ పెరువిలఙ్గు తాళ్ అవిழ వల్లిరుట్కణ్ వన్ద ఎన్నై పెరుమానార్" (పెరియతిరు-7-5-1) (తండ్రి అయిన వసుదేవుని కాలికి బంధించబడిన పెద్దసంకెళ్ళ తాళం ఊడేటట్లుగా చీకటి సమయంలో వచ్చి అవతరించిన తండ్రియైన స్వామి) అని, "తన్నైకాలిల్ విలఙ్గు అఱ వన్దు తోన్ఱియ తోన్ఱల్" (పెరియతిరు-8-5-1) (తండ్రి కాలిలోని తాళం ఊడేటట్లుగా వచ్చి అవతరించిన స్వామి) అని, "ఒరుత్తి మకనాయ్ ప్పిఱన్దు ఓరిరవిల్" (తిరుప్పావై 25) (దేవకీదేవికి కుమారుడై అవతరించి, ఒకరాత్రి వేళ) అని పలికే రీతిలో జన్మించినపుడే తనను కుమారునిగా పొందినవారి కాళ్ళబంధాన్ని తెంచి, వారిని కాపాడినట్లు (మనలను) కాపాడతాడని అంటున్నారు.

(కఞ్జన్ మాళ క్కణ్డు) - వారిని చెఱలో పెట్టిన కంసునియొక్క ఆయుస్సు ముగిసిపోయేటట్లు చూచి.

(మున్) - "తన్ తీఙ్గు నినైత్త కఞ్జన్ వయిఱ్ఱిల్ నెరుప్పెన్న నిన్ఱ నెడుమాలే!" (తిరుప్పావై-25) అనే రీతిలో కంసుని ఆలోచనను అతడు తలచినపుడే అతనికి సంభవించేటట్లుగా చేశాడు - అని భావం.

(అణ్ణమాళుమ్) - కంసుని దుష్టశాసనం తొలగి అందమైన ప్రజారంజకమైన పాలన జరిగేటట్లు చేశాడని భావం.

(అణ్ణమాళుమ్) - "దశవర్ష సహస్రాణి దశవర్షశతాని చ, రామో రాజ్యముపాసిత్వా బ్రహ్మలోకం గమిష్యతి" (రామా.బాల. 1-97) (పదకొండు వేల సంవత్సరాలు రాజ్యాన్ని ఉపాసించి- (శ్రద్ధగా పాలించి), తరువాత శ్రీరాముడు వైకుంఠానికి వెళ్ళగలడు) అని శ్రీరామావతారకాలంలో చేసినట్లుగా, కంసునివంటివారి కాలంలో నడచిన ప్రజాకంటకమైన పాలననల్ల పడిన బాధలు తీరేటట్లు లోకాన్ని తన ఆర్ద్రహస్తంలో (దయతో) తడవి, రక్షించడాన్నిగూర్చి పల్కుతున్నారు.

(మదియినై) - ద్రౌపదియొక్క అన్ని కొఱతలను తీర్చిన తరువాతకూడా, "ఋణం ప్రవృద్ధమివ మే హృదయాన్నాపసర్పతి" అనే రీతిలో "ఆమె కౌరవసభలో పడిన అవమానాన్ని అడ్డుకోలేక పోయానే" అని అప్పుపడినవారి మనస్సు కలత చెందేటట్లుగా, కంసుని వధించి, లోకంలోని కలుపును తీసివేసినవాడైనా (దుష్ట శిక్షణను చేసినవాడైనా), తన తల్లిదండ్రులు పడిన కష్టాలను తలచి బాధపడ్డాడని భావం. ఈవిధంగా కాకుండా, సామాన్యంగా భక్తుల విషయంగా ఇతనికి కల భావాన్నిగూర్చి ఈ ప్రయోగం తెలుపుతున్నదనికూడా చెప్పవచ్చు. (అందువల్ల) మనం మన అజ్ఞానాన్ని తలచి భయపడవలసిన అక్కఱలేదని భావం. "స్థితే మనసి సుస్వస్థే శరీరే సతి యో నరః, ధాతుసామ్యే స్థితే స్మర్తా విశ్వరూపం చ మామజమ్, తతస్తం మ్రియమాణం తు కాష్ఠపాషాణసన్నిభమ్, అహం స్మరామి మద్భక్తం నయామి పరమాం గతిమ్" (వరాహచరమశ్లోకం) (మనఃక్లేశాలు ఏవీ లేకుండా ఉండే స్థితిలో, శరీరంలో ఏవ్యాధులు లేనపుడు, వాత, పిత్త, శ్లేష్మలనే మూడు ధాతువులు సమపరిమాణంలో ఉన్నపుడు, ఏమానవుడు లోకాన్ని శరీరంగా కలవాడను, జన్మ (మొదలైన నైచ్యాలను) లేనివాడను అయిన నన్ను తలుస్తున్నాడో, తరువాత కాలంలో కట్టెవలె, రాయివలె జ్ఞానశూన్యుడై మరణం ఆసన్నమై ఉండే ఆ భక్తుని నేనే తలుస్తాను. ఉత్తమగతికి అతనిని తీసికొనిపోతాను) అనే రీతిలో మనం ధ్యానించలేని కాలంలో కూడా మన కొఱతతీరేటట్లు తాను భావిస్తాడు - అని భావం.

(మాలై) - "మాలాయ్ ప్పిఱన్ద నమ్బి" (నాచ్చి. తిరు- 14-3) (భక్తుల పట్ల వ్యామోహాన్ని కలవాడై అవతరించిన గుణపూర్ణుడు) అని (గోదాదేవిచే) కీర్తింపబడ్డాడు కదా! తనపట్ల కొంచెం ప్రేమ కలవారి విషయంలో సైతం గొప్ప ప్రేమను కలవానిని.

(వాయ్నేర్న్దు వణఙ్గి) - నోరు (జిహ్వ) ను కల్గి ఉన్నందులకు ప్రయోజనాన్ని పొందేటట్లుగా మంగళాశాసనం చేసి, అతని శ్రీచరణాలలో నమస్కరించి.

(ఎన్‌మనత్తు వన్ద విత్తియునై) - "వన్దు ఉనతు అడియేన్ మనమ్ పుకున్దాయ్ పుకున్దదర్పిన్ వణఙ్గుమ్ ఎన్ శిన్దనైక్కినియాయ్" (పెరియ తిరు-3-5-1) (వచ్చి నీ దాసుని మనస్సులోకి ప్రవేశించావు. ప్రవేశించిన తరువాత నీకు నమస్కరించే నామనస్సుకు భోగ్యుడవు అయ్యావు) అవేటట్లుగా కొంచెంకూడా భక్తిలేకుండా ఉండే నా మనస్సులో నీవే గొప్ప అభినివేశంతో ప్రవేశించి, పఱచి ఉండే శయ్యలో (చాపలో) ప్రవాహం వచ్చినట్లు, నీ కృపావర్షాన్ని కురిపించి నన్ను మంగళాశాసనం నమస్కరించేటట్లు చేసినవాడవని భావం. "విత్తియునై" అనే పదం నిర్హేతుకకృపను తెలుపుతున్నది.

(ఎన్ మనత్తు వన్దు) - ఇతడు నా మనస్సును అన్వేషించివస్తాడని నేను కలకూడా కనలేదు. సాక్షాత్తుగా దర్శించలేని ద్వీపాన్ని కల కనేవారు లేనట్లుగా, ఇతనినిగూర్చి నామనస్సులో నేను కలకూడా కనకుండా ఉండగా, అతడేకదా నామనస్సును అన్వేషిస్తూ వచ్చాడు. నేను అతనిని వదలి దూరంగా పోయినపుడు అంతా నన్ను దూరంగా పోనివ్వకుండా అన్వేషిస్తూ వచ్చినవాడతడేకదా! దీనికి గల కారణాన్నిగూర్చి ఆళ్వార్లు ఇకపై తెల్పుతున్నారు.

(విత్తియునై) - "విత్తి" అనే పదం ఎవరికీ అడ్డు పెట్టడానికి వీలుకాని దానిని తెలుపుతుంది. ఇక్కడ భగవానుడు తన స్వాతంత్ర్యంలోను, జీవుని కర్మతోను అడ్డుకోలేని అతని కృపను తెలుపుతున్నది. "విత్తివాయ్‌క్కిన్ఱు కాప్పారార్?" (తిరువాయ్-5-1-1) (భగవానుని నిర్హేతుక కృప ప్రసవిస్తున్నది. దానిని అడ్డుకొనే వారు ఎవరు) అని, "విత్తి శూழ్న్దదాల్" (తిరువాయ్-2-7-6) (ఆహా! భగవానుని నిర్హేతుక కృప ప్రసరిస్తున్నది) అని నమ్మాళ్వార్లు భగవానుని కృపను "విత్తి" అని నిర్దేశించారు కదా! నామనస్సును అతడు అన్వేషించి వచ్చే రీతిలో ఈ ఫలానికి (ప్రాప్యానికి) కారణమైన పుణ్యం- అతని నిర్హేతుకకృప తప్ప వేఱేమీ లేదని భావం.

(కణ్డుకొణ్డ తొణ్డనేన్ విడుకిలేన్) - భగవద్విషయంయొక్క భోగ్యతను అతడు తమకు తెలియజేసేంతవరకు తాము దానిని విడచి దూరంగా పోయే బాధ ఆళ్వార్లకు ఉన్నది. అతడు దానిని గూర్చి తెలియజేయగా తెలిసిన తరువాత వీరిని సంస్క రించడం కోసం అతడు పడిన పాట్లు అన్నీ వీరు పడ్డారు. భగవద్విషయాన్ని ఎంతమాత్రము వదలలేనివారయ్యారు - అని భావం.

(కణ్డుకొణ్డ) - "నాన్ కణ్డుకొణ్డేన్" (పెరియతిరు-1-1-1) (నేను దర్శించాను) అని రావి చెట్టు మూలంలో దర్శింపజేసిన దర్శనాన్నిగూర్చి పల్కుతున్నారు. ఆ విధంగా ఒకసారి దర్శనాన్ని అనుగ్రహించి వెళ్ళిపోకుండా "ఎదు శెయ్‌తాల్

మఱక్కేన్?" (పెరియ తిరు-9-3-3) (ఏమి చేస్తే మఱువగలను) అనే రీతిలో నా మనస్సులోకి ప్రవేశించి నేను మఱచిపోలేని రీతిలో ఎల్లప్పుడు దర్శనాన్ని అనుగ్రహిస్తూ ఉన్నాడుకదా!

(కణ్డకొణ్డ) - ఇతః పూర్వమే పొంది, మధ్యలో పోగొట్టుకొన్నదానిని తిరిగి కనుగొనగల్గినట్లు ఉన్నదిసుమా! ఇపుడు స్వరూపజ్ఞానం కల్గినందువల్ల అనాది కాలంగా ఉన్నదై మధ్యలో కోల్పోయినదానిని తిరిగి దర్శించినట్లున్నది.

(తొణ్డనేన్ విడుకిలేన్) - అతడు, "మాల్" (ఆశ్రితవ్యాముగ్ధుడు) కనుక నా పట్ల ప్రేమ లేనివాడు- అని చెప్పలేము. నేను దాసుడను కనుక, నేను అతనిపట్ల అభినివేశాన్ని కలవాడను కాను - అని చెప్పడానికి వీలుకాదు. అందువల్ల నేను అతనిని విడచిపెట్టే దారి ఉన్నదా? అందువల్ల ఏమని పల్కి విడువడం?

దివ్యార్థదీపిక :- భగవానుని గొప్పతనాలను విస్తరించి పల్కి, "నా మనస్సు లోకి వచ్చి ప్రవేశించిన ఈ స్వామిని ఇక నేను ఏనాడు విడువలేను" అని అంటున్నారు.

(నిదియినై) - భూమిలో దాచిపెట్టబడిన వస్తువు నిధి అనబడుతుంది. "యో వేద నిహితం గుహాయామ్" అనే తైత్తిరీయోపనిషత్తుద్వారా భగవానుడు నిధిగా తెలియబడుతున్నాడు. "వైత్త మానిదియామ్ మదుశూదనన్" (మధు సూదనుడు నిక్షిప్తం చేయబడ్డ గొప్ప నిధివంటివాడు) అని నమ్మాళ్వార్లుకూడా అన్నారు. భూమి లోపల దాచి ఉంచి రక్షింపబడవలసి ఉంటుంది లోకంలోని నిధి. భగవానుడనే నిధి ఆ విధంగా కాకుండా మనస్సులో నిక్షిప్తం చేసికొని రక్షించ దగినది- అనే వ్యత్యాసం గమనార్హం.

నిధి- తనను కల్గినవారిని రాత్రి, పగలు నిదుర పోనివ్వదు. "ఏసమయంలో ఎవరు కొల్లగొడతారో?" అని నిద్రపోకుండా ఉంటారు - నిధిని కలవారు. భగవానుని కల్గినవారుకూడా ఆవిధంగానే ఉంటారు. "కణ్ణార క్కణ్డు కఴివదోర్ కాదలుఱ్ఱార్క్కుముణ్డో కణ్‌గళ్ తుఞ్జుదలే" (కన్నులారా దర్శించి కాలాన్ని గడపాలనే భక్తిని కలవారికి కన్నులు నిద్రించడం అనేది ఉన్నదా?) అనే రీతిలో దర్శించడానికి ముందు నిదుర లేదు; చూచిన తరువాత కూడా "సదా పశ్యంతి" కనుక నిద్ర లేదు.

నిధిని కలవారు గుండెలను చఱచుకొని విర్రవీగుతారు. భగవానుని చేజిక్కించుకొన్నవారుకూడా నాకెవరూ సరిలేరు "ఎనక్కారుమ్ నికరిల్లైయే"

(నాకెవరుసాటిలేరు కదా), "మాఱులతో ఇమ్మణ్మిశైయే" (ఈ భూమిలో నాకు సాటి ఉన్నారా?), "ఎనక్కార్నిని వేణ్డువతే" (ఇక నాకేమి కావాలి)? "ఇల్లై ఎనక్కెదిరిల్లై ఎనక్కెదిరిల్లై ఎనక్కెదిరే" (నాకు ఎదురు లేరు, నాకు ఎదురులేరు, నాకు ఎదురు లేదు నాకు ఎదురులేరు) అని అంటూ గర్వంతో పల్కుతారు.

నిధిని కల్గినవారిని లోకం అంతా వెంబడిస్తుంది. భగవానుని స్వాధీనం చేసికొన్నవానిని కూడా అంతే. "మైత్రేయః పరిపప్రచ్ఛ ప్రణిపత్యాభివాద్య చ" (పరాశర మహర్షిని నమస్కరించి అభివాదనచేసి మైత్రేయుడు ప్రశ్నించాడు) ఇత్యాది సూక్తులు గమనార్హాలు.

నిధిని పోగొట్టుకొన్నవాడు గొల్లుగొల్లుమని ఏడుస్తాడు. భగవానుని కోల్పోయినవాడుకూడా అవిధంగానే. శ్రీరామచంద్రుడనే నిక్షిప్త మహానిధిని కోల్పోయిన భరతాళ్వాన్ సభలో దొర్లి దొర్లి ఆక్రందించి ఏడ్చాడు కదా! "తచ్ఛ్రుత్వా భరతో వాక్యం శోకేనాభిపరిప్లుతః, విలలాప సభామధ్యే" (ఆ మాటను భరతుడు విని శోకంతో పూర్తిగా నిండినవాడై, సభనడుమ ఏడ్చి గగ్గోలుపెట్టాడు. పురోహితుడైన వశిష్ఠుని గర్హించాడు) అనే దానిని గమనించండి. "పళ్ళుతే పల పకలుమ్ పోయిన" (పలు దినాలు వ్యర్థంగా గడిచిపోయాయి) అని ఆక్రందించి ఏడుస్తారు. "ఇన్బత్తై యిఱ్ఱన్ద పావియేన్ ఎనదావి నిల్లాతే" (ఆనందాన్ని కోల్పోయిన పాపిని, నా ప్రాణాలు నిలువవు), "ఎఱ్ఱిల్‌కొళ్ నిన్ తిరుక్కణ్ణినై నోక్కన్దన్నైయుమ్ ఇఱన్దేన్ ఇఱన్దేనే" (మెఱిసే నీ నేత్రాలను చూచే భాగ్యాన్ని నేను కోల్పోయాను, అయ్యో! కోల్పోయాను), "ఉన్నై క్కాణ్బాన్ నాన్ అలప్పాయ్ ఆకాయత్తై నోక్కి యఴువన్" (నిన్ను చూడాలని నేను ఆర్తి కలిగినవాడనై ఆకాశంవైపు చూచి ఏడుస్తాను.) అని ఈవిధంగా ఆక్రందిస్తారు. "ఏకస్మిన్నప్యతిక్రాంతే ముహూర్తే ధ్యానవర్జితే, దస్యుభిర్ముషితేనైవ యుక్తమాక్రందితుం నృణామ్" (భగవానుని చింతను కోల్పోయి ఒక క్షణకాలం గడచినా దొంగలు సర్వస్వాన్ని కొల్లగొడితే ఏ విధంగా ఆక్రందించి ఏడుస్తారో, ఆ విధంగా అఱచి గగ్గోలు పెట్టాలి) అని అంటారు జ్ఞానులు.

నిధి- అనేది సిద్ధాంజనాన్ని అలంకరించుకొన్న కొంతమంది భాగ్యవంతులకే దొరుకుతున్నది. భగవానుడుకూడా భక్తిసిద్ధాంజనం పొందిన ఆళ్వార్లవంటి కొందఱు భాగ్యవంతులకే లభిస్తాడు. ఈ విధంగా ఇంకా పలు సామ్యాలు భావ్యాలు.

**(పవళత్తూణై)** - స్తంభం పెక్కింటిని తాను మోస్తూ, తన కింద ఒదిగి ఉండేవారికి నీడను ఇచ్చేటట్లే, భగవానుడుకూడా సకలలోకయోగక్షేమ ధురం

ధరుడై, తన శ్రీచరణాలను చేరినవారికి అందరికి తాపాలను తీర్చేవాడై ఉన్నందు వల్ల "తూణ్" అని అనబడింది. రాతిస్తంభం, కొయ్యస్తంభంవలె కాకుండా అందు చాలా ఆశపడి ఆశ్రయించదగిన స్తంభం -అని అనడంకోసం "పవళత్తూణ్" అని అనబడింది.

(నెటిమైయాల్ నినైయవల్లార్ కతియునై) - మిగిలిన వస్తువులనుగూర్చి భావించడానికి, భగవానునిగూర్చి భావించడానికి మధ్య చాలా తారతమ్యం ఉన్నది. "నినైతొఱుమ్ శొల్లున్తొఱుమ్ నెఞ్జు ఇడిన్దుకుమ్" (నిన్నుగూర్చి స్మరించినపుడంతా, పల్కినపుడంతా మనస్సు భగ్నమవుతున్నది) అనే రీతిలో భగవానుని ధ్యానించి నంత మాత్రంలోనే "ఉళ్ళెలామురుకి క్కురల్ తళ్ళుత్తొళ్ళిన్దేన్ ఉడమ్బెల్లామ్ కణ్ణనిర్ శోర" (నిన్ను స్మరించినపుడు మనస్సు లోపల కఱిగి, గొంతు గద్గదమై, శరీరం అంతా కన్నీరు కారగా) నిలువవలసి ఉన్నదికనుక ఈవిధంగా ధ్యానించడమే శాస్త్రక్రమంలో ధ్యానించడం. ఈ రీతిలో ధ్యానించేవారికి ఉపాయమై ఉండేవాడు భగవానుడు - అని భావం.

(కఞ్జన్ మాళక్కణ్డు మున్ అణ్డమాళుమ్) - "శాతుశనత్తై నలియుమ్ కఞ్జన్" (సాధుజనులకు బాధించే కంసుడు) ప్రాణాలతో ఉన్నంతవరకు భగవానుని పాలన సంకోచం పొందినందువల్ల, కంసుని ప్రాణాలను హరించి, తన జగద్రక్షకత్వాన్ని సుస్థిరం చేసికొన్నాడని భావం. "నాట్టై ఈరక్కైయాలే తడవి' క్కంసనాల్ పట్ట నోవు తీర రక్షిత్తు" (లోకాన్ని చల్లటి హస్తంతో తడవి, కంసునివల్ల కల్గిన బాధ తీరేటట్లు రక్షించి) అనే వ్యాఖ్యాన వాక్యం గమనించదగినది.

(మతియునై) -"మతి" అనేది సంస్కృతపదం. బుద్ధి - అనిఅర్థం. "ఎయ్ప్పెన్నై వన్దు నలియుమ్పోదు అజ్గేదుమ్ నానున్నై నినైక్కమాట్టేన్, అప్పోదైక్కు ఇప్పోదే శొల్లివైత్తేన్ అరజ్గత్తరవణైప్పళ్ళియానే!" (శ్రీరంగనాథా! శ్రమ నన్ను బాధించేటపుడు నేను నిన్ను ఏమీ స్మరించలేను. ఆ సమయానికి బదులుగా ఇక్కడే నిన్ను స్మరిస్తున్నాను) అని, "ఆమిడత్తే ఉన్నై చ్చొల్లివైత్తేన్" అని పలికే రీతిలో మనం స్వస్థదశలో ఉన్నపుడు భగవానుని ధ్యానిస్తే, తరువాత మనం చింతించలేని కొఱత తీరేటట్లుగా అతడే మనలను ధ్యానిస్తాడని భావం. "స్థితే మనసి సుస్వస్థే శరీరే సతి యో నరః, ధాతు సామ్యే స్థితే స్మర్తా విశ్వరూపం చ మామజమ్, తతస్తం మ్రియమాణం తు కాష్ఠపాషాణసన్నిభమ్, అహం స్మరామి మద్భక్తమ్" (మనస్సు, శరీరం స్వస్థదశలో ఉండగా, ధాతువులు సమపరిమాణంలో ఉండగా, ఏ మానవుడూ విశ్వరూపుడనైన, జన్మరహితుడనైన నన్ను స్మరిస్తాడో, నా భక్తుడైన అతడు

మరణించేటప్పుడు, రాయివలే, కట్టెవలె పడిఉన్నప్పుడు అతనిని నేను స్మరిస్తాను.) అనే వరాహచరమశ్లోకం ఇక్కడ అనుసంధించదగినది. బుద్ధికి వాచకమైన "మతి" అనే పదం ఇంతటి అర్థాన్ని లక్షణావృత్తిద్వారా ఇస్తుంది. బుద్ధియొక్క కార్యమైన ధ్యానాన్ని తానే చేసేవాడని భావం.

(మాలై) - "మాల్" అనే పదం- గొప్పతనాన్ని కలవాడు, నల్లని రూపాన్ని కలవాడు, (భక్తులపట్ల) వ్యామోహాన్ని కలవాడు- అనే పలు అర్థాలను కల్గినది. "ఆశాలేశముడైయార్పక్కల్ వ్యాముగ్ధనాయిరుక్కుమవనై" (కొద్దిపాటి ఆశ కలిగిన వారి విషయంలోకూడా మిక్కిలి వ్యామోహాన్ని కలిగినవానిని) అనేది వ్యాఖ్యాన వాక్యం. భక్తులకు ఎన్ని ఉపకారాలను చేసినా, ఏమి చేయని వానివలె తనను భావిస్తూ "ఇంకా ఏమి చేయగలను? ఏమి చేయగలను" అనే ఆశను కల్గి ఉండడం భగవానుని వ్యామోహంయొక్క గొప్పతనం.

(వాళ్త్తి వణఙ్గి ఎన్ మనత్తు వన్ద) - "వణఙ్గి" అనే పదాన్ని విభక్తి వ్యత్యయంగా గ్రహించాలి. "వణఙ్గి" (నమస్కరించేటట్లు) అని అర్థం. నేను కీర్తించి నమస్కరించేటట్లుగా నామనస్సులోకి వచ్చి చేరిన భాగ్యస్వరూపుని"- అని భావం. లేక, "ఎన్ మనత్తు వన్ద విదియినై వాళ్త్తి వణఙ్గి విడుకిలేనే" అని అన్వయించ వచ్చు. "విది" అనే సంస్కృతశబ్దం "దైవం దిష్టం భాగధేయం భాగ్యం స్త్రీ నియతిర్విధిః" అనే అమరకోశవచనానుసారం భాగ్యమనే అర్థాన్ని ఇస్తుంది. తమ అదృష్టమే భగవానునిగా రూపొందింది. అని అంటున్నారు. ఇటువంటి భగవానుని ఈనాడు దర్శించగల్గిన నేను ఇక విడువను- అని తాత్పర్యం.

2. కాఱ్ఱినై పునలై త్తీయై క్కడిమతిళిలఙ్గై శెఱ్ఱ,
ఏఱ్ఱినై ఇమయమేయ ఎళిల్మణిత్తిరళై, ఇన్ప
ఆఱ్ఱినై అముతత్తన్నై అవుణనారుయిరై యుణ్డ,
కూఱ్ఱినై క్కుణఙ్గొణ్డుళ్ళమ్ కూఱు నీ కూఱు మాఱే.

ఉళ్ళమ్ = ఓ నా మనసా!, కాఱ్ఱినై = వాయువుకు అంతర్యామియై, పునలై = నీటిని అంతర్యామియై, తీయై = అగ్నికి అంతర్యామియై, కడి మదిళ్ = రక్షణగా ఉండే కోటలను కల, ఇలఙ్గై = లంకను, శెఱ్ఱ = నాశనం చేసిన, ఏఱ్ఱినై = వృషభంవంటి పొగరును కలవాడై, ఇమయమ్ = హిమాలయంలోని బదరీకాశ్రమంలో, మేయ = వేంచేసి ఉండే (బంగారంవలె స్పృహణీయుడై ఉండే), ఎళిల్ = అందమైన, మణి తిరళై = మణుల వరుస భోగ్యమైనవాడై, ఇన్ప ఆఱ్ఱినై = ఆనంద ప్రవాహమై ఉండేవాడై, అముతమ్ తన్నై = (కంటితో పానం చేసే) అమృతమై, అవుణన్ = హిరణ్యకశిపునియొక్క, ఆర్ ఉయిరై = ముగించడానికి అరుదైన ప్రాణాన్ని, ఉణ్డ=

ఆరగించిన, కూ<u>ర్ర్</u>రై = యమునివంటివాడైన భగవానుని, గుణమ్ కొణ్డు= (అతని) గుణాలను పురస్కరించుకొని, కూఱు = సంకీర్తనాప్ని చేయి, నీ కూఱుమ్ ఆఱే= ఆహా! నీవు ఎంత అందంగా పల్కుతున్నావు.

వ్యా : ఇరణ్డామ్పాట్టు. (కా<u>ర్ర్</u>రై ఇత్యాది) "అగ్నిర్ దేవతా:" ఎన్గిఱపడియే భూతజ్గళ్ ఐన్దుక్కుమ్ ఉపలక్షణమాయ్, కారణమే అవస్థాన్తరాపన్నమాన కార్యమ్ ఎన్నుమత్తాలే జగచ్ఛరీరియానవనై - ఎన్రై.

(కడిమతిళిలజ్గై శెర్<u>ర</u> పి<u>ర్ర్</u>రై) కడి- అరణ్; అరణాక శేర్రుమ్పడియాన మతిళ్. "లజ్కాం రావణపాలితామ్" ఎన్గిఱపడియే మతిళిన్రియిలే ఇరున్దాలుమ్ [1]ప్రవేశిక్కవొణ్ణాత ఊర్. అతుక్కుమేలే రావణనుమ్ పరికరముమ్ పల్కి పుడిస్తుకి డక్కిఱ లజ్కైయై, "పా<u>ర్ర</u>ాళాక ప్రదైపోరుతాన్" ఎన్గిఱపడియే. లజ్కైయడైయ అళ్ పా<u>ర్ర</u>ామ్పడి శెర్<u>ర</u>ు, అత్తాల్ వన్ద మేనాణిప్పాలే శెరుక్కియిరుక్కిఱవనై.

(ఇమయ మేయ ఎ<u>ర్ర</u>ిల్ మణిత్తిరళై) ఇమయమ్ - పాప్; ఏయ్కై - ఒక్కై. ఆశ్రితవిరోధియాన రావణనై క్కొన్రపడియాలే శెరుక్కి పావ్పోలే పుకర్త్తు నల్లమణిత్తి రళ్పోలే భోగ్యనానవనై. (ఇమయమ్) ఇత్యాదిక్కు- అవతారత్తుక్కు ప్పిఱ్పట్టార్ క్కుమ్ అనుభవిక్కలామ్పడి హిమవానిలే పొరున్దియిరుక్కిఱపడి - ఎన్రు నిర్వహిత్తార్ కళ్. "ఏలవాఱు తణ్తడమ్ పొ<u>ర్ర</u>ిడమ్ పెఱ ఇరున్ద నల్లిమయ" ఎన్రే.

(ఇన్ను వా<u>ర్ర్</u>రినై) "మతురవాణి"ఎన్రే. "ఆనన్దం బ్రహ్మణ:" ఎన్గిఱ ఆనన్ద ప్రవాహమ్. ఆఱు ఎన్రైయాలే- పిదాయ్త్తార్క్కు పుక్కు ముఱ్రికలాయిరుక్కై యుమ్, వేణ్డిన విడత్తే తిఱన్దు పాయ్చ్చి విళైవిత్తు క్కొళ్ళలాయిరుక్కైయుమ్. [2]ఇన్నాఱు విళైవిప్పతు"పెరమర్ కాతల్ కడల్ పురైయ విళైయ"ఎన్రే. (అముతన్రనై) పోవ ఉయిరై మీట్కవత్<u>ర</u>ాయ్ భోగ్యముమాయిరుక్కై. (ఇన్నవా<u>ర్ర్</u>రినై అముతన్రనై) విళైవిప్పానుమ్ తానాయ్, విళైన్దాల్ భుజిక్కుమ్ [3]భోగముమ్ తానాయిరుక్కైయుమ్. "అమృతం దృష్ట్వా తృప్యన్తి" యెన్రే. కణ్కొణ్డు భుజిక్కలామ్ అమృతమిఱే.

ఇప్పడి ప్రాప్యప్రాపకజ్గళ్ ఇరణ్డుమ్ తానేయానాల్ ఇవ్వమృతపానమ్ పణ్ణు వార్క్కు వరుమ్ విరోధి పోక్కువార్ ఆర్? ఎన్నిల్; (అవుణనారుయిరై యుణ్డ కూ<u>ర్ర్</u>రినై) ప్రహ్లాదన్ విరోధియాన హిరణ్యన్ పట్టతు పడుమెన్నిఱార్. (కూ<u>ర్ర్</u>రినై) "మృత్యుమృత్యుమ్" ఎన్గిఱ మంత్రలిజ్గత్తై నినైక్కిఱార్. (గుణమ్ కొణ్డుళ్ళమ్) నెఞ్జే గుణజ్గళై క్కొణ్డు, ఉళ్ళమ్! కూఱు. (నీ కూఱుమాఱే) ఉళ్ళమానతు [4]ఎప్పోతో? ఎన్నిరుక్క, నీ కూఱుమ్పడియే! ఎన్గిఱార్.

1. మణ్పాడుదానే ఒరువర్క్కుమ్ ప్రవేశిక్క - పాఠాంతరం. 2. ఇన్నవాఱు - పాఠాంతరం
3. భోగ్యముమ్ - పాఠాంతరం. 4. అప్పోదే కూఱానిక్క - పాఠాంతరం.

అరు : ఇరణ్డామ్పాట్టు. (కాత్తినై) కారణమాన భూతఙ్గళే కార్యావస్థమాన జగత్తాకైయాలే (జగచ్ఛరీరియెన్గిఱతు).

ఉళ్ళమ్ - [1]అణ్మై విళి - సమ్బోధనై. 'కూఱు' ఎన్ఱు విధిక్క, అతు కూఱినవాఱే 'నీ కూఱుమాఱే!' ఎన్ఱు కొణ్డాడుకిఱార్.

భావదీపిక-అవ : "లోకాన్నే శరీరంగా కలవాడై, శ్రీరాముడుగాను, నృసింహుడు గాను అవతరించినవాడై, బదరిలో అర్చావతారరూపుడై వేంచేసి ఉన్నవానిని ఓ మనసా! నమస్కరించు"- అని అంటున్నారు.

వ్యాఖ్యానం : (కాత్తినై పున్లనై తీయై) - "సేయం దేవతైక్షత, హంతాహ మిమాస్తిస్రో దేవతా:, అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" (ఛాందో-6-3-2) (భూమి, నీరు, అగ్ని - అనే మూడు దేవతలలో నా శరీరమైన జీవాత్మతో అనుప్రవేశించి లోకంలో పలు రూపాలను, పేర్లను పొందగలను - అని పరమాత్మ నిశ్చయించుకొన్నది) అనే రీతిలో భూమి, అగ్ని, జలం - అనే ఈ మూడింటిని నిర్దేశించడం వాయువు, ఆకాశాలనే మిగిలిన రెండు భూతాలకు ఉపలక్షణమై, "కారణమైన ఈ పరమాత్మయే అయిదు భూతాలనబడే కార్యదశలను పొందుతున్నాడు" అని అన్నందువల్ల ఇతడు లోకాన్ని అంతటిని శరీరంగా కలవాడు - అని చెప్పబడినట్లయింది.

(కడిమదిళ్ ఇలఙ్గై శెత్తి ఏత్తినై) - రక్షకంగా ఉండే కోటలను కల లంకను నశింపజేసిన మానవోత్తముని. "కడి" - రక్షణ. "కడిమదిళ్" - అనే ప్రయోగానికి చక్కని రక్షణను ఇచ్చే కోటలు - అని అర్థం.

(ఇలఙ్గై) - "యథా రాఘవనిర్ముక్త: శర: శ్వసనవిక్రమ:, గచ్ఛేత్ తద్వద్గమిష్యామి లంకాం రావణపాలితామ్" (రామా-సుందర-1-37,38) (శ్రీరామునిచే విడువబడిన బాణం ఏవిధంగా గాలివలె వేగంగా వెడుతుందో, ఆ రీతిలోనే శీఘ్రంగా రావణునిచే రక్షింపబడ్డ లంకను చేరగలను) అనే రీతిగా కోటలు లేకుండా ఉన్న లోపలకు ప్రవేశించడానికి సాధ్యం కాని లంక - అని భావం. దానికి కోటలుకూడా ఉన్నవి. అంతకుమించి రావణుడు, అతని సేనలు ఎల్లప్పుడు కావలి కాసే లంకను అనిభావం.

(శెత్తి ఏత్తినై) - "ఇలఙ్గై పాழாళాక ప్పడైపొరుతాన్" (తిరుప్పల్లాణ్డు-3) (లంక పాలుపడేటట్లుగా సేవను నడిపించినవాడు) అనే రీతిలో లంకలో ఉండే రాక్షసులు అందఱు నశించిపోయేటట్లుగా పోరాడి, దానివల్ల కల్గిన గొప్ప అతిశయం చేత కోడెవలె పొగరుతో ఉండేవానిని.

---

1. అణ్మై విళి - సమీపస్థ సమ్బోధనై - పాఠాంతరం.

**(ఇమయమ్ మేయ ఎళ్ళిల్ మణిత్తిరళై)** - "ఇమయ మేయ" అనే పదాన్ని "ఇమయమ్, ఏయ" అని విభజించి "బంగారంవంటి" అనే అర్థాన్ని గ్రహించవచ్చు. "హిరణ్యమ్" అనే పదంనుండి పుట్టినది కనుక "ఇమయమ్" అనే పదం బంగారాన్ని సూచిస్తుంది. తనను ఆశ్రయించిన లక్ష్మీదేవి, ఋషులు మొదలైనవారికి విరోధి అయిన రావణుని సంహరించినందువల్ల గొప్ప గుణంతో బంగారంవలె ఇతడు ప్రకాశిస్తున్నాడని భావం. "ఎళ్ళిల్ మణిత్తిరళై" అనే ప్రయోగానికి అందంతో కూడిన మణుల వరుసవలె భోగ్యభూతుడై ఉన్నాడని భావం.

**(ఇమయమ్ మేయ ఎళ్ళిల్ మణిత్తిరళై)** - అనే పదాన్ని విభజించి హిమాలయం లోని లోపలి ప్రదేశంలో ఉండే బదరిలో వేంచేసి ఉన్న, మణుల వరుస వంటివాడు- అనే అర్థాన్ని గ్రహించవచ్చు. "శ్రీరామావతారానికి వెనుకబడినవారు కూడా అనుభవించేటట్లుగా హిమాలయాలలో ఉండే బదరికాశ్రమంలో అర్చావతార రూపంగా వేంచేసి ఉండేవాడు ఇతడు" - అనేది పూర్వుల అర్థనిర్వాహం. "ఏలనాఱు **తణ్‌తడమ్ పొళ్ళిల్ ఇడమ్** పెఱ ఇరున్ద నల్ ఇమయత్తుళ్.... పిరిది శెన్డడై నెఞ్జే!" (పెరియ తిరు-1-2-1) (పరిమళం వీచే చల్లని విశాలమైన తోటలలో చోటుచేసుకొన్న అందమైన హిమాలయంలో.... ఉండే బదరిని ఓ మనసా! చేరి ఆశ్రయించు) అని వీరే బదరిని అనుభవించారుకదా!

**(ఇన్ప ఆఱ్ఱినై)** - ఆనందప్రవాహంవలె ఉండేవానిని. "మతుర ఆఱే!" (తిరుమాలై-36) అని తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు కూడా అన్నారు కదా! "ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చ నేతి" (తైత్తి. ఆనం. 2-9) (పరమాత్మయొక్క ఆనందమనే గుణాన్ని తెలిసినవాడు లోకంలో దేనివల్ల భయపడడు) అని అంటూ ఉపనిషత్తుకూడా ఇతనిని ఆనందస్వరూపునిగా పలికిందికదా! "ఆఱు" అని అన్నందువల్ల సంసారతాపంచేత తపించేవారు లోతుగా మునిగి స్నానం చేసేటట్లుగా (పరిపూర్ణానందాన్ని పొందేటట్లుగా) ఉంటాడు ఇతడు అని, కావలసిన చోటకు మళ్ళించి ప్రవహింపజేసి, భక్తి అనే పైరును పండించుకొన గల్గిన రీతిలో ఉండేవాడు- అని తెలుపబడింది. "పేరమర్ కాతల్ కడల్ పురైయ విళైవిత్త కారమర్ మేని నమ్ కణ్ణన్" (తిరువాయ్-5-3-4) (గొప్పదైన భగవద్భక్తిని సముద్రం నిండేటట్లుగా ఎక్కువగా పండించిన, నల్లని మేఘంవంటి తిరుమేనిని కల మన స్వామి) అని నమ్మాళ్వార్లుకూడా ఇతడు భక్తి పైరును పండించేవాడని అన్నారు కదా!

**(అముతమ్ తన్నై)** - సత్తను కోల్పోయి పడి ఉండే ఆత్మనుకూడా ఉజ్జీవింప జేసేవాడై, మధురంగా ఉండడంవల్ల ఇతడు నిజమైన అమృతం - అని భావం.

(ఇన్నవాఱ్ఱినై అముదన్దన్నై) - తనను అనుభవించేవారిని సృష్టించేవాడు తానై, ఆ విధంగా సృష్టింపడేవారిచే అనుభవింపబడే భోగంకూడా తానే అయినవాడని భావం. జిహ్వచే అనుభవింపబడే ఆ అమృతంవలె కాకుండా "ఏతదేవామృతం దృష్ట్వా తృప్యంతి" (ఛాందో. ఆనం- 3-7-1, 3-8-1, 3-9-1) (ఈ పరమపురుషుడనే అమృతాన్ని చూచి ఆనందిస్తున్నారు) అని నేత్రాలతో అనుభవింపబడే అమృతంకదా ఇది.

ఈవిధంగా అనుభవింపబడే ప్రాప్యం, దానిని పొందించే మార్గం - (ప్రాపకం) ఇతడే కనుక ఈ అమృతాన్ని పానం చేసేవారికి ఏర్పడే ఆటంకాలను పోగొట్టే వారెవరు? అనే విషయాన్ని అనంతరప్రయోగంతో తెలుపుతున్నారు.

(అవుణన్ ఆరుయిఃరై ఉణ్డ కూఱ్ఱినై) - హిరణ్యకశిపునియొక్క పంహరించ డానికి సాధ్యం కాని ప్రాణాలను పానం చేసిన యమునివంటివానిని. (తనను) అనుభవించే వారికి ఎదురయ్యే ఆటంకాలను, ప్రహ్లాదుని విరోధి అయిన హిరణ్యకశిపుని నశింప జేసినట్లుగా నశింపజేసేవానిని - అని తాత్పర్యం.

(కూఱ్ఱినై) - "ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతోముఖమ్, నృసింహం భీషణం భద్రం మృత్యుమృత్యుం నమామ్యహమ్" (నృసింహానుష్టుభ్) (ఉగ్రమైనవాడు, వీరుడు, మహావిష్ణువు, అన్ని వైపుల జ్వలించేవాడు, భయంకరమైన వాడు, మంగళకరుడు, యమునికికూడా యముడు అయిన నృసింహుని నమస్కరిస్తున్నాను) అనే నృసింహానుష్టుభ్ మంత్రంలో యమునకు సైతం యమునిగా చెప్పబడిన విషయాన్ని (ఇక్కడ) స్మరిస్తున్నారు.

(కుణమ్ కొణ్డు ఉళ్ళమ్ కూఱు) - అతని కల్యాణగుణాలను భావించి, ఓ మనసా! - నీవు పలుకు.

(నీ కూఱుమాఱే) - వీరి మనస్సు (ముందడుగు వేసిన మనస్సు) "మున్దుఱ్ఱ నెఞ్జు" (ముందడుగు వేసిన మనస్సు) (పెరియ. తిరువన్దాది-1) అయి, "వీరు భగవానుని గుణాలను భావించేటట్లుగా ఎల్లప్పుడు నియమించిన వెంటనే గుణాలను గూర్చి పల్కడం (మనస్సు) ఆరంభించింది. "ఆహా! నీవు చాలా అందంగా పల్కుతున్నావు" అని దానిని పొగడు తున్నారు.

దివ్యార్థదీపిక :- తమ మనస్సును ఉద్దేశించి పల్కుతున్నారు; "ఓ మనసా! భగవానుని కల్యాణగుణాలను అనుసంధించాలని చూడు" అని అంటున్నారు; ఆవిధంగా అది అనుసధించడాన్ని చూచి ఆశ్చర్యపడి "ఓమనసా! నీవు అనుసంధించిన విధం ఏమి! ఆహా!" అని అభినివేశాన్ని పొందుతున్నారు.

(కాగ్రిగ్రినై పుప్పలనై త్తియై) - పంచభూతాలలో మూడు భూతాలను మాత్రం ప్రస్తావించడం మిగిలిన భూమి, ఆకాశం, అనే రెండు భూతాలకు ఉపలక్షణం. పంచభూతాల కార్యరూపమైన లోకాలను (దీనిద్వారా) నిర్దేశించినట్లై, లోకాలను శరీరంగా కల్గినవాడు (భగవానుడని) చెప్పినట్లయినది. శరీరాన్ని నిర్దేశించే శబ్దాలు శరీరిపర్యంతంగా నిర్దేశించి పర్యవసిస్తాయని వేదాంతుల సిద్ధాంతమని గ్రహించాలి.

(కడిమదిళ్ ఇలజ్జై శెగ్రు ఏగ్రిగ్రినై) - పలు కోటలను రక్షకంగా కల్గిన లంకాపురిని కాడుగా చేసిన మహాధీరుడని భావం. "తీణ్డా వఴుమ్పుమ్ శెన్నీరుమ్ శీయుమ్ నరమ్బుమ్ శెటి దశైయుమ్ వేణ్డావాగ్రు మికుముదల్" (వదలని మురికిని, రక్తాన్ని, చీమును అవయవాలు అతకబడ్డ దశను, దుర్గంధాన్ని మెండుగా కల శరీరం) అని చెప్పబడే ఈ ప్రాకృతమైన శరీరం లంకాపురిగా గ్రహించదగినది. అది (ఆ లంకాపురి) సముద్రంచే పరివేష్టితమై ఉంటుంది. ఇది సంసారమనే మహాసముద్రంచేత చుట్టబడి ఉంటుంది. అది పది తలలను కలవాడైన ఒక ప్రభువుచే ఆక్రమింపబడి ఉన్నది. ఇది పది ఇంద్రియాలనే పది తలలను కల మనస్సు అనే ఒక ప్రభువుచే ఆక్రమింపబడి ఉన్నది. అందులో సీతాదేవి దీనదశను పొందినది. ఇందులో జీవాత్మ చెఱపెట్టబడి బాధపడుతూ ఉన్నది. అక్కడ హనుమానుడు (శిఱియ తిరువడి) వచ్చి శ్రీరామగుణకీర్తనాన్ని చేసి, క్రమంగా (సీతాదేవి) చెఱనుండి విడిపించినట్లే, ఇక్కడకూడా ఆ శిఱియ తిరువడివంటి మహాపండితులైన ఆచార్యులు భగవద్గుణాలను ఉపదేశించి, చెఱనుండి విడిపిస్తారు. చివరలో భగవానునిచే ఆ లంక నశింపజేయబడినట్లే, ఈ ప్రాకృత శరీరంకూడా భగవానుని కృపవల్ల తొలగిపోతుంది- అని తెలియాలి.

(ఇమయ మేయ ఎఴిల్ మణిత్తిరళై) - "ఇమయమ్" అని బంగారానికి పేరున్నందువల్ల ఆ అర్థంకూడా ఇక్కడ గ్రాహ్యమే. అపుడు తరువాతి పదాన్ని "ఏయ"అని విడదీసి, బంగారంవంటి కాంతిని కలవాడని వివరించాలి. లేక, "ఎణ్ కైయాన్ ఇమయత్తుళ్ళాన్" అనే సందర్భంలోవలె హిమవత్పర్వతంలో ఉండే బదరికాశ్రమంలో నిత్యవాసాన్ని చేసేవాడు- అని భావం.

"ఏలనాఱు తణ్‌తడమ్ పొఴిలిడమ్ పెఱువిరువ నల్లిమయత్తుళ్... పిరిది శెన్ఱడై నెఞ్జే ! (పరిమళం వీచే చల్లని విశాలమైన తోటలో చక్కగా ఉండే అందమైన హిమాలయంలో) అనే ప్రయోగాన్ని గమనించండి. అందమైన నీలరత్నాలను కూర్చి పెట్టినట్లుగా భోగ్యమై ఉండేవాడని అర్థం. "ఎఴిల్ మణిత్తిరళై" అనే ప్రయోగంద్వారా స్ఫురిస్తుంది.

**(ఇన్బ వాఱ్ఱినై)** - ఆనందప్రవాహమే మూర్తీభవించినవాడు. దాహార్తిని పొందినవారి దాహాన్ని అంతటిని నది తీరుస్తుంది. భగవానుడు తాపత్రయాన్ని తీరుస్తాడు. తటాకం మొదలైనవి ఉన్నచోటనే ఉండి సహాయపడతాయి. నది ఆవిధంగా కాకుండా కోరినచోటకు ప్రవహింపజేసికొనగల్గినట్లుగా ఉంటుంది. భగవానుడుకూడా అటువంటివాడే. కోరినవారు కోరిన చోట్ల వేంచేసి భక్తిని ఉత్కూలంగా కల్గిస్తాడు.

**(అముదన్దన్నై)** - భక్తులకు అతృప్తామృతమై ఉండేవాడు. సముద్రంలో నుండి పుట్టిన లవణరసం అనే అమృతం నోటితో ఆస్వాదించదగినదిగా ఉంటుంది. ఈ తృప్తామృతం కన్నులతో పానం చేయదగినదై ఉంటుంది. "ఏతదేవామృతం దృష్ట్వా తృప్యంతి" (ఈ అమృతాన్ని చూచే తృప్తి పడుతున్నారు) అనే సూక్తిని గమనించండి.

**(అవుణనారుయిరై యుణ్ణ కూఱ్ఱినై)** - పూర్వం పల్కిన రీతిలోనే అమృతమై ఉండే స్వభావం భక్తులపట్ల మాత్రమే. ప్రతికూలురపట్ల అయితే మృత్యువై ఉంటాడు. ప్రహ్లాదాళ్వాన్‌కు పరమభోగ్యమైన అమృతమై ఉన్నవాడే హిరణ్యునకు మృత్యువైనాడుకదా! "అవుణనార్" అని అంటూ అసురవర్గాన్ని అంతటినీ చెప్పినట్లుగా గ్రహించి, వివరించవచ్చు. "కూఱ్ఱు" శరీరాన్ని, ప్రాణాన్ని వేఱు చేసేవాడు కనుక యమునకు ఇది యోగవాచకం.

**(ఉళ్ళమ్)**- (ఇది) సమీపసంబోధన. "ఓ మనసా!" అని అర్థం. "మనసా! కల్యాణగుణాలలో అభినివేశాన్ని పొంది నీవు పలుకు" అని వెంటనే "ఆహా! ఏమి నీవు పలికే తీరు !" అని అభినివేశాన్ని పొంది పల్కినందువల్ల మధ్యలో మనస్సులో ఒక విలక్షణమైన అనుసంధానం కల్గడం స్ఫురిస్తుంది. "మనసా! గుణాలలో ఆసక్తిని పొంది నీవు పలికే రీతిలో పలుకు" అని ఒకే వాక్యంగా అన్వయించి, "ఓ మనసా! భగవానుని కల్యాణగుణాలను నీవు అనుసంధించడంకోసం తెలిసిన రీతిలో అనుసంధానాన్ని చేయి" అని వివరించే అవకాశం ఉన్నా అది అంత సరసం కాదు.

3. పాయిరుమ్ పరవైతన్నుళ్ పెరువరై తిరిత్తు, వానోర్క్కు
ఆయిరున్దముతమ్ కొణ్డ అప్పనై ఎమ్బిరానై,
వేయిరుమ్ శోలై శూళ్ న్దు విరికతిరిరియ నిన్ఱ,
మాయిరుమ్ శోలై మేయ మైన్దనై వణఙ్గినేనే.

పా ఇరుమ్ = వైశాల్యాన్ని, లోతును కల, పరవై తన్నుళ్ = క్షీరాబ్ధిలో, పరు వరై = పెద్ద మందరపర్వతాన్ని, తిరిత్తు = పరిభ్ర మించేటట్లుగా చేసి, వానోర్క్కు ఇరున్ను = దేవతల కోసమై తాను సిద్ధమై ఉండి, అముతమ్ కొణ్డ = (వారికి మృత్యువు లేకుండా ఉండేటట్లు) అమృతాన్ని చిలికి ఉద్ధరించిన, అప్పనై = ఉపకారకుడై, ఎమ్బిరానై = దాసునకు అమృతమై ఉన్నవానిని, వేయ్ ఇరుమ్ = ఎత్తైన వెదుళ్ళను కల, శోలై శూழ్ = తోటలచే చుట్టబడి ఉండి (పరివేష్ఠితమై), విరి కతిర్ ఇరియ నిన్ఱ = విరిసిన కిరణాలను కల, సూర్యుడు (పర్వతం పైకి కిరణాలు పడకుండా) తొలగి తిరిగేటట్లున్న, మా ఇరుమ్ శోలై = తిరుమాలిరుమ్ శోలైలో, మేయ = ఆదరంతో వేంచేసి ఉండే, మైన్దనై = లేతవయస్సువానిని, వణఙ్గినేనే = (దాసుడనైన నేను) నమస్కరించాను.

అవ : మూన్ఱామ్పాట్టు (పాయిరుమ్) శొన్న వణక్కత్తై చ్చొల్లుకిఱార్.

వ్యా : (పాయిరుమిత్యాది) పా ఎన్ఱు - పరప్పు. ఇరుమై - పెరుమై. ఇవై ఇరణ్డాలు మాక - ఆழత్తైయుమ్, అకలత్తైయుమ్ శొన్నపడి. (పరువరై తిరిత్తు) కడలై క్కలఙ్గ్ శెయ్యిట్టాప్పోలే పెరియ మన్దరపర్వతత్తై నట్టు అమృతమ్ కిళరుమళవుమ్ తానే తిరియుమ్పడియాక నైత్త నాయ్ప్పమ్.

(వానోర్క్కాయిరున్దముతమ్ కొణ్డ అప్పనై) - తనక్కాయిరుప్పార్ అధమరితే; నిలా తెన్దల్ శన్దనమ్ తణ్ణీర్పోలే తన్నై పరార్థమాక్కి వైక్కుమవనితే [1] ఉత్తమన్. "పాతు నిన్ఱ పాన్నఙ్గழల్" ఎన్ఱుమ్, "సర్వలోకశరణ్యాయ" ఎన్ఱుమ్ శొల్లుకిఱపడియే ఎల్లార్క్కుమ్ తన్నై ప్రాతువాక్కియితే వైప్పతు. ఆశై యిల్లాతార్ ఇழన్దువిడుమిత్తనై. (అప్పనై) ఉపకారకనై. ప్రయోజనాన్తరపరరాన అన్తరజాతికళుక్కాక తన్నై అழియ మాఱి అనేకమ్ వడివు కొణ్డు ఉపకరిక్కుమవనై. (ఎమ్బిరానై) తమ్ముడైయ అమృతమ్.

(వేయిరుమిత్యాది) మూఙ్గిల్ కుழாఙ్గళాలే శూழ்న్దు విస్తృతకిరణనాన ఆదిత్యన్ తిరుమలైయాழ்వార్మేలే తన్ ఛాయై పడామే అకల సఞ్చరిక్కిఱ. (మాయిరుమ్ శోలై మేయ) తిరుమాలిరుమ్ శోలై ఎన్గిఱ తిరునామత్తై యుడైయ తిరుమలైయిలే పొరున్దియిరుక్కిఱ.

(మైన్దనై వణఙ్గినేనే) తన్మై అడిమైకొణ్డ పరువమ్. ఇవరై అడిమై కొళ్వతాక త్తిరుమలైయిలే ఎழున్దరుళి నిన్ఱపిన్బు వడివు ఇళకి ప్పతిత్తపడి. (అప్పనై) ఎన్ఱ కీழ்ఱే ఒరు ముతుమై శొల్లి, ఇప్పోతు- (మైన్దనై) ఎన్గిఱారితే.

1. 'ఉత్తమన్' అనే పదం పాఠాంతరంలో లేదు.

*అరు : (పాయిరుమ్) వణక్కమ్ ముఁగల్ పాట్టిలే శొన్నతు. తిరియుమ్పడి- శుఴలుమ్పడి. నొయ్ప్పమ్- సామర్థ్యమ్. ప్రయోజనాన్తరర్క్కుమ్ తన్నై ఆక్కినైక్క కూడుమో? ఎన్న, అరుళిచ్చెయ్కిఱార్ (పొతునిన్ఱ ఇత్యాది). అన్తరజాతి-చాటు. “అప్పనై, మైన్దనై” ఎన్నతు - “అరుమ్బినై, అలరై” ఎన్నుమాపోలే.*

భావదీపిక-అవ : మొదటి పాశురంలో “వణఙ్గి” అని పల్కిన విషయాన్ని ఈ పాశురంలో వివరిస్తున్నారు.

వ్యాఖ్యానం :- (పాయిరుమ్ పరవై తన్నుళ్) - వైశాల్యం, లోతు కల పాల సముద్రంలో - అని భావం. “పా” అనే పదం విస్తృతివి, “ఇరుమ్” అనే పదం గొప్ప తనాన్ని తెలుపుతుంది. ఈ రెండిటిద్వారా పాలకడలిలోని లోతు, వైశాల్యం తెలుప బడ్డాయి.

(పరువరై తిరిత్తు) - ఆ సముద్రాన్నే ఆవరించేటట్లున్న చాలా పెద్దదైన మందరపర్వతాన్ని నాటి, అమృతం వెలువడేవరకు తానే తిరిగేటట్లుగా నిలిపిన సామర్థ్యం తెలుపబడింది.

(వానోర్క్కాయిరున్దు అముదమ్ కొణ్డ అప్పనై) - దేవతలకోసం తనను విధేయునిగా చేసికొని, అమృతాన్ని చిలికి తీసిన ఉపకారకుని- అని భావం. తన కోసమే ప్రయత్నించేవాడు అధముడు. తనకోసం, ఇతరులకోసం ప్రయత్నించేవాడు మధ్యముడు. ఇతరులకోసమే ప్రయత్నించేవాడు ఉత్తముడు. వెన్నెల, మలయ మారుతం, చందనం, పన్నీరువలె భగవానుడు తనను ఇతరులకోసం వినియోగ పఱచుకొంటాడు కదా! “పొతునిన్ఱ పొన్నఙ్కఴల్” (అందరికి సాధారణంగా ఉండే బంగారంవలె అందమైన శ్రీచరణాలు) అని పేయాఴ్వార్లు, “నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్, సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే” (రామా-యుద్ధ-17-17) (సమస్తలోకానికి శరణ్యుడు, మహాపురుషుడైన రాఘవునివద్ద శరణు పొందిన విభీషణుడనైన నన్నుగూర్చి త్వరగా అతనికి తెలియజేయండి) అని శరణు పొందిన విభీషణుడు పల్కిన రీతిలో భగవానుడు అందఱికి ఉపయోగ పడేటట్లు తనను సాధారణునిగా చేసికొంటాడుకదా! ఆవిధంగా అతడు తనను (అందఱికి) సాధారణు నిగా చేసికొన్నప్పటికీ, ఆశ లేనివారు అతనిని కోల్పోవడం వారి కొఱతే అవుతుంది.

(అప్పనై) - ఉపకారాన్ని చేసినవానిని - అని భావం. ఆశ లేని అధములలో చేరకుండా, అతనినే ప్రయోజనంగా గ్రహించే ఉత్తములలో చేరకుండా ఉండే

అంతరజాతికి చెందినవారై (దేవజాతికి చెందిన వారై), వారి వద్ద ప్రయోజనాంతరాలను వేడినవారికి కూడా తన స్వరూపాన్ని తక్కువగా జేసికొని, కూర్మరూపం, స్త్రీరూపం మొదలైన పలు రూపాలను గ్రహించి ఉపకారం చేసినవాడు.

(ఎమ్బిరానై) -దేవతలు అతనివద్ద పొందినది ఉప్పు రసం. దాసుడనైన నేను అతనివద్ద నిజమైన అమృతం అయిన అతనినే పొందాను.

(వేయిరుమ్ శోలై శూళ్న్దు విరికతిర్ ఇరియ విన్ఱ) - ఉన్నతాలైన వెదుళ్ళ తోటలచే పరివేష్టితమై, విరిసిన (ప్రసరించిన) కిరణాలను కల సూర్యుడు పర్వతంపైన కిరణాలు పడకుండా తొలగి తిరిగే రీతిలో- అని భావం.

(మాయిరుమ్ శోలై మేయ) - తిరుమాలిరుమ్ శోలై అనే తిరునామాన్ని కల్గిన పర్వతంలో అమరి ఉన్న. "మేవి యుఱై కోయిల్" (తిరువాయ్- 4-10-2) (ఆదరించి వేంచేసి ఉండే కోవెల) అనే రీతిలో పరమపదంకంటే పొందికగా ఉన్నవానిని.

(మైన్దనై వణఙ్గినేనే) - లేతవయస్సులో ఉన్నవానిని (నవయువకుని) దాసుడనైన నేను నమస్కరించాను. ఇతని పరువంలో ఆళ్వార్లు అభినివేశాన్ని పొందిన విషయాన్ని, వీరిని దాసులుగా చేసికోవడంకోసం తిరుమాలిరుమ్శోలై తిరుమలైలో వేంచేసి ఉన్న తరువాత స్వామి దివ్యరూపంలో లేతవయస్సు అతిశయించి ఉన్న విషయాన్ని ఈపదం తెల్పుతుంది. "అప్పనై" అని రెండవ పాదంలో పెద్దతనాన్ని గూర్చి పల్కి, ఇక్కడ "మైన్దనై" అని లేతవయస్సును తెలుపడంవల్ల రెండు పరువాల సంధికి మధ్యలో ఉన్నవాడు (కౌమార- యౌవనపరువాల సంధిలో ఉన్నవాడు) అని స్ఫురిస్తున్నది. ఈ విషయాన్ని 'యువా కుమార:" (ఋగ్వే.అష్ట- 2-2-25) (మంచి యౌవనంలో ఉన్నవాడు, కొంచెం కౌమారదశలో - కౌమారదశ చివరలో ఉన్నవాడు) అని వేదపురుషుడు, "అరుమ్బినై అలరై" (పెరియ తిరు-7-10-1) (మొగ్గవలె కౌమారదశను కలవాడు, పూవువలె యౌవనదశను కలవాడు) అని వీరు (తిరుమంగై మన్నన్) అనుసంధించారు కదా!

**దివ్యార్థదీపిక** : "తనను కోరకుండా ప్రయోజనాంతరాన్నే కోరి, దూరమై పోవాలని తలచినవారికి కూడా తన తిరుమేని శ్రమపడేటట్లుగా వారి కార్యాన్ని చేసేవాడై ఉన్నాడు భగవానుడు. విభవావతారాలలో (దర్శనాన్ని) కోల్పోయినవారికి సైతం సహాయపడడంకోసం తిరుమాలిరుమ్శోలై పర్వతం మొదలైన తిరుపతులలో నిత్యవాసాన్ని కల్గి ఉన్నాడు. అటువంటి వానిని సేవిస్తున్నాను'' అని అంటున్నారు.

సముద్రాన్ని చిలికినపుడు మందరపర్వతాన్ని కవ్వంగా నాటి చిలికినందువల్ల "పరువరై తిరిత్తు" అని అనబడింది. భగవానుడు అవాప్త సమస్తకాముడు కనుక, అతడు చేసే కార్యాలన్నీ ఇతరుల కోసమై ఉంటాయి. వెన్నెల, మలయమారుతం, చందనం మొదలైన వస్తువులు ఇతరులకు ఉపయోగపడడం కోసమే ఉన్నట్లు భగవానుడుకూడా ఉంటాడు అనే విషయం స్ఫురించేటట్లు "వానోర్క్కా యిరున్దు" అని అనబడింది. "అముదమ్ తన్ద" అని అనవలసి ఉండగా, "కొణ్డ" అని అనడం - భగవానుని అభిప్రాయానుసారంగా. సముద్రం చిలికి, అమృతాన్ని ఉద్ధరించడం వారికోసం కాకుండా తన ప్రయోజనంగా (అతడు) తలచినందువల్ల.

"విరికదిర్ ఞరియ నిన్ఱ" - (ఈ ప్రయోగం) సూర్యకిరణాలు లోపల ప్రవేశించ నీయకుండా ఉండే రీతిలో దట్టమైన నీడను ఇవ్వడాన్నిగూర్చి తెలుపుతున్నది.

4. కేట్క యానుఱ్ఱదుణ్డు కేழలా యులకమ్ కొణ్డ,
పూక్కெழు వణ్ణనారై ప్పోదర క్కనవిల్ కణ్డు
వాక్కినాల్ కరుమన్దన్నాల్ మనత్తినాల్ శిరత్తైతన్నాల్,
వేట్కై మీతూర వాழ్గి వియழுజ్గినేఱ్కినియవాఱే!

యాన్ = దాసుడనైన నేను, కేట్క ఉఱ్ఱదు ఉణ్డు = ఒక విషయాన్ని అడగగోరుతున్నాను, కేழలాయ్ = వరాహరూపాన్ని కలవాడవై, ఉలకమ్ కొణ్డ = భూమిని (దంతంలో) ఉద్ధరించిన, పూక్కெழு వణ్ణనారై = పూవువలె సౌకుమార్యాన్ని కల్గిన మిమ్మలను, కనవిల్ = మనస్సులో, పోదర = మిక్కిలి, కణ్డు =దర్శించి (అనుభవించి), వాక్కినాల్ = వాక్కుతో, కరుమమ్ తన్నాల్ = క్రియలతో, మనత్తినాల్ = మనస్సుతో (మూడు కరణాలతో), శిరత్తై తన్నాల్ = శిరస్సుతో, వేట్కై మీతూర వాழ்గి = ఆశ అతిశయించేటట్లు కీర్తిస్తూ, వియழுజ్గినేఱ్కు = అనుభవించగల్గిన నాకు, ఇనియ వాఱే = భగవద్విషయం మధురంగా ఉన్నదే! (ఇది ఏవిధంగా! అన్న విషయాన్నే నేను వినదలచాను).

వ్యా :- నాలామ్పాట్టు. (కేట్క ఇత్యాది) అడియేన్ దేవరీరై ఒన్ఱు కేట్కలుఱ్ఱేన్. అత్తై అరుళిచ్చెయ్యవేణుమ్. అతు ఎన్నెన్నుతు? ఎన్న, (కేழలాయులకజ్గొణ్డ ఇత్యాది) పుష్పహాసముకుమారమాన వడివై "మానమిలా ప్పన్ఱి"యాక్కి "నిలమ్ కోట్టిడై కొణ్డ"తు, ఇవ్వ క్కழுఞ్జ మణ్ణుమఱ్ఱిన్నాల్ పిన్ను పృష్టిక్కై, అరితాయ్‌చ్చెయ్ తరుళిఱ్ఱో? ఇత్తై ఎనక్కు అరుళిచ్చెయ్యవేణుమ్. ప్రళయమ్ కొణ్డ భూమి, తన్నై ఎడుక్కిలితే ఇవన్ ఇతుక్కు ఉత్తరమ్ శొల్లువతు. (పోతర క్కనవిల్ కణ్డు) మికవుమ్ వెళ్ళిలే కణ్డు. ఇన్ద్రియజ్ఞలాల్ వ్యవచ్ఛేదమిన్ఱిక్కే అవ్యవధానేన విశదమాక క్కణ్డు.

(వాక్కివాలిత్యాది) మనోవాక్కాయఙ్గళాలుమ్, శ్రద్ధైయాలుమ్ మిక్క అభినివేశత్తై యుడైయేనాయ్ విణ్ణక్కేనుక్కు ఇవిరాయిరుప్పతు. విణ్ణప్పై-అనుభవిక్కై. ఎవ్విషయఙ్గళ్ అనుభవిత్తు రసిత్తుప్పోన్ద ఎనక్కు ఎవ్విషయమ్ రసిక్కిఱతు! (విణ్ణక్కసేక్కివియవాతే) ఎనక్కినిరాప వళి ఎన్నానీ. 'ఎవ్వళియాలే ఉకట్టిప్పోన్ద విషయమ్ ఎవ్వళియాలే ఇనిరాయిఱ్ఱు? ఇతు ఇనిరాన వళియై అరుళిచ్చెయ్య వేణుమ్. ఇతుక్కు అవన్ ఎన్న ఉత్తరమ్ శొల్లువతు? ప్రళయమ్ కొణ్డ భూమియై ఎడుత్తతు ఉడైనై మఙ్గామైక్కన్ఱో! అవ్వోపాతి మఙ్గవొణ్ణాలెన్ఱు సంసారప్రళయత్తిల్ విష్టమ్ ఇవరై ఎడుత్తానిత్తనైయితే.

అరు : వాలామ్మ్రాట్టు :- పోతర - మికవుమ్. కనవు - మానసానుభవమ్. శిరత్తై - శ్రద్ధై. ఉకట్టి ప్పోన్ద విషయమ్ - ఎల్లాప్రకారత్తాలుమ్ ఇతరవిషయఙ్గళై అనుభవిత్తు అరువరుత్తుప్పోన్ద భగవద్విషయమెన్నపడి. (ఇవియవాటు - కేట్కు యామున్ఱ్ఱియున్ఱు) ఎన్ఱన్వయమ్.

భావదీపిక-అవ : అతిశయించిన దాహాన్ని కలవాడు శరీరంపైన, ముఖంలోను నీటిని ఎత్తి జల్లుకొనేటట్లుగా, భగవానుని త్రికరణాలతో అనుభవించి ఆనందించ డాన్ని గూర్చి (ఈ పాశురంలో) పల్కుతున్నారు.

వ్యాఖ్యానం : (కేట్కు యామున్ఱ్ఱియున్ఱు) - దాసుడనైన నేను నిన్ను ఒక విషయాన్నిగూర్చి ప్రశ్నించాలని అనుకొంటున్నాను. దానినిగూర్చి నాకు తెలియ జేయాలి. ఆ విషయం ఏమి? అనే భగవానుని మనస్సులోని భావనను గమనించి, పాశురంలోని మిగిలిన భాగంలో దానికి సమాధానాన్ని ఆళ్వార్లు పల్కుతున్నారు.

(కేళ్ళలాయ్ ఉలకఙ్కొణ్డ పూక్కోళ్ వణ్ణనాసై) -"పుష్పహాసః" (పూవు యొక్క వికాసంవలె మనోహరుడు) (విష్ణుసహస్రనామం) అనే రీతిలో సౌకుమార్యం అతిశయించి ఉండే రూపాన్ని "మానమిలా ప్పన్ఱియామ్" (నాచ్చియార్ తిరు-11-8) (ఇంత అని పరిమితి లేని గొప్ప వరాహరూపాన్ని కలవాడు) అని గోదాదేవి అనుగ్రహించినట్లుగా అభిమానం లేని (గొప్ప) వరాహంగా మలచుకొని, "కోలవరాక మొన్ఱాయ్ నిలమ్ కోట్టిడై క్కొణ్డ ఎన్దాయ్!" (తిరువాయ్-10-10-7) (అందమైన ఒక అద్వితీయ వరాహమై, దంతాగ్రంతో భూమిని ఉద్ధరించిన తండ్రీ!) అని నమ్మాళ్వార్లు అనుగ్రహించిన రీతిలో భూమిని దంతంలో గుచ్చి ఎత్తి ఉద్ధరించి నిలిపావుకదా! ఈ పిడికెడు మన్ను, నశించిపోతే మళ్ళీ దాన్ని సృష్టించడం అరుదు - అనే భావనతో ఈవిధంగా చేశావా? దీనినిగూర్చి మొదటనే నాకు తెలియజేయాలి.

1. ఎత్తైయువళియాలే (విషయాంతరానుభవత్తాలే) కుమట్టి - (అరువరుత్తు) ప్పోన్ద భగవద్విషయమ్ - పాఠాంతరం.

("భూమిని ప్రళయం ముంచి మింగివేసింది. అది (భూమి) తనను తాను కాపాడుకొనే దారిలేదు. అందువల్ల స్వామిని అయిన నేనే దానిని ఉద్ధరించాను" అని దీనికి భగవానుడు చెప్పదగిన సమాధానం.)

(పోదర క్కనవిల్ కణ్డు) మిక్కిలిగా మనస్సులో దర్శించి- అని భావం. ఇక్కడ "కనవు" అనే పదం ఆళ్వార్లకు భగవానుడు అనుగ్రహించిన మానసిక సాక్షాత్కారాన్ని సూచిస్తుంది. బాహ్యసాక్షాత్కారం అయితే ఆత్మ మనస్సుతో సంబంధాన్ని పొంది, మనోనేత్రం అనే ఇంద్రియంతో సంబంధాన్ని పొంది, ఆ పిమ్మట దర్శనాన్ని పొందాలి. ఈవిధంగా ఇంద్రియాలనే అంతరాయాలు లేకుండా, నేరుగా మనస్సులోనే స్ఫుటంగా దర్శించి- అని అర్థం. "స్వప్నధీగమ్యం పురుషమ్" (మను-12-122) (స్వప్నంవంటి మనోదర్శనజ్ఞానంద్వారా చూడబడే పరమపురుషుని) అనే మనుస్మృతిచేత, "కణ్డేన్ తిరుమేని యాన్ కనవిల్" (ఇరణ్డామ్ తిరు-67) (భగవానుని దివ్యరూపాన్ని నేను స్వప్నంలో దర్శించాను) అని పూదత్తాళ్వార్లచేత భగవానుని మానసికంగా దర్శించడం "స్వప్న" మని (కనవు) అని వ్యవహరింపబడిందికదా!

(వాక్కినాల్ ... ఇనియవాతే) - మనోవాక్కాయాలనే త్రివిధకరణాలతో, శ్రద్ధతో చాలా ఆర్తిగా దేవరవారిని అనుభవించిన నాకు చాలా భోగ్యంగా ఉన్నదే! ఇదేమి ఆశ్చర్యం! శబ్దాదిలౌకికవిషయాలను అనుభవించి, ఆనందిస్తూ ఉండే నేను భగవద్విషయంలోని రస్యతను తెలియగల్గడం ఏమి ఆశ్చర్యం! "విళుఙ్గికై" అనే పదం ఇక్కడ అనుభవించడాన్ని తెలుపుతుంది.

(విళుఙ్గినేఱ్కు ఇనియవాతే) - నాకు భగవద్విషయం మధురమై ఉండడం ఏవిధంగా! ఎల్లప్పుడు శబ్దాదివిషయాలనే అనుభవిస్తూ ఉన్నందువల్ల ఏదారిలో భగవద్విషయాన్ని లోపలకు ప్రవేశింపజేసినా, వమనం చేసికొన్న (ఏవగించుకొన్న) భగవద్విషయం ఇపుడు రీతిలో భోగ్యమైనది? ఈ భోగ్యమైన రీతిని దేవరవారే అనుగ్రహించాలి. దీనికి చెప్పదగిన సమాధానం - "ప్రళయం మింగివేసిన భూమిని ఉద్ధరించడం నా సొత్తు బాధపడకూడదని కదా! అదే రీతిలో నా సొత్తు అయిన మీరు బాధపడకూడదని సంసారప్రళయంనుండి మిమ్ములను ఉద్ధరించాను" అన్నదే.

దివ్యార్థదీపిక :- "భగవానుని ఉద్దేశించి ఒక ప్రశ్నను అడుగుతున్నాను"- అని అంటున్నారు, చమత్కారంగా. మహావరాహమూర్తిగా అవతరించి భూమిని తన దంతంతో ఉద్ధరించిన భగవానుడు స్వప్నంలో వేంచేసి సాక్షాత్కరించగానే ఆ భగవానుని మనోవాక్కాయాలతో భక్తితో గ్రహించి అనుభవించాను. విషయాంత

రాలను అనుభవించి ఆనందించిన నాకు ఈ విషయం పరమరస్యంగా ఉన్నది. ఈ విధంగా ఉండడానికి గల కారణాన్ని తెలపాలి- అని అడుగుతున్నాను"- అని అంటున్నారు.

(కేట్కయాను శ్రిృతుణ్డు) - నమ్మాళ్వార్లు తమ దివ్యప్రబంధాలలో భగవానుని ఉద్దేశించి కొన్ని ప్రశ్నలను అడిగారు. పెరియతిరువన్దాదిలో "అరుకుమ్ శువడుమ్ తెరివుణరోమ్, అన్బే పెరుకుమ్ మిక ఇతువెన్? పేశిర్" అని, (నిన్ను సమీపించడాన్ని, దానికి ఉపాయాన్ని విచారించి తెలియలేము. నీ విషయంలో మాకు భక్తి చాలా వృద్ధి అవుతున్నది. దీనికి ఏమి కారణం? నీవే చెప్పు) "పువియుమ్ ఇరువిశుమ్బుమ్ నిన్న అకత్త, నీయెన్ శెవియిన్ వశ్రి పుకున్దు ఎన్నుళ్ళాయ్, అవివిన్ది యాన్ పెరియన్ నీ పెరియై ఎన్దతనై యారఱివార్, ఊన్‌పరుకు నేమియాయుళ్ళు" (శత్రువుల రక్తాన్ని పానం చేసే చక్రాయుధాన్ని కలవాడా! ప్రాకృతం అయిన ఈ భూమి, చాలా విస్తృతమైన ఆ పరమపదం, నీ సంకల్పంతో సిద్ధిస్తున్నాయి. ఇటువంటి నీవు నా చెవిద్వారా నా లోపలకు ప్రవేశించి, ఆటంకం లేకుండా నా మనస్సులో ఉండి సత్తను పొందుతున్నావు. మన ఇద్దరిలో నేను పెద్దవాడనా? నీవు పెద్దవాడనా అనే విషయాన్ని ఎవరు తెలియగలరు? నీవే మనస్సులో భావించి చూడు) అని, తిరువాయ్‌మొశ్రిలో "ఇన్దైన్దై ప్పారుళాక్కిత్తన్నై ఎన్నుళ్ వైత్తాయ్, అన్దైన్దై ప్పుఱమ్ పోక ప్పుణర్త్తదెన్‌శెయ్‌వాన్? కున్దైన్న త్తికశ్రి మాడజ్గళ్‌శూశ్రి తిరుప్పేరాన్, ఒన్దైనెక్కరుళ్ శెయ్య ఉణర్త్తలుశ్రిన్రే" (ఇపుడు నన్ను ఒక విషయంగా తలచి పరిగ్రహించి తనలో ఉంచుకున్నాడు. ఇంతకు ముందు నన్ను లౌకిక విషయాలలో ఆసక్తునిగా చేసినది ఎందుకోసం? పర్వతాల వంటి గొప్ప మేడలు చుట్టి ఉండే తిరుప్పేర్ నగర్‌లో వేంచేసి ఉండే స్వామిని ఈ ప్రశ్నను అడగదలిచాను) అని - ఈ విధంగా కొన్ని ప్రశ్నలను అడిగారు. వాటికి భగవానుడు ఏ సమాధానాన్ని చెప్పలేదు. అవిధమైన వాడు ఈ ఆళ్వార్ల ప్రశ్నకు మాత్రం ఏదైవా సమాధానాన్ని చెప్పబోతున్నాడా! చెప్పబోడు- అని వీరు తెలిసినా, పేరాశతో అడుగుతున్నారు. "నిన్ను అనుభవించిన నాకు నీవు పరమభోగ్యుడై ఉన్నావే. దీనికి ఏమి కారణమో చెప్పు" అని అడిగే వీరి ప్రశ్నకు సర్వజ్ఞుడైన భగవానుని చేతకూడా ఏమి బదులు చెప్పడానికి సాధ్యం? వీరు అడిగే ప్రశ్నలకు అర్థమున్నదా! "అణ్ణిక్కు మముదూఱుమ్ ఎన్నావుక్కే" (నా నాలుకకు రుచిస్తుంది, అమృతం ఊరుతుంది) అని మధురకవియాళ్వార్ తమ ఆనందాన్ని వ్యక్తం చేసినట్లే వీరు తమ ప్రశ్న అనే వ్యాజంతో తమ పరమానందాన్నే ప్రకాశింప జేస్తున్నారు; అంతే - అని తెలియాలి. "చక్కరను

నాలుకపై వేసికొన్న వెంటనే తీయగా ఉన్నదే! దానికి ఏమి కారణం!" అని ఎవరైనా అడిగితే, ఆ ప్రశ్నకు అర్థమేమి?

"శ్రద్ధా" అనే సంస్కృతపదం "శిరత్తై" అని పరిణమించింది.

"పూక్కొళుమ్ వణ్ణనారై...... వేట్కమీదూర వాఙ్గి విళుఙ్గినేఱ్కినియవాఱే!" (ఇదువెన్? ఎన్ఱు) కేట్క యానుఱ్ఱతుణ్డు" - అని అన్వయించాలి.

5. ఇరుమ్బనన్ఱుణ్డ నీర్పోల్ ఎమ్బెరుమానుక్కెన్తన్,
అరుమ్ పెఱలన్బు పుక్కిట్టడిమై పూణ్డుయ్న్దుపోనేన్
వరుమ్ పుయల్ వణ్ణనారై మరువి ఎన్ మనత్తు వైత్తు,
క్కరుమ్బినిన్ శాఱుపోల ప్పరుకినేఱ్కినియవాఱే.

ఇరుమ్బు = ఇనుము, అనన్ఱు = బాగా నిప్పులో కాచబడి, ఉణ్డ = (ఆ వేడిమి చల్లబడేటట్లుగా) పీల్చిన, నీర్ పోలే = నీరువలె, ఎమ్బెరుమానుక్కు = నాకు ప్రాప్తశేషివద్ద, ఎన్తన్ = నాయొక్క, పెఱల్ అరుమ్ = పొందడానికి అరుదైన, అన్బు = ప్రేమను (భక్తిని), పుక్కిట్టి = నిలిపి, అడిమై పూణ్డు = దాస్యమనే ఆభరణాన్ని ధరించి (అలంకరించుకొని), ఉయ్న్దు పోనేన్ = ఉజ్జీవించాను, (అంతేకాక), వరుమ్ పుయల్ = (నేనున్న చోటును వెదకి) వచ్చే మేఘంవంటి, వణ్ణనారై = స్వభావాన్ని కలవానిని, మరువి = (నన్ను మఱచి) సమీపించి, ఎన్ మనత్తు వైత్తు = నా మనస్సులో నిలుకడగా నిలిపి, కరుమ్బిన్ =చెఱకుయొక్క, ఇన్ శాఱు పోల =తీయని రసాన్నివలె, పరుకునేఱ్కు = అనుభవించిన దాసునకు, ఇనియ వాఱే = (అతడు) భోగ్యుడై ఉండడం ఏమి ఆశ్చర్యం!

వ్యా :- అక్షామ్బాట్టు. (ఇరుమ్బు అనన్ఱు ఉణ్డ నీర్ పోలిత్యాది) ఇరుమ్బానతు అగ్నియాలే మికవుమ్ తప్తమాయ్ అక్కాయ్చ్చల్ అడఙ్గ పానమ్ పణ్ణప్పట్ట జలమ్బోలే. (ఎమ్బెరుమానుక్కు) వకుత్త శేషిక్కు. (ఎన్తనరుమ్ పెఱలమ్బు) "అరుమ్ పెఱలడికళై" ప్పఱ్ఱిలుమ్ కిడైయాత అన్బు. ఎనక్కు భగవద్విషయత్తిలే అన్బు పిఱక్కై యానతు- ఇన్దళత్తే తామరై పూక్కైయిఱే. అహఙ్కారమహానహిమ్నాయిఱే. ఇన్దళమ్- కుమ్మట్టి. (పుక్కిట్టు) అన్పై అవన్పక్కలిలే యాక్కి.

(అడిమై పూణ్డు) "అహం సర్వం కరిష్యామి" ఎన్గిఱపడియే వళువిలా అడిమైయిలే అన్వయిత్తు. (అడిమై పూణ్డు) "తొణ్డు పూణ్డు" ఎన్నుమాపోలే ఇవ్వాత్మావుక్కు ఆభరణమిఱే- భగవద్దాస్యమ్. ఆకైయాలే (పూణ్డు) ఎన్గిఱార్. (ఉయ్న్దుపోనేన్) మున్బు "అసన్నేవ" ఇఱే.

(వరుమ్ పుయల్ వణ్ణనారై) ఇరుప్ప విడత్తే యిరుప్పు విదాయ్ కెడుక్కుమ్ మేఘమన్ఱు; కడలై మణలోడే కళ్ళుత్తే కట్టలైయాక ప్పరుక్కి త్తప్పిప్పువరుకిఱ మేఘమ్పోలే ఇరుక్క వరుమ్. (మరువి) "మైత్తెళ్ళున్ద మామకిలే పార్త్తిరుక్కుమ్ మఱ్ఱివైపోల్". (పుయల్ వణ్ణనారై మరువి) ఎన్నై మఱన్దు కిట్టి.

(ఎన్ మనత్తు వైత్తు) పశ్చారమ్ అఱ్ఱపడి. ఉద్దేశ్యమ్ కైపుకున్దాల్ ఉణ్డో పశ్చారమ్? (కరుమ్బిన్ ఇన్శాఱుపోల ప్పరుకినేఱ్కు) విళ్ళుఞ్జుకై పోయ్ ప్పరుకలామ్పడియాయిఱ్ఱు. ఆళ్వారుడనే కలక్క క్కలక్క ప్పరుకలామ్పడి ఒరునీరానాన్. (ఇనియవాఱే) ఇతువమొరు ఇనిమైయేతాన్! ఇతొరు నీర్మై ఇరువ్వపడి ఎన్!

అరు : అఞ్జామ్పాట్టు- (ఇరుమ్బు) (అనన్ఱు)- అనలుకై- కాయ్క్ఱై. తమ్మిడైయ విదాయాఱుమ్పడి (పరుకినేన్) ఎన్గిఱార్. అప్పడి భక్తి పిఱక్కై అరితాయిరుక్కుమో? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్; (ఎనక్కిత్యాది). ఇవన్ ఇన్దళమో? ఎన్న, అరుళిచ్చెయ్ కిఱార్; (అహఙ్కారమిత్యాది) మేఘత్తై క్కణ్డ పయిర్పోలే మరువి - ఎన్నుతల్; అవన్ వర విముఖనాయ్ త్తిరిన్ద ఎన్నై మఱన్దు మరువి - ఎన్నుతల్. పశ్చారమఱ్ఱు ఇవర్ మనస్సితే పుకున్ద పిన్బు అవనుక్కు ప్పుఱమ్బు పోక్కఱ్ఱపడి. ఇవర్ మనస్సితే అవనుక్కుద్దేశ్యమ్. అన్ఱియే, మనస్సుక్కు వేఱు పశ్చారమిన్ఱిక్కే [1]ఎన్దాయ్, మనస్పశ్చార మిన్ఱిక్కే యిరుక్కుమో? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్ (ఉద్దేశ్యమిత్యాది).

భావదీపిక-అవ : భగవానుని అనుభవించి ఆనందించానని గడచిన పాశు రంలో ఆళ్వార్లు అన్నారు. ఆళ్వార్లతో కలువగా కలువగా, పానం చేయదగి నట్లుగా భగవానుడు ఒక నీరుగా అయినందువల్ల (ద్రవించినందువల్ల) "పరుకినేన్" అని ఈ పాశురంలో అంటున్నారు.

వ్యాఖ్యానం : (ఇరుమ్బు అనన్ఱు ఉణ్డ నీర్పోల్) - ఇనుము నిప్పుచే చాలా తపింపజేయబడినపుడు, ఆ వేడిమి అణగారడంకోసం ఆ ఇనుముచే పీల్చబడ్డ చల్లని నీరువలె- అని భావం.

(ఎమ్బెరుమానుక్కు) - నా స్వరూపానికి తగినవాడైన స్వామికి.

(ఎన్దన్ అరుమ్ పెఱల్ అన్బు) - "అరుమ్పెఱలడికళ్" (తిరువాయ్-1-3-1) అని చెప్పబడ్డ భగవానుని ఆశ్రయించినా, ఇతఃపూర్వం కలుగని ప్రేమ (భక్తి) అని అర్థం. నేను ముందున్న స్థితి- "మండుతున్న కుంపటి (అడుపు)లో తామర పూచినా పూస్తుంది కాని, వీరికి భగవానునిపట్ల ప్రేమ కలుగదు" - అనే రీతిలో

1. ఒన్దాయ్ - పాఠాంతరం.

కదా ఉన్నది. అహంకారమమకారాలనే గొప్ప నిప్పే మూర్తీభవించినట్లుగా కదా నేను ఇతఃపూర్వం ఉన్నాను. "ఇన్దళమ్" -కుంపటి.

(పుక్కిట్టు) - ఇటువంటి నాకు పొందడానికి అరుదైన భక్తిని భగవానుని విషయంలో నేను కల్గి ఉండి.

(అడిమై పూణ్డు) - "భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపతశ్చ తే" (రామా-అయో- 31-27) (నీవు వైదేహితో పాటుగా పర్వతసానువులలో విహరించే సమయంలో నేను మీరిరువురకు నిదురించే టపుడు, మేల్కొని ఉన్నపుడు అన్ని విధాలైన సేవలను చేస్తాను) అని పలికే లక్ష్మణునివలె, "ఒழிవిల్ కాల మెల్లామ్ ఉడనాయ్ మన్ని వழுవిలా అడిమై శెయ్యవేణ్డుమ్ నామ్" (తిరువాయ్- 3-3-1) (విచ్ఛేదం లేని కాలం అంతా నిలకడగా ఉన్నవారమై ఏ అటంకం లేని కైంకర్యాన్ని మనం చేయాలి) అని పల్కిన నమ్మాழ்వార్లవలె కైంకర్యాన్ని చేసి.

(అడిమై పూణ్డు) - "పూణ్డు" అని అన్నందువల్ల ఈ ఆழ்వార్లకు అంగుళీయకం అనే ఆభరణంవలె కైంకర్యం అందంగా ఉంటుంది - అని తెలుపుతున్నారు. "తొణ్డు పూణ్డు" (తిరుమాలై-5)అని తొణ్డరడిప్పొడి ఆழ்వార్లు కూడా ఈ విధంగానే అనుగ్రహించారు.

(ఉయ్న్దుపోనేన్) - "అసన్నేవ స భవతి అసద్బ్రహ్మేతి వేద చేత్, అస్తి బ్రహ్మేతి చేద్వేద సంతమేనం తతో విదుః" (తైత్తి-ఆనంద-6) (పరతత్త్వాన్నిగూర్చిన జ్ఞానం ఎవనికి లేదో అతడు లేనివానితో సమానం. ఆ జ్ఞానం ఉన్నట్లయితే అతనిని ఆ కారణంవల్లనే సత్పురుషులు సత్తను కలవానినిగా భావిస్తున్నారు) అనే రీతిలో పూర్వం అసత్కల్పుడై ఉన్నవాడను ఇపుడు సత్తను పొందినవాడనయ్యాను.

(వరుమ్ పుయల్ వణ్ణనార్) - ఉన్నచోటనే ఉంటూ నీటి వాంఛను తీర్చే మేఘంవంటివాడు కాడు ఇతడు. సముద్రాన్ని పూర్తిగా పానం చేసి, తడబడుతూ వచ్చే మేఘంవలె ఉండేవాడితడు.

(మరువి) - "ఎత్తనైయుమ్ వాన్మఱన్ద కాలత్తుమ్ పైఙ్కూழ்కళ్ మైత్తెழுన్ద మాముకిలే పార్త్తిరుక్కుమ్" (పెరియ. తిరు. 5-7) (ఎంతగా అనావృష్టి సంభవించిన కాలంలో అయినా పైరు వర్షంకోసం నల్లని కారుమేఘం కోసమే ఎదురుచూచేటట్లు) అనే రీతిలో పైరు మేఘంకోసం ఆశగా ఎదురుచూచి దరి చేరేటట్లుగా సమీపించి.

(పుయల్ వణ్ణనారై మరువి) - పైరు మేఘంకోసం ఎదురు చూచి దరి చేరేటట్లుగా, ఆత్మ అనే పైరు మేఘవర్ణుని తనను మఱచి సమీపించింది - అని భావం.

(ఎన్మనత్తు వన్దు) - అతనిని వేఱెక్కడికి పోలేనట్లు నా మనస్సులో నిలిచి, వీరి మనస్సులో ప్రవేశించిన తరువాత స్వామి బయటకు ఎక్కడికీ పోలేని వాడయ్యాడు. వీరి మనస్సును అన్వేషిస్తూ పరిభ్రమించినవాడుకదా అతడు. అది లభించిన తరువాత, దానిని విడచిపోవడం అతనికి సాధ్యమా !

(కరుమ్బిన్ ఇన్ శాఱు పోల ప్పరుకినేఱ్కు) - గడచిన పాశురంలో మింగే స్థితిలో (ఘనస్థితిలో) ఉండే భగవానుడు ఇపుడు పానం చేసే ((ద్రవస్థితిని) స్థితిని పొందాడు. (పరమ సులభుడయ్యాడు) మింగవలసిన స్థితిలో గట్టిగా ఉన్నవాడు, ఆళ్వార్లు కలువగా కలువగా, పానం చేసే రీతిలో ఒక జలద్రవ్యమయ్యాడు (సులభు డయ్యాడు)

(ఇనియవాఱే) - ఈ భోగ్యతకు సాటి ఉన్నదా? చాలా గొప్పవాడు చాలా తక్కువవాడై, నేను పానం చేసేటట్లుగా నాతో కలసిన సౌలభ్యాన్నిగూర్చి ఏమని పల్కడం?

దివ్యార్థదీపిక :- గడచిన పాశురంలోని "కేట్క యానుఱ్ఱతుణ్డు" అనే వాక్యాన్ని ఈ పాశురంలో కూడా అన్వయించవచ్చు. "తీర ఇరుమ్బుణ్డ నీరతుపోల ఎన్నారుయిరై యారప్పరుక ఎనక్కారావముదానాయే" (బాగా కాలిన ఇనుము చల్లారడంకోసం నీటిని పీల్చినట్లు, నా ఆత్మ పడే శ్రమం తీరేటట్లుగా పానం చేసేటట్లు నాకు తనివితీరని అమృతంవంటి వాడవయ్యావు) అనే తిరువాయ్మొழி పాశురాన్నే ప్రాయికంగా అనుసరిస్తూ అనుగ్రహింపబడింది ఈ పాశురం.

ఇనుము అగ్నిలో బాగా తప్తమై, ఆ వేడిమి ఉపశమించేటట్లు నీటిని పీల్చేటట్లే, నేనుకూడా నా తాపం తీరేటట్లుగా భగవద్విషయంలో భక్తి అనే చల్లని నీటిని తాగి, ప్రాప్తమైన ఆ విషయంలో కైంకర్యాన్ని చేయగల్గి ఉజ్జీవించాను - అవి పూర్వ పాదాలలోని భావం. అప్రాప్తవిషయాలలో ప్రేమ కల్గడం సహజమై, భగవద్విషయంలో ప్రేమ కల్గడం మెఱక భూమియై (అసహజమై) ఉండడాన్ని గూర్చి "అరుమ్ పెఱలన్బు" అని అనబడింది. నిప్పులో తామర పూచినా పూయవచ్చు; అహంకార మనే గొప్ప నిప్పులో భగవద్విషయకమైన ప్రేమ (భక్తి) అంకురించడం చాలా అరుదు. "అడిమై పూణ్డు" అని అన్నందువల్ల ఆత్మకు దాస్యమే ఆభరణమని స్పష్టపడుతున్నది.

(వరుమ్ పుయల్ వణ్ణనారై ఇత్యాది) - ఉన్న చోటనే ఉండి వర్షించి, తాపాన్ని తీర్చే మేఘంవలే కాకుండా, అక్కడక్కడకు పోయి వర్షించే ఆనందాన్ని కల్గించే మేఘంవలె, భక్తులున్న చోట్లకు పోయి ఆర్ద్రహస్తంతో తడవి (ప్రేమతో నిమిరి) తాపాన్ని తీర్చేవాడు, భగవానుడు. అటువంటి వానిని నా మనస్సులో పొందికగా నిలిపి చెఱకు పానకంవలె పానం చేశాను. తాగిన మాత్రంలోనే నోటితో చెప్పలేనంత మధురంగా ఉన్నదే ! దీనికేమి కారణం ? తెలియజేయాలి" అని అంటున్నారు.

6. మూవరిల్ ముతల్వనాయ ఒరువనై యులకమ్ కొణ్డ,
కోవినై క్కుడన్దై మేయ కురుమణిత్తిరళై, ఇన్ప
ప్పావినై ప్పచ్చైత్తేనై పైమ్పొన్నై అమరర్ శెన్ని,
ప్పూవినై పుకళ్ఱుమ్ తొణ్డరెన్ శొల్లి పుకళ్ఱ్వర్ తామే.

మూవరిల్ = (బ్రహ్మరుద్రేంద్రులనే) ముగ్గురికి, ముదల్వన్ ఆయ = కారణభూతుడై ఉండే, ఒరువనై = సాటి లేనివాడై, ఉలకమ్ కొణ్డ = (మహాబలివద్ద) లోకాన్ని (దానంగా) గ్రహించిన, కోవినై = లోకనాయకుడై, కుడన్దై = "తిరుక్కుడన్దై"లో, మేయ = పొందికగా ఉండే, కురు మణి త్తిరళై = గొప్ప నీలరత్నాల సమూహంవలె ఉన్నవాడై, ఇన్ప ప్పావినై = తీయని పాటవలె చెవులకు భోగ్యభూతుడై, పచ్చై త్తేనై= చాలా తీయని తేనెవలె జిహ్వాకు మధుర్మైనవాడై, పైమ్ పొన్నై = పచ్చని బంగారంవలె స్పృహణీయుడై, అమరర్ శెన్ని ప్పూవినై = నిత్యసూరుల శిరస్సుకు తగిన పూవువలె ఉన్నవాడైన భగవానుని, పుకళ్ఱుమ్ = పొగడే, తొణ్డర్తామ్ = భక్తులను, ఎన్ శొల్లి పుకళ్ఱ్వర్ = దేనిని పల్కి కీర్తించగలరు? (మాటలతో కీర్తించడానికి సాధ్యం కాదని భావం).

వ్యా :- అవతారిక్కు. (మూవరిత్యాది) ఇవ్వనై క్కాట్టుతల్, తన్నై క్కాట్టుతల్. "స సంజ్ఞాం యాతి భగవాన్ ఏక ఏవ జనార్దనః" ఎన్నుమ్పడియే మూవరుక్కుమ్ కారణమాకైయాలే "ముతల్వన్" ఎన్గిఱార్ (ముతల్వనాయ వొరువనై) "మూవురువుమ్ కణ్డపోతొన్ఱామ్ శోతి" ఎన్గిఱపడియే మూవరైయుమ్ తనిత్తనియే కణ్డాల్ ఇవనే కారణభూతన్, ఇవనే కారణభూతనెన్నలాయ్, మూవరైయుమ్ శేర క్కణ్డాల్ ఇరువర్ కార్యకోటినివిష్టరాయ్, ఇవనే ఇరువరుక్కుమ్ కారణమ్ ఎన్నుమ్పడి పరశ్శబ్దైతిశ్శబ్ద వాచ్యన్ ఇవనే యాయిరుక్కైయాలే "ఆమ్ శోతి-ఒన్ఱు" ఎన్గిఱార్.

(ఉలకమ్ కొణ్డ కోవినై) - మూవరుక్కుమ్ ప్రధాననానాల్ అవర్కళ్ కార్యమ్ శెయ్తు కొడుక్క వేణుమే! అవర్కళిలే ఒరువనుక్కు కార్యమ్ శెయ్తపడి-

(ఉలకమ్ కొణ్డ) ఇవ్వ్రసుడైయ రాజ్యత్తై మహాబలి పతిత్తుక్కొళ్ళ అవన్ పక్కలిలే తానే శెన్రు అపేక్షిత్తు, "మూవడి" ఎన్రు ఇవ్వ్రన్ కార్యమ్ శెయ్య ముతలడి యిట్టపడి. మున్నే ఒరువనుక్కు క్కైయోట్టై త్తీర్త్తువిట్టాన్. "ముడైయదర్త్త శిరమేన్ది మూవు లకుమ్ పలితిరివోన్, ఇడర్ కెడుత్త తిరువాళ"నితే. అవన్తమప్పనుక్కు త్తానే వేదప్రదానమ్ పణ్ణినాన్. ఇప్పడి శెయ్కైక్కు హేతు ఎన్? ఎన్నిల్; (కోవినై) నిర్వాహక నాయైయాలే.

(కుడన్తై మేయ) ఇన్నుమ్ సంసారికళ్ ఇడర్ పట్టారుణ్డాకిలుమ్ కైకళ్రియ ప్పోకవొణ్ణాతెన్రు తిరుక్కుడన్తైయిలే పడుక్కై పొరున్ది ప్పళ్ళికొణ్డవనై. (కురుమణి త్తిరళై) శ్రేష్ఠమాన నీలరత్నసమూహమ్బోలే పుకర్త్తు క్కుళిర్న్ద వడివళకై యుడైయవనై.

(ఇన్నప్పావినై) శెవిక్కు తమ్ముడైయ కవిపోలే తిత్తిత్తిరుక్కుమపడి. పావెన్నతు-ఇయల్; - పాట్టు. "ఇన్కవిపాడుమ్ పరమకవికళాన" ముతలాళ్వార్కళ్ కవిపోలే ఇనియవాయుళ్ళవనై - ఎన్నవుమామ్. (పచ్చైత్తేనై) శెవిక్కే యన్రిక్కే [1]నాక్కుక్కు మిరుక్కుమపడి. (పైమ్పొన్నై) ఉడమ్బుక్కు [2]అణైయలామ్బడి స్పృహణీయ మాయిరుక్కై.

(అమరర్శెన్ని ప్పూవినై) - "అయర్వఱుమ్ అమరర్కళుక్కు" శిరోభూషణ మానవనై. "అరుమ్బినై యలరై" "పాతపఙ్గు త్తలై శేర్త్తు" ఎన్నవేణ్డావే అవర్కళుక్కు!

(పుకళ్మ్ తొణ్డర్) ఇవ్విషయత్తై పుకళ్న్దార్కళాకక్కొణ్డోమ్. ఇతుక్కు ప్పాశురమ్ ఎజ్గే తేడి చ్చొన్నార్కళ్; కిణ్ణకత్తిలే పుక్కు ముళుకువారైప్పోలే కుమిళ్ నీరుణ్డు పోమిత్తనైపోక్కి? (ఎన్ శొల్లి పుకళ్వర్ తామే) "అరుమ్పారుళాతల్-అతివ్వనర్" ఎన్రు అతియవొణ్ణాతెన్రు పుకళుమతొళ్రియ ప్పాశురమిట్టు పుకళప్పో కాతు.

*అరు :- అఱామ్బాట్టు. (మూవరిత్యాది) రుద్రాదికళుక్కు చ్చెయ్తానో? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్ (మున్నే యొరువనుక్కిత్యాది) అవన్ పూవో? ఎన్న అరుళిచ్చెయ్ కిఱార్; (అరుమ్బినై యలరై) ఎన్రు.*

భావదీపిక-అవ : ఇతనిని ఎవరికీ పూర్తిగా పొగడడానికి సాధ్యం కాదని అంటున్నారు.

వ్యాఖ్యానం : పొగడడం సాధ్యం కాకపోవడానికి కారణమైన గొప్పతనాలను పాశురంలోని మొదటి మూడు పాదాలలో ప్రస్తావిస్తున్నారు.

---

1. నాక్కుక్కుమినిక్కుమపడి - పాఠాంతరం. 2. అణియలామ్బడి - పాఠాంతరం.

(మూవరిల్ ముదల్‌వనాయ) - బ్రహ్మ విష్ణురుద్రులనే ముమ్మూర్తులలో మిగిలిన ఇద్దరికి కారణభూతుడైన అయిన శ్రియఃపతి- అని, బ్రహ్మరుద్రేంద్రు లనే ముగ్గురు దేవతలకు కారణభూతుడైన శ్రియఃపతి- అని అర్థాన్ని గ్రహించవచ్చు. "సృష్టిస్థిత్యంతకరణీం బ్రహ్మవిష్ణుశివాత్మికామ్, స సంజ్ఞాం యాతి భగవానేక ఏవ జనార్దనః" (విష్ణు.పు.1-2-66) (జనార్దనుడొక్కడే బ్రహ్మ, విష్ణు, శివులనే పేర్లతో సృష్టి, స్థితి, సంహారాలను చేస్తున్నాడు) అనే రీతిలో బ్రహ్మరుద్రులకు కారణమైనవాడై, విష్ణుమూర్తికి మూలమూర్తి అయినందువల్ల మొదటి అర్థంలోను త్రిమూర్తులకు కారణభూతుడనే అర్థాన్ని గ్రహించవచ్చు.

(ముతల్‌వనాయ ఒరువనై) - "మూవురువుమ్ కణ్డ పోతు ఒన్ఱామ్ శోతి" (తిరునెడు-2) (ముమ్మూర్తులను చూచినపుడు అద్వితీయమైన తేజోరూపుడు) అనే రీతిలో ముగ్గురిని ప్రత్యేక ప్రత్యేకంగా దర్శిస్తే "ఇతడే జగత్కారణభూతుడా! ఏమి! ఇతడే జగత్కారణభూతుడా! ఏమి! 'అని సందేహ పడడానికి అవకాశం ఉన్నది. ముగ్గురిని కలిపి చూస్తే, శ్రుతులు, స్మృతులు మొదలైన ప్రమాణాల అనుసారం "బ్రహ్మరుద్రులిద్దరు శ్రియఃపతిచే సృష్టింపబడ్డవారే; ఇతడే మిగిలిన ఇద్దరికీ కారణభూతుడు" అని పలికేటట్లుగా "నారాయణః పరో జ్యోతిః" (తైత్తి-నారో) అనే ప్రసిద్ధిని పొందినవాడు కనుక, "అమ్‌శోతి ఒన్ఱు" (తిరునెడు-2) అని అంటున్నారు. "మిగిలినవి రెండు నశించే జ్యోతులు" అని తమ్పిరాన్ పడివ్యాఖ్య.

(ఉలకమ్ కొణ్డ కోవినై) - బ్రహ్మరుద్రేంద్రులకు కారణభూతుడు కనుక వారి కార్యాన్ని తన కార్యంగా తనపై ఆరోపించుకొని ఇతడు చేస్తాడు - అని స్ఫురిస్తున్నందువల్ల వారిలో ఒకడైన ఇంద్రునకు కార్యాన్ని చేయడాన్నిగూర్చి (ఇక్కడ) ప్రస్తావిస్తున్నారు.

(ఉలకజ్కొణ్డ) - ఇంద్రుని రాజ్యాన్ని మహాబలి కొల్లగొట్టగా, అతని వద్దకు తానే పోయి యాచించి, మూడడుగుల నేలను దానంగా పొంది, ఇంద్రుని కార్యాన్ని చేయడంకోసం ముందుకు వచ్చాడు. మిగిలిన ఇద్దరికి కూడా ఈవిధంగా కార్యాన్ని చేసిన సందర్భాలున్నాయా? అని అంటే, పూర్వమే శివుని చేతినుండి కపాలాన్ని విడిపించాడు. "ముడై యడర్త్త శిరమేన్ది మూవులకుమ్ పలి తిరివోన్ ఇడర్ కెడుత్త తిరువాళన్" (పెరియతిరు-6-9-1) (దుర్గంధాన్ని వెలువరించే బ్రహ్మకపాలాన్ని చేతిలో ధరించి, ముల్లోకాలలోను బిచ్చమెత్తి తిరిగే శివుని శాపాన్ని తీర్చిన శ్రియః పతి) అని వీరే (తిరుమంగైమన్నన్) అనుగ్రహించారు కదా! ఈ రుద్రుని తండ్రి అయిన బ్రహ్మకుకూడా, అతడు వేదాలను కోల్పోయి నపుడు తానే వానిని తిరిగి

సంపాదించి ఇచ్చాడు. ఈ రీతిలో వారి కార్యాలను చేయడంలో కారణమేమి? అవి అంటే -

(కోవినై) - లోకాన్ని అంతటినీ నిర్వహించేవాడు కనుక ఈ విధంగా చేశాడు.

(కుడన్దై మేయు) - రాబోయే కాలంలోకూడా సంసారులు దుఃఖాన్ని పొందితే దానిని పోగొట్టేవారు లేక తికమక పడకూడదు- అని తిరుక్కుడన్దైలో ఆదిశేషుడనే పర్యంకంపై పొందికగా పరుండి ఉండేవాడు.

(కురు మణిత్తిరళై) - చాలా గొప్పవైన నీలరత్నాల సమూహంవలె కాంతిని విరజిమ్మే చల్లని రూపసౌందర్యాన్ని కలవాడు- అని భావం. "కురుమణి" -గొప్ప నీలరత్నం.

(ఇన్బప్పావినై) - తమ కవిత్వంవలె చెవికి చాలా మధురమై ఉండేవానిని. "ఇన్బప్పా" అని అంటూ తమ పాశురాన్ని నిర్దేశిస్తున్నారు. దానివలె ఉండేవానిని - అని అర్థం. "ఇన్కవిపాడుమ్ పరమకవికళ్" (తిరువాయ్- 7-9-6) (తీయని పాశురాలను పాడే గొప్ప కవులు) అని చెప్పబడ్డ ముదలాళ్వార్లయొక్క కవిత్వంవలె భోగ్యభూతుడై ఉండేవాడనికూడా భావం.

(పచ్చైత్తేనై) - చెవికి మధురంగా ఉండడం మాత్రమేకాక జిహ్వాకు కూడా మధురంగా ఉండేవాడు.

(అమరర్శెన్ని ప్పూవినై)-"అయర్వఱుమ్ అమరర్కళ్" (తిరువాయ్-1-1-1) (విస్మృతి మొదలైన దోషాలు లేని నిత్యసూరులు) అని చెప్పబడే దివ్యసూరుల శిరస్సులకు అలంకరించుకొనే అలంకారమైన పూవువలె ఉండేవాడు. "అరుమ్బినై అలరై" (పెరియతిరు-7-10-1) అని వీరే భగవానుని అపుడే వికసించిన పూవుగా రూపించి పలికారుకదా ! ఈలోకంలో ఉన్నందువల్ల నమ్మాళ్వార్లు "నిన్ శెమ్మా పాదపఱ్ప్పు త్తలై శేర్త్తు" (తిరువాయ్- 2-9-1) (నీ అందమైన, గొప్ప పాదపద్మాన్ని తలపై ధరించి) అని ఇతని శ్రీచరణపద్మాను తమ శిరస్సుకు అలంకారంగా ధరించాలని ప్రార్థించవలసి వచ్చింది. అచట ఉండే దివ్యసూరులకు ఆవిధంగా ప్రార్థించ నక్కరలేకుండా ఎల్లప్పుడు వారి తలకు అలంకారంగా ఉన్నాడుకదా!

(పుకఴుమ్ తొణ్డర్ ఎన్ శొల్లిప్పుకఴ్ వర్తామే) - ఈ భగవద్విషయాన్ని పలువురు కీర్తించినట్లుగా చూస్తున్నాము. వారు అందఱు ప్రవాహంలో పడి మునిగి ఊపిరాడక దిగ్భ్రమ చెందేవారివలె ఏవో కొన్నిటినిగూర్చి పలికారే తప్ప. ఈ విషయాన్నిగూర్చి ఏమి మాటలను ఎక్కడ అన్వేషించి ప్రయోగించి పొగడారు?

(ఎన్శొల్లి పుకళ్వర్తామే)- "అటిన్దవ వేద అరుమ్ పొరుళ్ నూల్కళ్ అటిన్దవ కొళ్క అరుమ్పొరుళాతల్, అటిన్దవరెల్లామ్ అరియై వణఙ్గి అటిన్దవర్ నోయ్కళ్ అఱుక్కుమ్ మరున్దే" (తిరువాయ్ 9-3-3) (సకలార్థ సాధకాలైన వేదాలద్వారా, వాటి ఉపబృంహణాలద్వారా కూడా పూర్తిగా తెలుసుకోలేని సర్వేశ్వరుని అతని నిర్హేతుక కృపతో తెలుసుకొన్నాను. అతడు సంసారమనే వ్యాధిని తీర్చే ఔషధంగా గ్రహించాను.) అనే రీతిలో "ఇతనిని పరిచ్ఛేదించి తెలియలేము" - అని కీర్తించాలి తప్ప పదప్రయోగాన్ని చేసి పూర్తిగా కీర్తించడం సాధ్యమా?

దివ్యార్థదీపిక :- భగవద్విషయాన్ని అనుభవించడం ఆరంభించేవారు నోటితో ఏవో కొన్ని మాటలను పల్కి కీర్తిస్తున్నారే! ఏ మాటలను పల్కి కీర్తించడం! గొప్ప సముద్రంలో ప్రవేశించి మునిగేవారు మునకలు పెట్టి నీరు తాగి ఉక్కిరి బిక్కిరి అయే రీతిలో, భగవద్విషయసాగరంలో మునిగి పోవడమే తప్ప, ఏదైనా ఒక పాశురాన్ని పలుకగలమా ! అని అంటున్నారు.

(మూవరిల్ ముదల్వనాయ ఒరువనై)- సృష్టిస్థితిసంహారాలకు నిర్వాహకులు అని, త్రిమూర్తులు అని చెప్పబడే హరి, హర, అజులనబడే వీరిలో ఆదిదైవమై ఉండేవాడు- అని భావం. లేక, "స బ్రహ్మ స శివస్సేంద్రః" అని శ్రుత్యనుసారం ఇంద్రుని కలుపుకొని, ముగ్గురుగా గ్రహించి, ఆ ముగ్గురి కంటే ఆదిదైవమై ఉండేవాడనే అర్థాన్ని కూడా (కొందరు) పల్కుతారు. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అనే శ్రుతిచ్ఛాయలో "ఒరువనై" అని అనబడింది.

(ఉలకమ్ కొణ్డ కోవినై)- త్రిమూర్తులకు ఆదిదైవమై ఉంటే, వారికి కావలసిన కార్యాలను నిర్వహించి పూర్తి చేయాలికదా! వారిలో ఒకడైన ఇంద్రునకు కార్యాన్ని పూర్తిచేసిన సంగతి తెలుపబడుతున్నది. (ఈ ప్రయోగం ద్వారా) మహాబలి అపహరించిన భూమిని తిరిగి ఇచ్చిన విషయం తెలుపబడింది.

(కుడన్దై మేయ కురుమణిత్తిరళై) - ఇంకా, (ఎవరైనా) సంసారులు క్లేశపడినవారు ఉన్నప్పటికీ, వారు బాధపడకూడదు - అని వారికి గతియై, తిరుక్కుడన్దై దివ్యక్షేత్రంలో సుఖంగా శయనించి ఉండే సన్నివేశాన్ని దర్శిస్తే, గొప్ప నీలమణులను పేర్చి కూర్చినట్లుగా జాజ్జ్వల్యమానుడై వెలుగుతున్నాడు. "గురు" అనే సంస్కృతపదం "కురు" అని మారింది. గొప్పదైన - అని అర్థం.

(ఇన్పప్పావినై) - "అన్దమిళ్ ఇన్పప్పావినై" (అందమైన ద్రావిడభాషలోని భోగ్యాలైన పాశురాలవలె తీయనివాడు.) అని కులశేఖర ప్పెరుమాళ్ కూడా అన్నారు.

ఆళ్వార్ల శ్రీసూక్తులవలె చెవులకు మధురంగా ఉండేవాడు- భగవానుడు- అని తాత్పర్యం.

(పచ్చైత్తేనై) - చెవులకు మాత్రమే కాకుండా జిహ్వకు కూడా మధురంగా ఉండేవాడు. పాతబడిన తేనె వలెకాకుండా, అపుడే ఉత్పత్తి అయిన తేనెవలె పరమభోగ్యుడు.

(పైమ్పొన్నై) - శరీరానికి హత్తుకొనేటట్లుగా ఆశపడదగినవాడని భావం.

(అమరర్శెన్ని ప్పూవినై) - నిత్యసూరులు తలపై అలంకరించుకొని కీర్తించే తత్త్వం. "ఎమ్మావీట్టు త్తిఱముమ్ శెప్పమ్, విన్ శెమ్మా పాదపఱ్పు త్తలై శేర్త్తు.... అమ్మా! అడియేన్ వేణ్డువదీదే" (గొప్పదైన ఆ పరమపదాన్నిగూర్చి మేము పలుకము. నీ అందమైన గొప్ప పాదపద్మాన్ని తలపై చేర్చి కృపజేయాలి. స్వామీ! దాసుడనైన నేను కోరేది ఇదే) అని మనం అందఱం ప్రార్థించి పొందదగిన ఫలం కొందరికి మాత్రమే లభిస్తున్నదే! అని తలను పంకిస్తున్నారు. ఈవిధంగా ఇటువంటి భగవానుని కీర్తించే భక్తులు ఏమని పల్కి పొగడుతారు? అని అంటున్నారు. దీనిద్వారా - తాము పాశురాన్ని పల్కడంకూడా భగవానుని గొప్పతనం అవధిని చూచి కాదు; కాలక్షేపం చేయగోరి అంతే తప్ప-అని తాత్పర్యం.

7. ఇమ్మైయై మఱుమైతన్నై ఎమక్కు వీడాకినిన్ఱ,
మెయ్మ్మైయై విరిన్ద శోలై వియన్ తిరువరఙ్గ మేయ,
శెమ్మైయై క్కరుమైతన్నై త్తిరుమలై యొరుమైయానై,
తన్మైయై నినైవార్ ఎన్తన్ తలైమిశై మన్నువారే.

ఇమ్మైయై = ఈ లోకంలో అనుకూలజ్ఞానాన్ని ఇచ్చేవాడై, మఱుమైతన్నై = మోక్షంలో కైంకర్యాన్ని ఇచ్చేవాడై, ఎమక్కు = మాకు, వీడు ఆకి నిన్ఱ మెయ్మ్మైయై = మోక్షసుఖానికి సాక్షాదుపాయభూతుడై, విరిత్త = వ్యాపించి ఉండే, శోలై = ఉద్యాన వనాలచే పరివేష్టితమై, వియన్ = ఆశ్చర్యాన్ని కల్గించే, తిరువరఙ్గమ్ మేయ = శ్రీరంగంలో నిత్యవాసం చేసేవాడై, శెమ్మైయై కరుమైతన్నై = (కృత-త్రేతా-ద్వాపర కలియుగాలలో ఉన్నవారికి తగినట్లు) ఎఱుపు, మొదలైన, వర్ణాలను కల్గిన రూపాలను కలవాడై, తిరుమలై = శ్రీవేంకటాచలంలో, ఒరుమైయానై = అందఱికీ ఒకే విధంగా దర్శనాన్ని ఇచ్చేవాడై, తన్మైయై = భక్తులకు వశుడై ఉండే భగవానుని, నినైవార్ = ధ్యానించగలవారు, ఎన్ తన్ తలమిశై = నా శిరస్సుపై, మన్నువారే = నిత్యవాసం చేసేవారు.

అవ : ఏழாమ్పాట్టు. (ఇమ్మైయై యిత్యాది) సర్వేశ్వరనుడైయ ఆశ్రిత పారతన్త్ర్యత్తై అనుసన్ధిక్కవల్లార్క్కు సఞ్చారభూమి ఎన్ ఉత్తమాఙ్గమ్ - ఎన్గిఱార్.

వ్యా :- (ఇమ్మైయై) ఇహలోకత్తిల్ స్వవిషయజ్ఞానసుఖత్తై త్తరుమవనై. (మఱుమైతన్నై) శరీరసమనన్తరమ్. స్వరూపానురూపమాన కైఙ్కర్యత్తై త్తరుమవనై. సంసారత్తిల్ దుఃఖనివృత్తియే సుఖమెన్ఱు భ్రమమేయితే.

(ఎమక్కు వీడాకినిన్ఱ మెయ్మ్మైయై) - నమక్కు మోక్షసుఖమాయుళ్ళవనై. కీழ్ శొన్న ప్రాప్యత్తుక్కు. అవ్యవహితమాన ఉపాయమానవనై. (విరిన్ద శోలై ఇత్యాది) అవ్వుపాయమ్ సులభమాన విడత్తై ప్పేశుకిఱార్. పరన్ద శోలైయై యుడైత్తాయ్, విస్మయనీయమా యిరున్దుళ్ళ కోయిలిలే నిత్యవాసమ్ పణ్ణుమవనై. (శెమ్మైయై క్కరుమైతన్నై) యుగన్దోఱుమ్ అవ్వవయుగఙ్గళిలుళ్ళార్క్కు త్తక్క వడివుకళై క్కొణ్డు అవర్కళై రక్షిక్కుమవనై. "మున్నై వణ్ణమ్" ఇత్యాదిప్పడియే శెమ్మైయుమ్ కరుమై యుమ్- మற్ఱై ఇరణ్డుక్కుముపలక్షణమ్.

(తిరుమలై ఒరుమైయానై)-"కణ్ణావానెన్ఱుమ్ మణ్ణోర్ విణ్ణోర్క్కు" ఎన్గిఱపడియే తిరుమలైయిలే నిన్ఱు నిత్యసూరికళుక్కుమ్, నిత్యసంసారికళుక్కుమ్ ఒక్క ముకమ్ కొడుక్కుమవనై. (తన్మైయై నినైవార్) ఇన్ద ఆశ్రితపారతన్త్ర్యత్తై నినైక్కవల్లార్. (ఎన్తన్ తలైమిశై మన్నువారే) అవన్ తిరువడికళుమ్ ఇవర్కళ్ తిరువడికళుమ్ ఒక్క వన్దు మన్నువతు; ఇవర్కళ్ తిరువడికళే ఎన్తలైయిల్ మన్నువతు. "తఞ్శేత్తై ఎమ్బెరు మాన్తాళ్ తొழువార్ కాణ్మిన్ ఎన్తలై మేలార్" ఎన్గిఱార్.

అరు :- ఏழாమ్పాట్టు. *(ఇమ్మైయై) ఇమ్మైక్కు సంసారదుఃఖ నివృత్తియ మైయాలో? అవన్విషయజ్ఞానమాక వేణుమో? ఎన్న, అరుళిచ్చెయ్కిఱార్ (సంసారత్తి లిత్యాది).* వీడాకినిన్ఱ- వీట్టుక్కు నిర్వాహకనెన్ఱైయాలే అత్తై త్తరుకైక్కుమ్ అవనే ఉపాయ మెన్నపడి. ఒరుమైయాన్- ఒరుపడిప్పట్టవనెన్ఱాయ్, అఙ్గుళ్ళారోడు ఇఙ్గుళ్ళా రోడు వాశియఱ ముకమ్ కొడుక్కైయిలే ఏకరూపనా [1]యిరుక్కై ఱవనెన్నపడి.

భావదీపిక-అవ : సర్వేశ్వరుడు తన భక్తులకు వశుడై ఉండే స్వభావాన్ని భావించగల్గిన వారికి సంచరించే చోటు నా శిరస్సు- అని అంటున్నారు.

వ్యాఖ్యానం : (ఇమ్మైయై)- ఈలోకంలో తన విషయంగా అనుకూల జ్ఞానమనే సుఖాన్ని ఇచ్చేవానిని - అని భావం.

(మఱుమైతన్నై) ఈ శరీరం పతనం చెందగానే పరమపదంలో తమయొక్క స్వరూపానికి తగినదైన కైంకర్యసుఖానికి అనుగ్రహించేవానిని. "మఱుమైయై" అని

1. యిరుక్కైఱపడి - పాఠాంతరం.

అనకుండా "మఱుమైతన్నై" అని అన్నందువల్ల సంసారంలో ఉండే దుఃఖాలు తొలగడమే సుఖం- అనే భ్రమించే కైవల్యమోక్షసుఖాన్ని వ్యావర్తింపజేస్తున్నారు.

(ఎమక్కు పీడాకి నిన్ఱ మెయ్మ్మైయై) - వాకు మోక్షసుఖమనే ప్రాప్యమై, ఆ ప్రాప్యానికి సాక్షాదుపాయమై ఉండేవానిని. "పీడాకి నిన్ఱ" అని అన్నందువల్ల ప్రాప్యం కూడా ఇతడే -అని, "మెయ్మ్మైయై" అని అన్నందువల్ల ఆ ప్రాప్యానికి ఉపాయం కూడా ఇతడే- అని తెలుపుతున్నారు.

(విరిన్ద శోలై వియన్ తిరువరఙ్గమ్ మేయ) - ఆ ఉపాయం చాలా సులభంగా అందటికి లభించే చోటునుగూర్చి పల్కుతున్నారు. విస్తరించిన ఉద్యానాలను కల్గినది, అందటికి విస్మయాన్ని కల్గించేది అయిన శ్రీరంగంలో అందఱు ఉజ్జీవించడంకోసం నిత్యవాసం చేసేవానిని.

(శెమ్మైయై కరుమైతన్నై) - కృత-త్రేతా- ద్వాపర- కలియుగాలనే నాల్గింటిలో ఉండే వారు వారి వారి గుణాలకు తగిన రీతిలో ఇష్టపడే తెలుపు, ఎఱుపు, పసుపుపచ్చ, నలుపు - అనే నాల్గు రంగులను కల రూపాన్ని కల్గినవానిని. ఇక్కడ ఎఱుపును, నలుపును మాత్రం చెప్పడం మిగిలిన రెండిటికి ఉపలక్షణం. "మున్నై వణ్ణమ్ పాలిన్ వణ్ణమ్ ఎణ్ణుఙ్గాల్ పొన్నిన్ వణ్ణమ్ మణియిన్ వణ్ణమ్ పురైయుమ్ తిరుమేని ఇన్నవణ్ణ మెన్ఱు కాట్టీర్ ఇన్దళూరీరే!" (పెరియ తిరు-4-9-8) (ఇందళూర్ అనే దివ్యదేశంలో వేంచేసియుండే ఓ స్వామీ! నీ తిరుమేని వర్ణాన్ని గమనిస్తే, మొదటిది అయిన కృతయుగంలో గ్రహించిన వర్ణం పాల రంగువంటి తెల్లని వర్ణం.... నీలమణి వర్ణాన్ని పోలిన నీ తిరుమేని వర్ణం పూర్వం తెలిపిన వర్ణాలలో ఏ వర్ణమో నీవే తెలియజేయాలి.) అని వీరే అనుగ్రహించారు కదా! "నిగళ్ఱ్న్దాయ్ పాల్ పొన్ పశుప్పుమ్ కార్వణ్ణమ్ నాన్గుమ్" (24) (పాలరంగువంటి రంగు, బంగారపు రంగువంటి రంగు, పచ్చని వర్ణం, నీలవర్ణం - అనే ఈ నాల్గింటిని పొందావు.) అని నాన్ముకన్ తిరువన్దాదిలో, "పాలిన్ నీర్మై శెమ్బొన్ నీర్మై పాశియిన్ పశుమ్ పుఱమ్ పోలుమ్ నీర్మై పొఱ్పుడైత్తడత్త వణ్డు విణ్డులామ్, నీలనీర్మై ఎన్ఱివై నిఱైన్ద కాలమ్ నాన్గుమాయ్" (తిరుచ్చన్ద-44) (పాల రంగువంటి తెలుపురంగు, ఎఱ్ఱని బంగారు రంగువంటి ఎరుపు రంగు, పాచియొక్క రంగువంటి పచ్చని రంగు, అందమైన తటాకంలోని, తుమ్మెదలు రెక్కలను విప్పి ఎగిరే నీలకలువ పూల రంగువంటి నీలవర్ణం - ఈ నాల్గువర్ణాలను పొందిన నాల్గుయుగాలకు నిర్వాహకుడవై) అని తిరుచ్చన్ద విరుత్తంలో తిరుమళి శైయాళ్వార్లు ఈ విషయాన్ని గూర్చి పలికారు కదా!

(తిరుమలై ఒరుమైయానై) - "కణ్ణావాన్ ఎన్నుమ్ మణ్ణోర్విణ్ణోర్క్కు" (తిరువాయ్-1-8-3) (భూలోకవాసులకు, నిత్యసూరులకు నిర్వాహకుడు) అనే రీతిలో తిరుమలలో నిలచి ఉండి, నిత్యసూరులకు, ఈ లోకంలో జీవించే సంసారులకు సమానంగా దర్శనమిచ్చేవానిని.

(తన్నైయే నినైవార్) - ఈరీతిలో భక్తులకు తనను వశం చేసికొన్న సౌలభ్యాన్ని భావించగల్గినవారు.

(ఎన్తతన్ తలైమిత్తై మన్నువారే) - భగవానుని శ్రీచరణాలు, వీరి శ్రీచరణాలు ఒకటిగా చేరి నా శిరస్సుపై ఉండడం కాదు. వీరి శ్రీచరణాలే నా శిరస్సుపై నిత్యం నిలచి ఉంటాయి - "తణ్శేత్తై ఎమ్బెరుమాన్ తాళ్ తొళువార్ కాణ్మిన్ ఎన్ తలైమే లారే" (పెరియ తిరు-7-4-1) (చల్లని, తిరుచ్చేఱై అనే దివ్యదేశంలోని భగవానుని శ్రీచరణాలను సేవించేవారే సుమా! నా తలపై యుండేవారు) అని వీరే అను గ్రహించారు కదా!

దివ్యార్థదీపిక :- గడచిన పాశురంలో "అమరర్శెన్ని ప్పూవినై" అని పల్కిన ఆళ్వార్లను చూచి భగవానుడు "ఆళ్వార్లూ! ఎందుకు మీరు కొఱత పడుతున్నారు? మీ శిరస్సుకు నేను అలంకారంగా వేంచేసి ఉంటాను. మీ శిరస్సును చూపించండి" అని అనగా, "నా శిరస్సుకు నీవు అలంకారంగా ఉండనక్కరలేదు. నీ శీలగుణాన్ని ధ్యానించే భక్తులే నా శిరస్సుపై నిత్యవాసం చేయడానికి తగినవారు- అని అంటున్నారు.

(ఇమ్మైయై మరుమైతన్నై) - ఇహలోకసుఖం, పరలోకసుఖం - అనే రెండు విధాలైన సుఖాలను అనుగ్రహించేవాడని భావం. భగవానుని స్వరూపరూపగుణ విభూతులనుగూర్చిన జ్ఞానవికాసాన్ని పొంది ఆనందించడమే ఆళ్వార్ల అభి ప్రాయంలో ఇహలోకసుఖం. ఆదిశేషుని వలె సర్వదేశ-సర్వకాల- సర్వావస్థలలో అంతరంగ కైంకర్యాలను చేయుగల్గి ఆనందించడమే పరలోకావందం. ఈ విధంగా, ఇహలోకంలో తనకు చెందిన జ్ఞానవికాసాన్ని కల్గించి ఆనందాన్ని పొందించి, పరలోకంలో నిత్యకైంకర్యంలో అన్వయింపజేసి ఆనందాన్ని పొందించి భక్తులను ఉజ్జీవింపజేసేవాడు భగవానుడు - అని భావం.

(ఎమక్కు వీడాకి నిన్ఱ మెయ్మ్మైయై) - ఇక్కడ "వీడు" అనే పదం లక్షణా వృత్తిద్వారా మోక్షోపాయాన్ని తెలుపుతుంది. పూర్వం పల్కిన ప్రాప్యాలకు ప్రాపకుడై ఉండేవాడని భావం. ఆదిపాయం సులభమైన చోటునుగూర్చి "వియన్ తిరు వరజ్గమ్ మేయ" అని అంటూ పల్కుతున్నారు.

(శెమ్మైమై క్కరుమైలైన్నై) - భగవానుడు ఒక్కొక్క యుగంలోను ఒక్కొక్క వర్ణాన్ని కల్గిఉంటాడు. కృతయుగంలో ఉండేవారు సత్త్వగుణపూర్ణులై, శుద్ధమైన వర్ణాన్ని అభిలషిస్తారు కనుక, వారికోసం పాలవంటి వర్ణాన్ని పొందుతాడు. త్రేతాయుగంలో ఎఱ్ఱని వర్ణాన్ని పొందుతాడు. ద్వాపరయుగంలో పచ్చని వర్ణాన్ని పొందుతాడు. కలియుగంలో ఏ వర్ణాన్ని గ్రహించినా అభినివేశాన్ని పొందేవారు లేరు కనుక, సహజమైన నీలవర్ణంలో ఉంటాడు. (ఈ విషయం "పాలిన్ నీర్మై శెమ్బొ నీర్మై" అనే తిరుచ్చన్దవిరుత్త పాశురంలోను, "నికళ్న్దాయ్ పాల్పొన్ పశుప్పు క్కార్వణ్ణమ్ నాన్గుమ్" అనే నాన్ముకన్ తిరువన్దాది పాశురంలోను తిరుమళిశైప్పిరాన్ చేత అనుగ్రహింపబడింది) ఇక్కడ "శెమ్మైమై క్కరుమైలైన్నై" అని రెండు యుగాల వర్ణాలనుగూర్చి పల్కడం మిగిలినవాటికి ఉపలక్షణం.

(తిరుమలై యొరుమైయానై) - "వానోర్క్కుమ్ మణ్ణోర్క్కుమ్ వైప్పు" అని, "కణ్ణావా నెన్ఱుమ్ మణ్ణోర్ విణ్ణోర్క్కు త్తణ్ణార్ వేఙ్గడవిణ్ణోర్ వెఱ్పనే" (నిత్యసూరులకు, భూలోక వాసులకు నిర్వాహకుడు చల్లని వేంకటాద్రిలో వేంచేసి ఉన్నాడు.) అని పల్కిన రీతిలో తిరుమలలో నిలచి నిత్యసూరులకు నిత్యసంసారులకు ఒకే రీతిలో దర్శనాన్ని అనుగ్రహించేవాడు - అని భావం.

(ఒరుమైయానై) - ఏకరూపాన్ని కలవాడు, సమానంగా ఉండేవాడు. (సమవర్తి) తిరుమలై- అనేది నిత్యవిభూతికి, లీలావిభూతికి మధ్యలో ఉన్నని అభిప్రాయం. ఇక్కడ ఉన్నవారు పోయి పరత్వగుణాన్ని అనుభవిస్తారు. అక్కడ (నిత్యవిభూతిలో ఉన్నవారు వచ్చి శీలగుణాన్ని అనుభవిస్తారు. ఈవిధంగా ఇరువురికి సులభుడై ఉండేవాడని భావం.

(తన్మైయై నినైవార్) - పూర్వం ద్వితీయావిభక్తి, ఇక్కడకూడా ద్వితీయావిభక్తి అయితే ఏవిధంగా అన్వయించాలి. అంటే, "తిరుమలైలో నిలచి ఉండి సమానంగా వర్తించేవాని స్వభావాన్ని" అని అర్థం. భగవానుని స్వభావం ఏమంటే - భక్తులకు విధేయుడై ఉండే స్వభావం. దానిని అనుసంధించి అభినివేశాన్ని పొందేవారు నా శిరస్సుపై ఉండదగినవారు - అని అంటున్నారు.

8. వానిలై పుయలై మాలై వరైయినై ప్పిరశమీన్ఱ,
తేనిలై క్కరుమ్బిన్ శాఱ్ఱై త్తిరువినై మరువి వాళాన్,
మానిడప్పిఱవి యన్దో! మతిక్కిలర్ కొళ్క తన్దమ్,
ఊనిలైక్కురమ్బై వాళ్కైక్కుఱుతియే వేణ్డినారే.

అనకుండా "మఱుమైతన్నై" అని అన్నందువల్ల సంసారంలో ఉండే దుఃఖాలు తొలగడమే సుఖం- అనే భ్రమించే కైవల్యమోక్షసుఖాన్ని వ్యావర్తింపజేస్తున్నారు.

(ఎమక్కు పీడాకి నిన్ఱ మెయ్మ్మైమ్మైయై) - నాకు మోక్షసుఖమనే ప్రాప్యమై, ఆ ప్రాప్యానికి సాక్షాదుపాయమై ఉండేవానిని. "పీడాకి నిన్ఱ" అని అన్నందువల్ల ప్రాప్యం కూడా ఇతడే -అని, "మెయ్మ్మైమ్మైయై" అని అన్నందువల్ల ఆ ప్రాప్యానికి ఉపాయం కూడా ఇతడే- అని తెలుపుతున్నారు.

(విరిన్ద శోలై వియన్ తిరువరఙ్గమ్ మేయ) - ఆ ఉపాయం చాలా సులభంగా అందఱికి లభించే చోటునుగూర్చి పల్కుతున్నారు. విస్తరించిన ఉద్యానాలను కల్గినది, అందఱికి విస్మయాన్ని కల్గించేది అయిన శ్రీరంగంలో అందఱు ఉజ్జీవించడంకోసం నిత్యవాసం చేసేవానిని.

(శెమ్మైమ్మైయై కరుమైతన్నై) - కృత-త్రేతా- ద్వాపర- కలియుగాలనే నాల్గింటిలో ఉండే వారు వారి వారి గుణాలకు తగిన రీతిలో ఇష్టపడే తెలుపు, ఎఱుపు, పసుపుపచ్చ, నలుపు - అనే నాల్గు రంగులను కల రూపాన్ని కల్గినవానిని. ఇక్కడ ఎఱుపును, నలుపును మాత్రం చెప్పడం మిగిలిన రెండిటికి ఉపలక్షణం. "మున్నై వణ్ణమ్ పాలిన్ వణ్ణమ్ ఎణ్ణుఙ్గాల్ పొన్నిన్ వణ్ణమ్ మణియిన్ వణ్ణమ్ పురైయుమ్ తిరుమేని ఇన్నవణ్ణ మెన్ఱు కాట్టీర్ ఇన్దళూరీరే!" (పెరియ తిరు-4-9-8) (ఇందళూర్ అనే దివ్యదేశంలో వేంచేసియుండే ఓ స్వామీ! నీ తిరుమేని వర్ణాన్ని గమనిస్తే మొదటిది అయిన కృతయుగంలో గ్రహించిన వర్ణం పాల రంగువంటి తెల్లని వర్ణం.... నీలమణి వర్ణాన్ని పోలిన నీ తిరుమేని వర్ణం పూర్వం తెలిపిన వర్ణాలలో ఏ వర్ణమో నీవే తెలియజేయాలి.) అని వీరే అనుగ్రహించారు కదా! "నికఴ్న్దాయ్ పాల్ పొన్ పశుప్పుమ్ కార్వణ్ణమ్ నాన్గుమ్" (24) (పాలరంగువంటి రంగు, బంగారపు రంగువంటి రంగు, పచ్చని వర్ణం, నీలవర్ణం - అనే ఈ నాల్గింటిని పొందావు.) అని నాన్ముకన్ తిరువన్దాదిలో, "పాలిన్ నీర్మై శెమ్బొన్ నీర్మై పాశియిన్ పశుమ్ పుఱమ్ పోలుమ్ నీర్మై పొఱ్పుడైత్తడత్త వణ్డు విణ్డులామ్, నీలనీర్మై ఎన్ఱివై నిఱైన్డ కాలమ్ నాన్గుమాయ్" (తిరుచ్చన్ద-44) (పాల రంగువంటి తెలుపురంగు, ఎఱ్ఱని బంగారు రంగువంటి ఎరుపు రంగు, పాచియొక్క రంగువంటి పచ్చని రంగు, అందమైన తటాకంలోని, తుమ్మెదలు రెక్కలను విప్పి ఎగిరే నీలకలువ పూల రంగువంటి నీలవర్ణం - ఈ నాల్గువర్ణాలను పొందిన నాల్గుయుగాలకు నిర్వాహకుడవై) అని తిరుచ్చన్ద విరుత్తంలో తిరుమழிశైయాழ்్వార్లు ఈ విషయాన్ని గూర్చి పలికారు కదా!

(శెన్నిమైయై క్కరుమైయన్ని) - భగవానుడు ఒక్కొక్క యుగంలోను ఒక్కొక్క వర్ణాన్ని కల్గిఉంటాడు. కృతయుగంలో ఉండేవారు సత్త్వగుణపూర్ణులై, శుద్ధమైన వర్ణాన్ని అభిలషిస్తారు కనుక, వారికోసం పాలవంటి వర్ణాన్ని పొందుతాడు. త్రేతాయుగంలో ఎఱ్ఱని వర్ణాన్ని పొందుతాడు. ద్వాపరయుగంలో పచ్చని వర్ణాన్ని పొందుతాడు. కలియుగంలో ఏ వర్ణాన్ని గ్రహించినా అభినివేశాన్ని పొందేవారు లేరు కనుక, సహజమైన నీలవర్ణంతో ఉంటాడు. (ఈ విషయం "పాలిన్ నీర్మై శెమ్బొన్ నీర్మై" అనే తిరుచ్ఛందవిరుత్త పాశురంలోను, "నిక్ఱ్ద్వాయ్ పాల్పొన్ పశుప్పు క్కార్వణ్ణమ్ నాన్గుమ్" అనే నమ్మాళ్వార్ తిరువన్దాది పాశురంలోను తిరుమళిశైప్పిరాన్ చేత అనుగ్రహింపబడింది) ఇక్కడ "శెన్నిమైయై క్కరుమైయన్ని" అని రెండు యుగాల వర్ణాలనుగూర్చి పల్కడం మిగిలినవాటికి ఉపలక్షణం.

(తిరుమలై యొరుమైయానై) - "తానోక్కి నిత్యన్దాన్ తణ్ణరువి వేఙ్గడమే వానోర్క్కుమ్ మణ్ణోర్క్కుమ్ వైప్పు" అని, "కణ్ణావా నెన్ఱుమ్ మణ్ణోర్ విణ్ణోర్క్కు త్తణ్ణార్ వేఙ్గడవిణ్ణోర్ వెఱ్పనే" (నిత్యసూరులకు, భూలోక వాసులకు నిర్వాహకుడు చల్లని వేంకటాద్రిలో వేంచేసి ఉన్నాడు.) అని పల్కిన రీతిలో తిరుమలలో నిలచి నిత్యసూరులకు నిత్యసంసారులకు ఒకే రీతిలో దర్శనాన్ని అనుగ్రహించేవాడు - అని భావం.

(ఒరుమైయానై) - ఏకరూపాన్ని కలవాడు, సమానంగా ఉ.ండేవాడు. (సమ వర్తి) తిరుమలై- అనేది నిత్యవిభూతికి, లీలావిభూతికి మధ్యలో ఉన్నని అభిప్రాయం. ఇక్కడ ఉన్నవారు పోయి పరత్వగుణాన్ని అనుభవిస్తారు. అక్కడ (నిత్యవిభూతిలో ఉన్నవారు వచ్చి శీలగుణాన్ని అనుభవిస్తారు. ఈవిధంగా ఇరువురికి సులభుడై ఉండేవాడని భావం.

(తన్మైయై నినైవార్) - పూర్వం ద్వితీయావిభక్తి, ఇక్కడకూడా ద్వితీయావిభక్తి అయితే ఏవిధంగా అన్వయించాలి. అంటే, "తిరుమలైలో నిలచి ఉండి సమానంగా వర్తించేవాని స్వభావాన్ని" అని అర్థం. భగవానుని స్వభావం ఏమంటే - భక్తులకు విధేయుడై ఉండే స్వభావం. దానిని అనుసంధించి అభినివేశాన్ని పొందేవారు నా శిరస్సుపై ఉండదగినవారు - అని అంటున్నారు.

8. వానిదై ప్పుయలై మాలై వరైయిదై ప్పిరశమిన్ఱ,
తేనిదై క్కరుమ్బిన్ శాఱ్ఱై త్తిరువినై మరువి వాళార్,
మానిడప్పిఱవి యన్దో! మతిక్కిలర్ కొళ్క తన్దమ్,
ఊనిదైక్కురమ్బై వాళ్క్కైక్కుఱుతియే వేణ్డినారే.

వానిడ ప్పుయలై = ఆకాశంలో ఉండే వర్షాకాలమేఘంవంటి రూపాన్ని కలవాడై, మాలై = (భక్తులపట్ల) వ్యామోహాన్ని కలవాడై, వరైయిడై = పర్వతంలో, పిరశమ్ ఈన్ఱ = తేనెటీగలచే చేర్పబడిన, తేనిడై = తేనెప్రవాహం నడుమ (వృద్ధి చెందిన), కరుమిన్ శాఱ్ఱై = చెఱుకురసంవలె మధురమైనవాడై, తిరువినై = లక్ష్మీదేవికి సైతం లక్ష్మివంటివాడైన భగవానునితో, మరువి = పొందికగా ఉండి, వాழార్ = ఉజ్జీవించ లేనివారు, మానిడ ప్పిఱవి = మానవజన్మను, మతిక్కిలర్ = పొందడానికి అరుదైనది అని భావించకుండా ఉన్నారు,. కొళ్క = ఇది నిశ్చయం, అన్దో = అయ్యో!, తన్దమ్= తమయొక్క, ఊనిడై క్కురుమ్బై = మాంసంతో ఏర్పడిన శరీరంకోసం అయిన, వాழ్క్కైక్కు = జీవనానికి, ఉఱుతియే = నిశ్చయాన్నే, వేణ్డినారే = కోరారే! (అయ్యో!).

అవ :- ఎట్టామ్బాట్టు. (వానిడై ప్పుయలై) ఇవ్విషయమ్ సన్నిహితమాయిరుక్క దేహత్తై ప్పూణ్కట్టిక్కొళ్వతే సంసారికళ్ ఎన్గిఱార్.

వ్యా :- (వానిత్యాది) ఆకాశమధ్యే నీర్కొణ్డెழున్ను వన్దు తోన్ఱుకిఱ మేఘమ్పోన్ఱ వడివழకై యుడైయవనై. "వానిడైప్పుయల్" ఎన్నైయాలే- నిరాలమ్బ నాయిరుక్కిఱ ఎన్నై నిర్హేతుకమాక వన్దు విషయీకరిత్తవనై ఎన్గిఱార్. (మాలై) అతుక్కడియాన వ్యామోహమ్. (వరైయిడై ఇత్యాది) మలైయిలే తేనీక్కళాలే ఉత్పాదిక్కప్పట్ట తేనే నీరాక వళర్న్ద కరుమ్బిన్ శాఱుపోలే భోగ్యనానవనై. (తిరువినై) ఉత్కృష్టమాయ్ నిరవధికమాన రసవస్తువుక్కు ప్పెరితుపోలే; ఉత్కృష్టవస్తువుక్కుమ్ ఉత్కృష్టవస్తువితే. "తిరువుక్కుమ్ తిరువాకియ" "కశ్శ్రీశ్శ్రియః" ఎన్నుమ్బడియే. (తిరువినై మరువి వాழార్) వాழుకైక్కు నేర్త్తి అవన్ మేల్ నిழ విలక్కాతొழికై. ఉజ్జళుక్కు నాన్ వేణు మెన్న, ఎజ్జళుక్కు నీ వేణ్డా ఎన్నుమవర్కళ్.

(మానిడ ప్పిఱవి) పురుషార్థోపయోగియాన శరీరత్తై ఉదాసీనిప్పతే! అన్దిక్కే, ఇశ్శరీరత్తిల్ దోషత్తై యుణరాతొழివతే! ఎన్నవుమామ్. ఇత్తై దేవశరీరమాక నినైత్తిరుప్పార్కళ్ ఎన్నవుమామ్.

(అన్దో) ఐయో? ఎన్ఱు ఇవర్కళిழవుక్కు వెఱుక్కిఱార్. (కొళ్క) [1]నిశ్చయమ్.

(తన్దమిత్యాది) దృఢమిన్ఱియే "అప్పోతు పోయిఱ్ఱు; ఇప్పోతు పోయిఱ్ఱు" ఎన్ఱుమ్, మిన్నిలుమ్ నిలైయఱ్ఱిరుక్కిఱ ఇశ్శరీరత్తుక్కు పూణ్కట్టవే తేడువర్కళ్.

అరు :- ఎట్టామ్బాట్టు. (వానిడై) నిరాలమ్బనమాన ఆకాశత్తై మేఘమ్ పఱ్ఱినాప్పోలే ఆగతియాన ఎన్నైయుమ్ విషయీకరిత్తానెన్ఱవడి. పిరశమ్- తేనీ.

1. నిశ్చితమ్ - పాఠాంతరం.

*రసవస్తు- పిరాట్టి. కీళ్ వాక్యవివరణమ్ (ఉత్కృష్టవస్తు విత్యాది) మాసిడప్పిఱవి- శాస్త్రాధికారమాన దేహమెన్నుతల్; దోషయుక్తమాన దేహమెన్నుతల్; అస్థిరమాన దేహమెన్నుతల్.*

మతిక్కిలర్ -ఇమ్మూన్ఱాకారత్తైయుమ్ విసైక్కిఱిలర్, ఇతు విశ్వయమ్. ఇప్పడి మూన్ఱర్థమాక వస్తిక్కె కీళ్ఱిరణ్డర్థత్తాలుమ్ ఫలిత్తత్తై అరుళిచ్చెయ్‌కిఱార్ (ఇత్తై దేవశరీరమిత్యాది).

భావదీపిక-అవ : ఇటువంటి భగవానుడు సమీపంలోనే ఉండగా సంసారులు దేహంకోసం నిశ్చయాన్ని అన్వేషిస్తూ (దేహపోషణరక్షణాది ప్రయత్నాలను అన్వేషిస్తూ) పరిభ్ర మిస్తున్నారే ! అయ్యో ! - అని అంటున్నారు.

వ్యాఖ్యానం : (వానిడై ప్పుయలై) - ఆకాశంమధ్యలో వర్షాకాలమేఘం తోచినట్లుగా ఉండే అందమైన రూపసౌందర్యాన్ని కలవానిని- అని భావం. దేనినీ ఆశ్రయించి ఉండని ఆకాశాన్ని ఆలంబనంగా చేసికొని నిలచి ఉండి, ఎవరివల్ల ప్రత్యుపకారాన్ని ఆశించకుండా అందఱికీ ఉపకారాన్ని చేసే మేఘంవలె, ఏ ఆలంబనం లేని నాకు నిర్హేతుకంగా తానే వచ్చి అనుగ్రహించినవాడు- అని అంటున్నారు.

(మాలై) - ఈ విధంగా ఉపకరించడానికి కారణం- దాసులపట్ల వీరికి గల గొప్ప ప్రేమే కారణం- అని భావం.

(వరైయిడై ప్పిరశమీన్ఱ తేనిడై క్కరుమ్బిన్ శాఱ్ఱై)- పర్వతంలోని తేనెటీగలచే చేర్చబడిన తేనెతో వృద్ధిపఱచేటట్లు మధురంగా ఉన్నవానిని. "పిరశమ్" -అనే పదం తేనెటీగను నిర్దేశిస్తుంది. తేనెను గాని, చెఱకురసాన్నిగాని ఉపమానంగా చెప్పడం పొసగదు కనుక, తేనెతో వృద్ధిజెందిన చెఱకుయొక్క రసాన్ని ఉపమానంగా చూపుతున్నారు. అపూర్వోపమ ఇది (ఇల్‌పొరుళ్ ఉవమై).

(తిరువినై) - చాలా గొప్ప, అంతు లేని రస్యతను కల్గిన లక్ష్మీదేవికంటే గొప్ప రస్యతను కలవానిని. అందఱిచే ఆశ్రయింపబడే లక్ష్మీదేవిచేకూడా ఆశ్రయింపబడే వాడుకదా ఇతడు. "తిరువుక్కుమ్ తిరువాకియ శెల్వా!" (పెరియ తిరు-7-7-1) (లక్ష్మీదేవికికూడా లక్ష్మి అయిన ఓ సంపత్స్వరూపా) అని ఈ ఆళ్వార్లు, "కః శ్రీః శ్రియః" (స్తోత్రరత్నమ్-12) అని భగవద్యామునులు ఈ విషయాన్నిగూర్చి అనుగ్రహించారుకదా!

(తిరువినై మరువి వాళ్ఱార్) - ఇటువంటివానిని ఆశ్రయించి ఉజ్జీవించలేని వారు. పొందికగా ఉండి ఉజ్జీవించడం అంటే - అతడు (భగవానుడు) ఇతనిని

(భక్తుని) ఆదరించి, ఇతనిని అభిమానించి దరిచేరినపుడు దానికి అడ్డుపెట్టకుండా ఉండడమే. "మీకు నేను కావాలి" అని అతడు వీరి దరికి చేరినపుడు "మాకు నీవు వద్దు"అని పలికేవారు.

(మానిడప్పిఱవి మదిక్కిలర్) జంతువులవలె కాకుండా శాస్త్రాలలో చెప్పబడ్డ రీతిలో ప్రవర్తించి, పురుషార్థాలను పొందడానికి తగిన ఈ శరీరాన్ని పొందినా దీనిని నిరుపయోగంగా చేస్తున్నారే! అని భావం. లేక, ఈ శరీరంలోని దోషాన్ని తెలిసికొని ఆత్మకు హితాన్ని అన్వేషించకుండా ఉన్నారే! అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. లేక, అస్థిరత్వాన్నే స్వభావంగా కల్గిన ఈ శరీరాన్ని దేవశరీరం వలె చిరకాలం నిలచి ఉండబోతుందని తలచి, ఆత్మహితాన్నిగూర్చి చింతించకుండా ఉన్నారే! అనే అర్థాన్నికూడా గ్రహించవచ్చు.

(అన్దో!) - అయ్యో ! అని అంటూ వీరి స్థితిని చూచి దుఃఖిస్తున్నారు.

(కాళ్క) - ఇపుడు (నేను) పల్కిన విషయం వాస్తవమైనది.

(తన్దమ్ ఊనిడై క్కురమ్బై వాళ్లక్కైక్కు ఉఱుతియే వేణ్డివారే) - "మిన్నిన్ నిలైయిల మన్నుయిరాక్కైకళ్" (తిరువాయ్ 1-2-2) (మెరపు నిలచినంత కాలం కూడా విలువని అస్థిరాలైన శరీరాలు) అనే రీతిలో నిలకడగా ఉండేది కాకుండా "అపుడు నశించింది, ఇపుడు నశించింది" అని చెప్పే రీతిలో అస్థిరంగా ఉండే ఈ శరీరంలో నివసించే జీవితానికి శాశ్వతత్వాన్ని అన్వేషిస్తూ పరుగులు తీస్తున్నారే! అయ్యో!

దివ్యార్థదీపిక :- సంసారులు దేహాన్ని అభిమానించి బలపఱచుకొంటున్నారే తప్ప భగవానుని అభిమానించి ఉజ్జీవించడంలేదే- అని బాధపడి పల్కుతున్నారు.

(వానిడై ప్పుయలై) - నీటిని గ్రహించి ఆకాశం మధ్యలోకి పైకి ఎగసి కన్పించే కాలమేఘంవంటి రూపసౌందర్యాన్ని కలవానిని - అని భావం. "వానిడై" - అనే విశేషణానికి అర్థం ఏమంటే - ఏ ఆలంబనం లేని ఆకాశాన్ని మేఘం ఆశ్రయించినట్లే, ఏ ఆలంబనం లేని దాసుడనైన నన్ను అనుగ్రహించాడు - అని. ఆవిధంగా అనుగ్రహించడానికి హేతువు ఏమి? అని అంటే, "మాలై" అని అంటున్నారు. వ్యామోహమే మూర్తీభవించినవాడు కనుక- అని తాత్పర్యం.

(వరైయిడై ప్పిరశ మీన్ఱ తేనిడై క్కరుమ్బిన్ శార్రై)- భగవానుని భోగ్యత లోకవిలక్షణమైనది- అని చూపడం కోసం అపూర్వమైన ఒక చెఱకును శిక్షిస్తున్నారు (విశేషిస్తున్నారు) చల్లటి నీరు ప్రవహింపజేయగా చెఱకుయొక్క రసం వంటివాడు

అని అంటే కొంచెంకూడా తృప్తి కలుగనందువల్ల, "పరైయుదై ప్పిరశమిష్ట తేవిదై క్కరుమ్బు" అని అంటూ ఒక నూతనమైన వస్తువును ఉత్ప్రేక్షిస్తున్నారు. పర్వతంలో తేనెటీగలచే ఉత్పత్తి చేయబడిన తేనె అనే నీటిని పోసి పెంచిన చెఱకు (అనేది) ఉంటే దానిరసం వంటివాడు భగవానుడు- అని చెప్పవచ్చు- అనేది తాత్పర్యం.

(తిరువినై) - "తిరు" అనే పదంతో నిర్దేశింపబడేది లక్ష్మీదేవి కనుక, ఆమెను తెలిపే ఈ పదంతో ఇక్కడ భగవానుని తెలుపడం "తిరువుక్కుమ్ తిరువాకియ శెల్వన్" (లక్ష్మీదేవికి కూడా లక్ష్మివంటివాడు) అని అర్థం. అందఱికి గొప్పతనాన్ని కల్గించే పిరాట్టికి సైతం తానే గౌరవాన్ని కల్గించేవాడని భావం.

ఈవిధంగా ఇటువంటి భగవానుని ఆరాధించి ఉజ్జీవించకుండా, అయ్యో! ఆ స్వామియే స్వయంగా వచ్చి అత్యంతాదరాన్ని చూపినా (పైన బడినా) తొలగదోసే పాపులున్నారే! - అని గర్హిస్తున్నారు.

(మానిడైప్పిఱవి యన్దో! మదిక్కిలర్) - లోకంలో బ్రహ్మసృష్టి అనేక విధాలుగా ఉంటుంది. క్రిమికీటకాలు, పక్షులు, మృగాలుగా జన్మించడమే మిక్కిలి సహజంగా ఉన్నది. మానవజన్మను పొందడం చాలా అరుదు. అందువల్లనే "దుర్లభో మానుషో దేహః" అని అనడం. అది ఏమి ? కోట్ల సంఖ్యలో మానవులు లోకంలో కన్పిస్తూ ఉండగా, మానవజన్మ అరుదు- అని అనడం ఏవిధంగా చెప్పవచ్చు? అని పలువురు ప్రశ్నించవచ్చు. రత్నవ్యాపారివీథిలో రాసులుగా రత్నాలు కన్పించినంతమాత్రంలో "అవి దుర్లభమైనవి కావు; సులభమైనవి" అని ఎవరైనా అనగలరా! లోకంలో ఉండే మానవులందఱియొక్క సంఖ్యాపరిమితి కనుగొనవచ్చు. ఒక చిన్నగ్రామంలో ఉండే మానవేతరప్రాణుల సంఖ్యను కనుగొనడం కొంచెంకూడా సులభం కాదు- అనేదానిని గ్రహిస్తే "మానవజన్మ దుర్లభం" అనే విషయం తనకు తానే తెలుస్తుంది. ఈవిధంగా అరుదైన మానవ జన్మను పొందినవారు దానికి తగినట్లుగా ప్రవర్తించవద్దా? తిండి తిని కడుపును నింపు కోవడం, విషయభోగాలను అనుభవించడం, నిద్రించడం మొదలైన కార్యాలనే చేయడం కోసమేనా మానవజన్మను పొందడం? ఈ కార్యాలు మానవులకు, పశువులకు సాధారణం కనుక, ఇక మానవులనే అతిశయాన్ని పొందాలని అంటే భగవానుని ఆశ్రయించి ఉజ్జీవించడమే కదా కర్తవ్యం. అయ్యో! లోకులు ఈ విషయంలో దృఢమైన అభిప్రాయాన్ని పొందకుండా తమ తమ దేహాలను బలపఱచుకోవడం కోసమే అన్వేషిస్తున్నారు తప్ప, ఉజ్జీవనానికి మార్గాన్ని అన్వేషించే వారు లేరే! అని లోకస్వభావానికి కడుపు పట్టుకొంటున్నారు (బాధపడుతున్నారు)

"మానిడప్పిఱవి యన్దో! మతిక్కిలర్" అనే దానికి వేఱు రీతిలో కూడా అర్థాన్ని చెప్పవచ్చు. (ఏవిధంగా అంటే) "తీణ్డా వళ్ళుమ్బుమ్ శెన్నీరుమ్ శీయు నరమ్బుమ్ శెటిదశైయుమ్ వేణ్డానాఱ్ఱమ్ మికుముడల్" అయిన మానవ శరీరాన్ని పొంది, అయ్యో! దివ్యశరీరాన్ని పొందినట్లుగా గుండెలు విఱుచుకొని ఆనందిస్తున్నారే! అని.

"కురమ్బై" అని గుడిశెకు పేరు. దేహం ఆత్మ నివసించే గుడిశె కావడం గమనించాలి. ఈ లోకంలోని పామరులు అనిత్యమైన దేహం వాడకుండా, క్లేశపడకుండా, వృద్ధి పొందుతూ బలపఱచుకోవడం కోసమే అన్వేషిస్తున్నారు తప్ప, ఉజ్జీవనానికి మార్గాన్ని అన్వేషించేవారు లేరే! అని లోకస్వభావానికి కడుపు పట్టుకొంటున్నారు. (బాధపడుతున్నారు)

9. ఉళ్ళమో వొన్ఱిల్ నిల్లాతు ఓశైయిలెరినిన్ఱుణ్ణుమ్,
కొళ్ళిమేల్ ఎఱుమ్బుపోల క్కుழైయుమాల్ ఎన్దనుళ్ళమ్,
తెళ్ళియీర్ తేవర్క్కెల్లామ్ తేవరాయ్ ఉలకమ్ కొణ్డ,
ఒళ్ళియీర్ ఉమ్మైయల్లాల్ ఎழுమైయుమ్ తుణైయిలోమే.

ఉళ్ళమో = నా మనస్సు అయితే, ఒన్ఱిల్ నిల్లాతు = దేనిలోను స్థిరంగా నిలువతు, ఓశైయిల్ = ప్రకాశాన్ని కల, ఎరి నిన్ఱు = అగ్ని నిలచి ఉండి, ఉణ్ణుమ్ = మండి దగ్ధం చేసే, కొళ్ళిమేల్ = కొఱివికట్టెపై ఉండే, ఎఱుమ్బుపోల్ = చీమలవలె, ఎన్దన్ ఉళ్ళమ్ = నా మనస్సు, కుழైయుమ్ ఆల్ = వేగిపోతున్నది అయ్యో!, తెళ్ళియీర్ = (కార్యాన్ని సాధించే) తెలివిని (జ్ఞానాన్ని) కలవాడా!, తేవర్క్కు ఎల్లామ్ తేవరాయ్ = దేవతలందఱికి దేవుడవైనా, ఉలకమ్ కొణ్డ = లోకాన్ని మహాబలి దగ్గరనుండి యాచించి పొందిన, ఒళ్ళియీర్ = కాంతిని పొందికగా కలవాడా!, ఉమ్మై అల్లాల్ = మిమ్ములను (నిన్ను) తప్ప, ఎழுమైయుమ్ = ఏడశలోను, తుణైయిలోమే =వేఱొక సహాయాన్ని లేనివారమై ఉన్నాము.

అవ : ఒన్పతామ్పాట్టు. (ఉళ్ళమిత్యాది) "ఎన్ హృదయమానతు జనన మరణజ్గళై నినైత్తు ఉరుకానిన్ఱతు; ఎనక్కు దేవరీరై యొழியు త్తుణై యిల్లై" ఎన్గిఱార్.

వ్యా : (ఉళ్ళమో వొన్ఱిల్ నిల్లాతు ఇత్యాది) హృదయమానతు ఓరిడత్తే ధరియాతే ఓశైయైయుడైత్తాన ఎరినిన్ఱు ఉణ్ణానిన్ఱ కొళ్ళియినుళ్ ఎఱుమ్బుపోలే "ఉరువార్ పిఱవియై" నినైత్తు. "ఇరుపాడెరి కొళ్ళియినుళ్ ఎఱుమ్బే పోల" ఉరుకి శిథిలమాకానిన్ఱతు. ఒరు తలై మరణమ్, ఒరు తలై జన్మమితే. (కుழైయుమాల్)

ఇవన్ చైతన్యత్తుక్కు ప్రయోజనమ్ ఇతు పొల్లాతు ఎన్గటికై; అవన్ చైతన్యత్తుక్కు ప్రయోజనమ్- అప్పడి శెయ్‌కై. అతావతు - రక్షిక్కైయుతే.

(తెళ్ళియార్) - ఇత్తలైయిల్ కలక్కత్తుక్కు ఎతిర్‌తట్టాన తెళివుడైయారై ప్పత్తుకిఱార్. (తెళ్ళియారిత్యాది) మహాబలి ఔదార్యత్తుక్కుమ్ కుఱైవు వారామే, తన్నై ఆశ్రయిత్త ఇన్ద్రనుడైయ కార్యత్తుక్కుమ్ కుఱైవు వారామే కార్యమ్ పార్‌త్త తెళివు. తేవర్ క్కెల్లామ్ తేవరాయిరున్దువైత్తు "అలమ్ పురిన్ద నెడుమ్ తడక్కైయై" త్తాழ ఏత్తు భూమియై అళన్దుకొణ్డ. (ఒళ్ళియార్) ఇన్ద్రన్ ప్రయోజనాన్తర పరనాకిలుమ్ నమ్ కైపార్‌త్తిరున్దానెన్నుమత్తాలే వడివిల్ పిఱన్ద పుతుక్కణిప్పు. అవన్ ఇవన్‌కై పార్‌త్తిరుక్కైయాలితే ఇవన్ కాలవిళమ్బమాక క్కారియమ్ శెయ్‌తతు. (ఉణ్మైయల్లా లిత్యాది) ఎజ్గళుక్కు నాజ్గళుమ్ తఞ్జమల్ల; పిఱరుమ్ తఞ్జమల్ల; ఉణ్మైయే తఞ్జమాక వుడైయోమ్; కోల్‌తుఱైయా యిరుప్పార్ శిలర్గళ్; అవన్తాన్తరత్తై ప్రాపిత్తాలుమ్ అరజ్గత్తుత్తెయుమెన్‌తుఱైవనైయే తుఱైయాక ప్పోమవరితే.

*అరు :- ఒన్వతామ్పాట్టు. (ఉళ్ళమో) చేతనమక్కు ఇరుపాడెరికిఱతు ఏతు? ఎన్న; అరుళిచ్చెయ్‌కిఱార్ (ఒరు తలై యిత్యాది) అప్పడి శెయ్‌కై- అకారప్పడియే శెయ్‌కై. (ఒళ్ళియార్) ఒణ్మై- అழకు, ఇన్ద్రన్ కైపార్‌త్తిరున్దానెన్నైక్కు జ్ఞాపకమేతు? ఎన్న; అరుళిచ్చెయ్‌కిఱార్ (అవనివనిత్యాది). కాలవిళమ్బమ్- చాటు. ఇవరుక్కు అవనైయొழియ తుణై యిల్లైయో? ఎన్న; అరుళిచ్చెయ్‌కిఱార్ (కోల్‌తుఱైయా యిత్యాది).*

భావదీపిక-అవ : "నామనస్సు జన్మ- మరణాలమ తలచి ద్రవిస్తున్నది. నాకు నీవు తప్ప సహాయకులెవరూ లేరు"- అని అంటున్నారు.

వ్యాఖ్యానం : (ఉళ్ళమో ఒన్ఱిల్ నిల్లాతు) - "చంచలం హి మనః కృష్ణ" (గీత-6-3-4) అని అర్జునుడు పల్కిన రీతిలోనే నామనస్సు ఒక చోట నిలువకుండా ఉన్నది.

(ఓశైయిల్ ఎరినిన్ఱ ఉణ్లుమ్ కొళ్ళిమేల్ ఎఱుమ్పుపోల క్కుழైయుమాల్ ఎన్తన్ ఉళ్ళమ్) - కాంతిని కల అగ్ని స్థిరంగా నిలచి మండి నశింపజేసే కొఱివి లోపల ఉండే చీమలవలె నా మనస్సు కఱగి భగ్నమై పోతున్నది. "ఉరువార్ పిఱవిక్కణ్ ఇన్నమ్ పుకప్పెయ్‌తు, తిరివా యెన్ఱు శిన్దిత్తు ఎన్తనక్కు అఞ్జి, ఇరుపాడెరికొళ్ళియినుళ్ ఎఱుమ్పుపోల్, ఉరుకానిఱ్కుమ్ ఎన్నుళ్ళమ్ ఊழిముతల్వా !" (పెరియ తిరు-11-8-4) (ఓ జగత్కారణ స్వరూపా! పలు రూపాలను పలు జన్మలలో ఇంకా

నన్ను ప్రవేశింపజేసి, ఈ సంసారంలో ఇంకా పరిభ్రమించు - అని నాగూర్చి చింతిస్తున్నావేమో! అని తలచి నా స్థితిని గూర్చి భయపడి, రెండు వైపుల నిప్పు అంటుకొని మండే కొరివికట్టె మధ్యలోని చీమలవలె నా మనస్సు కరగిపోతున్నది) అని పెరియతిరుమొழி ప్రబంధంలో ఈ ఆళ్వార్లే అనుగ్రహించారుకదా! ఒక వైపు జన్మ, ఇంకొక వైపు మరణంగా ఈ సంసారం రెండు వైపుల దహించే కొఱివివలె ఉన్నదికదా!

(కుழైయుమ్ ఆల్) - ఈ చేతనుడు జ్ఞానాన్ని కల్గి ఉన్నందులకు ఫలం ఈ జన్మ చాలా నీచమైనదని భయపడి బాధపడాలి. భగవానుని జ్ఞానానికి ఫలం తాను సర్వరక్షకుడైన అకారవాచ్యుడు - అని గ్రహించి ఈవిధంగా తపించేవారిని రక్షించడమే.

(తెళ్ళియీర్) - తనలోని కలతకు (జ్ఞానంలోని మాలిన్యానికి) వ్యతిరేకం అయిన జ్ఞానవైశద్యాన్ని కలవానిని ఆశ్రయిస్తున్నారు.

(తేవర్క్కెల్లామ్ తేవరాయ్ ఉలకమ్ కొణ్డ ఒళ్ళియీర్) - ఇతని జ్ఞానవైశద్యానికి ఇది దృష్టాంతం. మహాబలి ఔదార్యగుణానికి కొఱత రాకుండా కార్యాన్ని నిర్వహించిన తెలివి. దేవతలకందఱికి దేవుడై ఉన్నా, "అలమ్ పురిన్ద నెడుమ్ తడక్కై" (తిరునెడు-6) (ఇక చాలు అని అనిపించేటట్లు ఎక్కువగా అనుగ్రహించే ఉదారమైన శ్రీహస్తాన్ని కలవాడు) అనే రీతిలో దానం ఇచ్చి దానం ఇచ్చి పొడుగైన తన దీర్ఘమైన శ్రీహస్తాన్ని యాచకుడై నిలచి, కింద పెట్టి భిక్షనుగొని, భూమిని కొలిచినవాడుకదా!

(ఒళ్ళియీర్) - ఇంద్రుడు ఇతనినే ప్రాప్యంగా ప్రార్థించకుండా, తాను కోల్పోయిన రాజ్యాన్నే ఫలంగా వేడినా, "నా దగ్గర ఇతడు కనీసం దీనిని అయినా ఫలంగా యాచించాడుకదా!" అని భావించిన భగవానుని రూపంలో కల్గిన కాంతిని ఈ ప్రయోగం సూచిస్తుంది. ఇంద్రుడు ఇతని సహాయాన్ని (రక్షణను) ఎదురు చూచినందువల్లనే కదా!, ఇతడు కాలవిలంబనం లేకుండా కార్యాన్ని పూర్తిచేశాడు.

(ఉన్మైయల్లాల్ ఎழுమైయుమ్ తుణైయిలోమే) - మాకు మేము రక్షకులం కాము; ఇతరులు కూడా రక్షకులు కారు. ఎల్లప్పుడు ఏ దశలో అయినా మిమ్ములనే రక్షకులుగా కల్గి ఉన్నాము. మిగిలినవారిని రక్షకులుగా గ్రహించడం ముసలితనంలో కర్రను ఊతగా పట్టుకోవడంవంటిది. ఏ స్థితిలో అయినా "అరఙ్గత్తుఱైయుమ్ ఇన్తుణైవన్" (పెరియ తిరు-3-7-6) అనేటట్లు (శ్రీరంగంలో వేంచేసియుండే మధురమైన గొప్ప రక్షకుడు) శ్రీరంగంలోనివసించే ఆ శ్రీరంగనాథునే రక్షకునిగా కలవారుకదా ఈ ఆళ్వార్లు.

దివ్యార్థదీపిక :- లోకులు ఏ పాడుపడినా పడనీ, నేను వారిలో ఒకడనై పాడయి పోకుండా, ఉజ్జీవించగలిగానే - అని ఆనందించి, భగవానునే ఆలంబనంగా గ్రహించిన తమ అనన్యగతిత్వాన్ని తెలుపుతున్నారు. "నా మనస్సు జనన మరణాలను తలచి ద్రవిస్తున్నది. దానికి నేను చేయగల్గిన పరిహారం ఏమీ లేదు. నీవే సహాయంగా ఉండాలి" అని భగవానుని ఉద్దేశించి విన్నపం చేస్తున్నారు.

**(ఉళ్ళమో ఒన్ఱిల్ నిల్లాతు)** - ఊర్వశీసాలోక్యం కావాలని లోకం అంతా తపస్సు చేస్తూ ఉండగా, ఆ ఊర్వశి అర్జునుని వద్దకు వచ్చి నిలచి "నీవు నాకు నాథుడవు కావాలి" అని అనగా, చేతులను ఎత్తి జోడించి నమస్కరించి, "తల్లీ ! నీవు నాకు తల్లివరుసలోని దానవు. ఈ కోరిక నీకు తగదు. పక్కకు తొలగి పో" అని అర్జునుడు అన్నాడు. అందువల్ల ఇతడు జితేంద్రియాలలో గొప్పవాడుగా చెప్పబడుతున్నాడు. ఇటువంటి అర్జునుడే స్వయంగా గీతలో శ్రీకృష్ణుని చూచి "చంచలం హి మనః" అని అన్నాడు. అతడే ఈ మాటను పలికేటపుడు మనం ఏమూలకు ? అని అంటున్నారు. అసద్విషయాలను ఆశ్రయించినప్పటికీ, వాటిలో అయినా మనస్సు కొంచెం అయినా నిలుకడగా ఉంటుందా! అందులో కూడా చంచలంగా ఉంటుంది. దేనిలోను నిలుకడగా నిలువడం లేదు. ఇటువంటి మనస్సును కల్గి ఉన్నందువల్ల నిప్పు ముట్టించిన కొఱివికట్టెలో చిక్కుకొన్న చీమలవలె పరితపిస్తున్నాను- అని అంటున్నారు. "ఉరువార్ పిఱవిక్కళిన్నమ్ పుకప్పెయ్‌తు, తిరువాయెన్ను శిన్దిత్తి యెన్ఱదఞ్జి, ఇరుపాడెరికొళ్ళియినుళ్ ఎఱుమ్పే పోల్, ఉరువానిఱ్ఱుమెన్నుళ్ళ మూళ్ళిముదల్వా!" (ప్రళయకాలంలో లోకాన్ని ఉదరంలో పెట్టుకొని రక్షించిన స్వామీ! పలు రూపాలలో నిండిన జన్మలలో ఇంకా నన్ను ప్రవేశింపజేసి, కర్మవశంతో పరిభ్రమించు - అని నన్నుగూర్చి నీవు తలుస్తున్నావా? అని భావించి నేను ఆ జన్మలలో పరిభ్రమించడానికి భయపడి, రెండు వైపుల నిప్పు అంటుకొని మండగా, వాటి మధ్యలో చిక్కుకొని బాధపడే చీమలవలె, నా మనస్సు క్లేశాలతో బాధపడి ద్రవిస్తున్నది.) అనే పాశురం ఇక్కడ అనుసంధేయం.

నేను కలతను పొందడం సహజం అయినట్లే, తమకు వివేకం కల్గిఉండడం సహజంకదా! - అని అంటున్నారు. "తెళ్ళియీర్!" అనే సంబోధన ద్వారా. ఒక మిట్ట ప్రదేశంతో ఒక పల్లపు ప్రదేశాన్ని నింపేటట్లుగా, తమ వివేకంతో నా కలతను పోగొట్టాలి- అని అంతరమైన భావం.

**(దేవర్క్కెల్లామ్ దేవరాయ్ ఉలకమ్ కొణ్డ ఒళ్ళియీర్)** - దాసులకు కార్యం నిర్వహించవలసివస్తే, తన గొప్పతనాన్ని కొంచెంకూడా గమనించడం లేదు కదా! "దేవాధిదేవుడనైన నేనా యాచకుడనై పోవడం!" అని వెనుకంజ వేయకుండా,

"ఏవిధంగా అయినా దాసుల కోరికను సఫలం చేయడమే మంచిది" అని భావించే వాడవు నీవు.

ఆవిధంగా యాచకవృత్తిని చేయడంవల్ల నీ తేజస్సుకు ఏదయినా కొఱత కల్గిందా? దానివల్ల ఇంకా ఇంకా నీ తేజస్సు అభివృద్ధిచెందింది కదా! ఇటువంటి ఆశ్రితపక్షపాతాన్ని తమవద్ద చూచినవారు ఎప్పటికీ ఏడేడు జన్మలకు అయినా ఇంకొకరిని రక్షకునిగా (సహాయకునిగా) గ్రహిస్తారా! అని అంటున్నారు.

10. శిత్తముమ్ శెవ్వైనిల్లాతు ఎన్ శెయ్‌కేన్ తీవినైయేన్,
పత్తినైక్కన్బుడైయే నావతే పణియాయ్ ఎన్దాయ్!
ముత్తొళి మరదకమే! ముழఙ్గొళి ముకిల్ వణ్ణా! ఎన్,
అత్త! నిన్నడిమైయల్లాల్ యాతు మొన్ఱఱికిలేనే.

శిత్తముమ్ = (నా) మనస్సుకూడా, శెవ్వై నిల్లాతు = (నిన్ను తలచేటపుడు) ధరించలేకుండా ఉన్నది, తీ వినైయేన్ = (నిన్ను స్థిరంగా అనుభవించలేని) పాపాన్ని చేసిన నేను, ఎన్ శెయ్‌వేన్ = ఏమి చేయను?, పత్తినైక్కు అన్బుడైయేన్ ఆవతే పణియాయ్ = అంతు లేని భక్తిని తక్కువజేసికొని, పరిమితమైన భక్తిని కలవానినిగా నీవే చేయాలి, ముత్తు ఒళి మరతకమే = ముత్యంవలె చల్లనైన, మరతకంవంటి కాంతిని కల్గిన తిరుమేనిని కలవాడా!, ముழఙ్గు ఒళి ముకిల్ వణ్ణా = మెఱసి గర్జించే మేఘంవంటి వర్ణాన్ని కలవాడా!, ఎన్ అత్త =నా స్వామీ!, నిన్ అడిమై అల్లాల్ = నీ కైంకర్యాన్ని తప్ప, యాతుమ్ ఒన్ఱు=వేఱు దేనినీ, అఱికిలేనే= తెలియనివాడనై ఉన్నాను.

అవ :- పత్తామ్పాట్టు. (శిత్తము మిత్యాది) సంసారత్తై అఞ్జి ఉన్ తిరువడికళై పఱ్ఱినవళవేయో? తిరువడికళిలే పరమభక్తియుముణ్డాయ్‌ఱ్ఱు - ఎన్గిఱార్.

వ్యా :- (శిత్తముమ్ శెవ్వై నిల్లాతు) నీజ్ఞప్పుక్కు వాయ్‌కరైయిలే తెప్పమిழన్దారైప్పోలే అనుసన్ధిక్కప్పుక్కాల్ ధరిత్తు నిఱ్కమాట్టుకిఱతిల్లై నెఞ్జు. (ఎన్ శెయ్‌కేన్ తీవినైయేన్) భక్తిపారవశ్యత్తాలే అనుభవిక్కప్పోకాతపడి పాపత్తై పణ్ణినేన్. ఎన్ శెయ్‌కేనెన్ఱు- శెయల్ మాట్చి, ఉద్దేశ్యవిరోధిపాపమామత్తై పఱ్ఱి "తీవినైయేన్" ఎన్గిఱార్.

(పత్తినైక్కు అన్బుడైయే నావతే పణియాయ్ ఎన్దాయ్) "ఎన్ఱనళవన్ఱాల్ యానుడైయ అన్బు" ఎన్నుమ్బడియే [1]నూల్ పిడిత్త భక్తియై అళవాక్కవేణుమ్. (ఎన్దాయ్) భక్తియై యుణ్డాక్కిన నీయే అళవుపడుత్తవేణుమ్.

---

1. నూల్ పిడిక్క (నూల్ పిడుక్కుమ్బడి) - భక్తియై అళవాక్కవేణుమ్ - పాఠాంతరం.

(ముత్తొళి మరతకమే) భక్తిజనకమాన వడివు ముత్తినుడైయ కుళిర్త్తియై యుమ్, మరతకత్తినుడైయ శ్యామత్తైయుమ్ ఉడైత్తాయిరుక్కై. (ము ల్గాళి ముకిల్ వణ్ణా) మిన్ని ముళ్గి విల్లిట్టు సఞ్చరిప్పతొరు మేఘమ్పోల్ల విఙత్తై యుడైయవనే!

(ఎన్ అత్తా) అళ్ఙుకుక్కు త్తోళ్హ్గ్రయ [1]ఎన్నాయన్ ఎన్గిఱార్. వీర్, "శిత్తముమ్ శెవ్వైనిల్లాతు" ఎన్నతు, "తీవినైయేన్" ఎన్నతాయ్ క్కిడమ్మ ఎన్గియ పడుకిఱీర్? ఇత్తై విట్టు వేఱొన్ఱోడే పోతుపోక్కినాలో? ఎన్న (విన్నడినై ఇత్యాది) ఉన్ తిరువడికళిల్ కైఙ్కర్యమొళ్హియ వేఱొన్ఱఱియేన్. "మఱన్దేనున్నై మున్నమ్" ఎన్ఱతు పోక్కి, "ఏతు శెయ్తాల్ మఱక్కేన్" ఎన్నుమ్పడి పణ్ణినైత్త పిన్పు వేఱొన్ఱై అఱియ విరకుణ్డో?

అరు : పత్తామ్పాట్టు - *(శిత్తముమ్) అన్బుడైయే నావతే పణి - అళవన్దాల్" ఎన్ఱు అళవిఱన్ద భక్తియై మాత్ర్త్రి, ([2]నూల్ పిడిత్త) శెవ్వే అనుభవిక్కుమ్పడి భక్తియై, (అళవాక్క)-* మట్టమాక్కవేణుమెన్నపడి.

భావదీపిక-అవ : ఈ లౌకికజీవనానికి భయపడి నీ శ్రీచరణాలను ఆశ్రయిం చడం మాత్రమేకాకుండా, విశ్లేషాన్ని సహించలేని రీతిలో నీ శ్రీచరణాలపట్ల పరమభక్తి కూడా నాకు కల్గింది- అని అంటున్నారు.

వ్యాఖ్యానం : (శిత్తముమ్ శెవ్వై నిల్లాతు) ఒక తెప్పను గొని ఏరును దాటాలని ప్రయత్నించి, మధ్యలో తెప్పను కోల్పోయేవారివలె, నిన్ను ఆశ్రయించి, ధ్యానించడం ఆరంభిస్తే ధరించి ఉన్న నా మనస్సు ఇపుడు చింతిస్తే కూడా ధరించలేకుండా ఉన్నది.

(ఎన్ శెయ్కేన్ తీవినైయేన్) - భక్తికి వశమై ఉన్నందువల్ల "కాలాళుమ్ నెఞ్జళ్ళియుమ్ కణ్ శుళ్లుమ్" (పెరియ తిరువన్దాది-34) (కాళ్ళు తడబడతాయి, మనస్సు భగ్నమౌతుంది, కళ్లు గిరగిరా తిరుగుతాయి) అనే దశను పొంది, నిన్ను నిలుకడగా అనుభవించలేని (ధ్యానించలేని) మహాపాపాన్ని చేశాను. నేను ఏమి చేయను? "ఎన్ శెయ్కేన్" అనే ప్రయోగం చేష్టలుడిగిన దశను సూచిస్తుంది. భక్తి పరవశులై ఉండడం చాలా గొప్ప ప్రాప్యమే అయినా, అది అనుభవానికి అంతరాయ మైనందున, దానిని పొందిన స్వభావాన్ని "తీవినైయేన్" అని అంటూ ఆళ్వార్లు పల్కుతున్నారు.

(పత్తినైక్కు అన్బుడైయేనావతే పణియాయ్ ఎన్దాయ్!) - అంతు లేని భక్తిని తగ్గించి, పరిమితమైన భక్తిని కలవాడనుగా నీవే చేయాలి. "ఎన్దన్ అళవన్దాల్ యానుడైయ అన్బు" (ఇరణ్డామ్ తిరు-100) (నా పరిమితిలో ఉన్నది కాదు నా

1. ఎన్నాయనెన్గిఱార్ - పాఠాంతరం. 2. నూల్ పిడిక్క - పాఠాంతరం.

భక్తి) అనే రీతిలో నాచే ధరించడానికి సాధ్యం కాని పరిమితిలో ఉండే నా భక్తిని, ధరించి నిలచి అనుభవించగలిగేటట్లుగా పరిమిత మైన భక్తిగా చేయాలి.

(ఎన్దాయ్) - భక్తిని కల్గించిన నీవే దానిని పరిచ్ఛిన్నంగా చేయాలి.

(ముత్తొళి మరతకమే) - భక్తిని కల్గించిన భగవానుని తిరుమేని ముత్యం యొక్క చల్లని స్వభావాన్ని, మరతకంయొక్క నీలవర్ణాన్ని కల్గినదై ఉంటుంది.

(ముళ్గొళి ముకిల్ వణ్ణా!) - మెఱసి గర్జించి ఇంద్రధనుస్సుతో కదిలే ఒక మేఘంవంటి వర్ణాన్ని కలవాడా!

(ఎన్ అత్తా) తిరుమేని రూపసౌందర్యానికి జితులై "నా స్వామీ!" అని ఆళ్వార్లు అంటున్నారు. "శిత్తముమ్ శెవ్వై నిల్లాతు" అని, "తీవినైయేన్" అని అంటూ ఎందుకు ఈవిధంగా పడి ఉండి బాధపడుతున్నారు? ఈ విషయాన్ని విడచిపెట్టి వేఱొక విషయంతో కాలక్షేపం చేయవచ్చునుకదా!" అని భగవానుని భావనగా తలచి ఆళ్వార్లు బదులు పల్కుతున్నారు.

(నిన్నడిమైయల్లాల్ యాతుమ్ ఒన్ఱు అఱికిలేనే) - నీ శ్రీచరణాలలో కైంకర్యాన్ని తప్ప వేఱు దేనినీ తెలియను. "మఱన్దేన్ ఉన్నై మున్నమ్" (పెరియతిరు-6-2-2) (పూర్వం నిన్ను నేను విస్మరించాను) అని అనాది కాలంగా నిన్ను మఱచిపోయిన స్థితి పోయి, "ఏతు శెయ్‌తాల్ మఱక్కేన్?" (పెరియ తిరు-9-3-3) (ఏమి చేస్తే మరువగలను) అనే రీతిలో నిన్ను మఱువలేని రీతిలోని స్థితిని నీవే కల్గించిన తరువాత వేఱొక విషయాన్ని తెలిసే దారి ఉన్నదా !

దివ్యార్థదీపిక :- సంసారంయొక్క కాఠిన్యానికి (క్రూరతకు) భయపడి, తమ శ్రీచరణాలను చేరడం మాత్రమేనా! భరించలేని పరమభక్తికూడా కల్గిందికదా! అని అంటున్నారు.

(శిత్తముమ్ శెవ్వై నిల్లాతు) - సముద్రాన్ని దాటాలని ప్రవేశించి మొదటి అడుగులోనే తెప్పను కోల్పోయే వారివలె, అనుసంధించాలని ప్రయత్నించి ధరించలేక మనస్సు చెదరిపోయింది- అని అంటున్నారు. "ఉరుకుమాల్ నెఞ్జమ్ ఉయిరిన్ పరమన్ఱి ప్పెరుకుమాల్ వేట్కైయుమెన్ శెయ్‌వేన్ తొణ్డనేన్" (భగవానుని ఆశ్చర్యకరలీలలను అనుసంధించినపుడు నా మనస్సు ప్రేమతో ద్రవిస్తున్నది. అభినివేశ మధికమై నేనేమీ చేయలేకున్నాను) అనే నమ్మాళ్వార్లవలె ఆక్రందిస్తున్నారు. "భక్తిపారవశ్యంతో అనుభవించలేక మనస్సును కోల్పోయే రీతిలోని పాపాన్ని చేసిన నేను ఏమి చేయను?" అని అంటున్నారు.

(పత్తిమైక్కు అమ్బుడైయేనాపతే పణియాయ్) - జన్మదరిద్రునకు అంతు లేని ఆకలి కల్గితే, ఆకలికి తగినట్లుగా అన్నం లభించకపోతే, "ఆకలి మందగించి పోవడానికి మందును ఇచ్చేవారెవరైనా ఉన్నారా?" అని విచారించేటట్లే, ఆళ్వార్లకు తమ గొప్ప ఆశకు తగినట్లుగా అనుభవించలేనందువల్ల (తమ) ఆశను పరిమితం చేస్తే చాలునని అంటున్నారు. అంతు లేని ఆశకల్గి ఉండే స్థితికి "పత్తిమై" అని పేరు. ఒక అవధిలో ఆశ ఉన్న స్థితికి "అమ్బు" అని పేరు- అని గ్రహించాలి. ఇపుడు ఆళ్వార్ల ఆశయొక్క స్థితి అవధి దాటిన స్థితిలో ఉన్నందువల్ల "ఇటువంటి అవధి లేని ఆశతో నేను పాట్లు పడలేను. ఈ స్థితిని మార్చి, కేవలం ప్రేమ ("అమ్బు") దశనే అనుగ్రహించు" అని ప్రార్థిస్తున్నారు. "ఎల్లైయిలవల్లాల్ యాముడైయ అమ్బు" అనే రీతిలో అవధి దాటి నడచే ఆశాప్రవాహాన్ని తగ్గించి, దానిని ఒక పరిమితిలో ఉండేటట్లు చేయి" అని భావం. ఆకలికి తగిన అన్నాన్ని అయినా పెట్టు, లేక, ఆకలిని అయినా ఉన్న అన్నానికి సరిపడే రీతిలో పరిమితం చేయి" అని అనేవారి వలె పల్కుతున్నారు. "కణపురత్తు పొన్మలైమేల్ విల్లవల్లవ్ పొన్నకలమ్ తోయావేల్, ఎన్నినైతాన్ వాళా వెనక్కే పొత్తైయాకి, మున్నిరుమ్బ మూక్కిరుమ్బ మూక్కినుమ్బ మూవామై కాప్పదోర్ మన్నుమరుమ్బళిపీరిల్లైయే" (తిరుక్కణ్ణపురంలోని బంగారు కొండవలె నిలచి ఉండే స్వామియొక్క అందమైన వక్షస్సులో చేరడానికి వీలుకాకపోతే, వ్యర్థమైన ఈ సొత్తు నాకు ఎందుకు? ఈ స్తనాలు నాకు వ్యర్థంగా భారమై, నా కంటి ఎదుటనే కన్పిస్తూ ఇంకా ఇంకా పెరిగితే, ఆవిధంగా అవి వృద్ధి కాకుండా అడ్డుకొనే ఒక గొప్ప మందును కనుగొని ఇచ్చే వారు లేరే) అనే పెరియతిరుమడల్ సూక్తిలోకూడా ఈ అర్థం తెలుపబడడం గమనించాలి.

ఈ విధంగా మనకు అవధి మీఱిన భక్తి రూపమైన గొప్ప ప్రేమ కలుగడానికి కారణం ఇది -అని అంటున్నారు - "ముత్తొళి మరతకమే! ముళ్లైజ్జొళి ముకిల్ వణ్ణా!" అనే సంబోధనతో. ముత్యంవలె చల్లనిదిగాను, మరతకంవలె నీలవర్ణాన్ని కల్గినదిగాను ఉండే తిరుమేని అందంలో అభినివేశం పొందడంవల్ల ఇటువంటి భక్తి కల్గింది -అని భావం.

రూపసౌందర్యంలో అభినివేశాన్ని పొందినవారు "తోళ్ కణ్డార్ తోళే కణ్డార్ తొడుకలఱ్ఱమలమన్న తాళ్ కణ్డార్ తాళే కణ్డార్ తడక్కై కణ్డారుమంఱితే" అనే రీతిలో ఒక్కొక్క దివ్యావయవంలోను మనస్సు నీటి బుగ్గవలె కఱిగి అభినివిష్టులు అవుతారు తప్ప, ధరించి నిలచి కైంకర్యాన్ని చేయడం సాధ్యం కాదు కనుక, తమకు కైంకర్యం చేయడంలోనే అధికంగా ఆసక్తి ఉన్నా, "పత్తిమైక్కు అమ్బుడైయే

నావతే పణియాయ్ ఎన్దాయ్ !" అని ప్రార్థించేటట్లుగా తటస్థించింది- అనే విషయాన్ని చివరి పాదంలో వ్యక్తం చేశారు.

11. తొణ్డెల్లామ్ పరప నిన్నై త్తొழుతు అడి పణియుమాఱు,
కణ్డు తాన్ కవలై తీర్ప్పానావతే! పణియాయ్ ఎన్దాయ్ !
అణ్డమాయ్ ఎణ్డిశైక్కు మాతియాయ్ నీతియాన,
పణ్డమామ్ పరమశోతి! నిన్నైయే పరవువేనే.

తొణ్డు ఎల్లామ్ = చేసే కైంకర్యాలను అన్నిటినీ, పరవి = క్రమాన్ని విడచి పల్కి (జల్పించి), నిన్నై = నిన్ను, తొழుతు = సేవించి, అడి పణియుమ్ ఆఱు = నీ శ్రీచరణాలను సేవించే దారిని, కణ్డు = ఆశపడి, తాన్ కవలై తీర్ప్పానాన్ ఆవతే (తనవే) మనఃక్లేశాన్ని ఒకడు తీర్చుకోవడం వీలవుతుందా?, ఎన్దాయ్ = నా స్వామీ!, పణియాయ్ =నీవే పలకాలి, అణ్డమాయ్ = అండభిత్తి లోపల ఉండే అంతటికి అంతర్యామివై, ఎణ్ తిశైక్కుమ్ ఆతియాయ్ = ఎనిమిది దిక్కులలో ఉండే దైవాలకు కారణభూతుడవై, నీతి యావ పణ్డమాయ్= క్రమం తప్పని ధనమై ఉండే, పరమ్ శోతి = పరంజ్యోతీ!, నిన్నైయే = నిన్నే, పరవువేనే = (భక్తిపారవశ్యంతో) క్రమవివక్ష లేకుండా స్తుతిస్తాను.

వ్యా :- పతినోరామ్పాట్టు. (తొణ్డెల్లా మిత్యాది) శెయ్యుమడిమై ఎల్లామ్ [1]అడైవు కెట్టు ప్పేశి. "అహం సర్వం కరిష్యామి" ఎన్నుమ్పడియే. (నిన్నై త్తొழుతు) ఉన్నై క్కణ్డువైత్తు అడైవు పడ త్తొழుప్పోమో? (అడి పణియు మాఱు కణ్డు) తప్పామే మనోరథిత్తు. (తాన్ కవలై తీర్ప్పానావతే) తన్నాలే మనోదుఃఖత్తై త్తీర్త్తు క్కొళ్ళలామే? ఎన్నాలే మనక్కవలై పోక్కి అడిమై శెయ్యప్పోమో? మనక్కవలై తీర్ప్పార్ అవరితే. (పణియాయెన్దాయ్) నిర్వాహకనావ నీయే అరుళిచ్చెయ్యాయ్.

(అణ్డమాయిత్యాది) అణ్డాన్తర్వర్తికళుక్కుమ్ నిర్వాహకనాయ్, ఎట్టు దిక్కిలుళ్ళ దేవతైకళుక్కుమ్ కారణమాయ్ [2]ముఱై తప్పాతపడి. (పణ్డమామ్) ధవమామ్. పణ్డమెన్పతు - ధనమ్. ఇవ్వాత్మావుక్కు ధవమానవనే! (పరమ శోతి) పరఞ్జ్యోతిశ్శబ్ద వాచ్యనానవనే! (నిన్నైయే పరవువేనే) ఉన్నైయే అడైవు కెడ స్తోత్రమ్ పణ్ణుమత్తనై.

అరు : *(తొణ్డెల్లామ్) అడిపణియుమాఱు కణ్డు- తిరువడికళిలే వణఙ్గుకిఱ ప్రకారత్తై మనోరథిత్తు. కొళ్ళలామే - కొళ్ళపోమో.*

భావదీపిక-వ్యాఖ్యానం : (తొణ్డు ఎల్లామ్ పరవి) - నీకు చేసే కైంకర్యాలను అన్నిటిని గూర్చి క్రమవివక్ష లేకుండా పల్కి - అని భావం. "భవాంస్తు సహ

1. అడైవుపట్టు - పాఠాంతరం. 2. ముఱై తప్పాత - అని మాత్రమే పాఠాంతరం.

వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపతశ్చ తే" (శ్రీరా-అయో-31-27) (నీవు వైదేహితో పాటు పర్వతచరియ ప్రదేశాలలో విహరిస్తావు. అపుడు నేను మీరు ఇరువురు మేల్కొని ఉన్న సమయంలోను, నిద్రించే సమయంలోను మీకు సకల విధకైంకర్యాలను చేస్తాను) అని లక్ష్మణుడు విన్నపించిన రీతిలో పల్కి.

(విన్నై త్తొழுతు) - నిన్ను సేవించి. నిన్నుగూర్చి క్రమవివక్ష లేకుండా పలికేటట్లు మిక్కిలి భక్తితో క్రమవివక్ష లేకుండా సేవించి- అని భావం. నిన్ను దర్శించిన తరువాత నా అంగాలు శిథిలమైనందున ఏవిధంగా నేను క్రమాను సారంగా సేవించడానికి సాధ్యం?

(అడి పణిమాఱు కణ్డు) - నీ శ్రీచరణాలలో నమస్కరించే దారిని మనో రథంతో దర్శించి (ఆశపడి).

(తాన్ కవలై తీర్ప్పానావతే) - నాచే మనఃక్లేశాన్ని తీర్చుకోవడం సాధ్యమా! నాచే మనఃక్లేశాన్ని పోగొట్టుకొని నీకు దాస్యం చేయడం నాకు సాధ్యమా! మనఃక్లేశాన్ని తీర్చవలసినవాడవు నీవే కదా!

(పణియాయ్ ఎన్దాయ్)- అన్నిటిని నడిపించే (నిర్వహించే) నీవే దీనిని అనుగ్రహించాలి.

(అణ్డమాయ్) - అండంలోపల ఉండే అన్ని వస్తువులకు అంతర్యామివై ఉండి నిర్వహించేవాడవై.

(ఎణ్ త్తిశైక్కుమ్ ఆతియాయ్) - ఎనిమిది దిక్కులలో ఉండే సకల దేవతలకు కారణమై

(నీతియాన పణ్డమాయ్) -జీవాత్మయొక్క స్వరూపానికి తగిన ధనమై ఉన్నవాడా! "పణ్డమ్" అనే పదం ధనాన్ని నిర్దేశిస్తుంది. "నీతియాన పణ్డమ్" అని అన్నందువల్ల, "మిగిలిన ధనాలు అన్నీ స్వరూపవిరుద్ధాలు; స్వరూపానురూపమైన ధనం ఇతడే" అని తెలుపుతున్నారు.

(పరమశోతి) - "నారాయణ పరో జ్యోతిః" (తైత్తి-నారా-11) అని వేదం చేత పరంజ్యోతిగా కీర్తింపబడేవాడా!

(విన్నైయే పరవువేనే) - నిన్నే క్రమాన్ని విడచి స్తుతిస్తాను. "అత్యంతభక్తి యుక్తానాం న శాస్త్రం నైవ చ క్రమః" (మిక్కిలి భక్తిని కలవారి విషయంలో శాస్త్రంగాని

(క్రమం గాని లేదు) అనే రీతిలో పరమభక్తిని కల వీరికి క్రమానుసారంగా పల్కడమో, స్తుతించడమో సాధ్యం కాదు- అనే విషయం గమనించదగినది.

దివ్యార్థదీపిక :- "నా మనఃక్లేశాలను నేనే తీర్చుకొనగలనా? నీవే తీర్చాలి". అని భగవానుని ఉద్దేశించి ప్రార్థిస్తున్నారు.

(తొణ్డెల్లామ్ పరవి) - "ఒழివిల్ కాలమెల్లా ముడనాయ్ మన్ని వழువిలా వడిమై శెయ్యవేణ్డుమ్ నామ్" (విచ్ఛేదం లేని కాలం అంతా స్థిరంగా నిలచి ఉన్నవారమై, నిరంతరమైన కైంకర్యాన్ని మనం చేయాలి) అని నమ్మాழ்వార్లు, "భవాంస్తు సహ వైదేహ్యా గిరి సానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపతశ్చ తే" (శ్రీరామా! నీవు సీతాదేవితో కలసి చిత్రకూటపర్వతసానువులలో విహరించేటపుడు మేల్కొని ఉన్నసమయం, నిదురపోయేసమయం అనే తేడా లేకుండా ఏస్థితిలో అయినా నేను అన్నివిధాలైన కైంకర్యాలను చేస్తాను) అనే లక్ష్మణుడు ఆశపడి పల్కినట్లుగా నేనుకూడా అన్ని కైంకర్యాలను చేయాలి అని ఆశను పొంది, నీ శ్రీచరణాలను సేవించాలనే మనోరథాన్ని పొందినందువల్ల నా మనఃక్లేశాలను నేను పోగొట్టుకొనే దారి ఉన్నదా? నీ విషయంలో కైంకర్యాన్ని చేయడమో నీ శ్రీచరణాలను సేవించి కైంకర్యం చేయడమో - అంతా నీ దివ్యసంకల్పంవల్ల జరుగవలసినదే తప్ప అతిబలహీనుడనైన నీచుడనైన నేను తలచిన రీతిలో ఏమి సాధ్యమవుతుంది? ఏపని కాదు. నా క్లేశాన్ని నేనే తీర్చుకొన గల్గినవాడనా? తీర్చుకొనలేను. కైంకర్యాన్ని చేయడం, నీకు నమస్కరించి పాదాలను సేవించడం సాధ్యమైనపుడు క్లేశాలు తీరడంలో అడ్డు లేదు. (కాని) అవి పూర్తికావడం నీ సంకల్పంవల్లనే జరుగుతుంది అంతే, కనుక ఆవిధంగా నీవు సంకల్పించాలి- అని నిన్నే స్తుతించి ప్రార్థిస్తున్నాను- అని అంటున్నారు. "పరన్ద శిన్దై యొழிన్ది నిన్ఱు నిన్న పాదపఙ్గయమ్, నిరన్తరమ్ వినైప్పదాక నీ నినైక్కవేణ్డుమే" (కనబడిన చోట అంతా తిరిగే నా మనస్సు నీ విషయంలో స్థిరంగా ఉండి, నీ శ్రీచరణాలను నిరంతరం ధ్యానించేటట్లు నీవు అనుగ్రహించాలి) అనే తిరుమழிశై ఆழ్వార్ల పాశురభావం ఇక్కడ గమనించదగినది.

(ఎణ్డిశైక్కు మాదియాయ్) అష్టదిక్పాలకులకు సైతం పాలకుడు- అని భావం.

(నీతియాన పణ్డమ్) - "పణ్డమ్" అంటే ధనం. "నీతియాన పణ్డమ్" అంటే క్రమం తప్పకుండా ప్రాప్తమైన ధనం. "శేలేయ్ కణ్ణియరుమ్ పెరుమ్ శెల్వముమ్ నన్మక్కళుమ్ మేలా త్తాయ్ తన్దైయుమ్ అవరే ఇనియావారే" (అందమైన చేపల

వంటి కన్నులను కల వనితలు, గొప్పసంపద, ఇంకా తల్లి, తండ్రి, ఇంకా అందఱు ఆ భగవానుడే) అనే రీతిలో మాకు ప్రాప్తమైన సంపద నీవే- అని భావం.

(విన్నైయే పరవువేనే) - "నా క్లేశాలను నేనే తీర్చుకోవడం సాధ్యం కాదు; కనుక నీవే తీర్చాలి అని నిన్నే స్తుతిస్తున్నాను"- అని భావం.

12. ఆవియై అరజ్గమాలై అழுక్కుడమ్బెచ్చిల్‌వాయాల్,
తూయ్‌మైయిల్ తొణ్డనేన్ శొల్లినేన్ తొల్లై నామమ్,
పావియేన్ పిழைత్త వాఱెన్ఱు అఞ్జినేఱ్కు అఞ్జలెన్ఱు,
కావిపోల్ వణ్ణర్ వన్దు ఎన్ కణ్ణుళే తోన్ఱినారే.

ఆవియై = (లోకాలకు) అద్వితీయ ప్రాణమై, అరజ్గమ్ మాలై = శ్రీరంగంలో వేంచేసి ఉండే ప్రేమే మూర్తీభవించినట్లున్నవానిని, అழுక్కు ఉడమ్బు = కల్మషమే రూపంగా కల్గిన శరీరంలో ఉండే, ఎచ్చిల్ వాయాల్ = ఎంగిలి నిండిన నోటితో, తూయ్‌మై ఇల్ = శుద్ధి లేని, తొణ్డనేన్ నాన్ = (ఇతరవిషయాలలో) దాసుడనై ఉండే నేను, తొల్లై నామమ్ = అనాది అయిన నీ తిరునామాన్ని, శొల్లినేన్ = పలికాను, పావియేన్ = పాపిని అయిన నేను, పిழைత్త వాఱు ఎన్ఱు = ఎంతటి పెద్ద తప్పును చేశాను! అని, అఞ్జినేఱ్కు = భయపడిన నాకు, అఞ్జల్ ఎన్ఱు = "భయపడకు" అని పల్కి, కావిపోల్ వణ్ణర్ = నీలకలువలవంటి వర్ణాన్ని కల్గినవాడు, వన్దు = తానే వేంచేసి వచ్చి, ఎన్ కణ్ణుళ్ళే = నా కంటిలోపల, తోన్ఱినార్ = ప్రత్యక్షమయ్యాడు.

అవ : పన్నిరణ్డామ్పాట్టు. (ఆవియై యిత్యాది) "ఉభయవిభూతియైయుమ్ అழிక్కప్పుక్కేన్" ఎన్గిఱార్.

వ్యా :- (ఆవియై) "ఉలకజ్గట్కెల్లామ్ ఓరుయిరా"నవనై. (అరజ్గమాలై) కణ్ణుక్కు త్తోఱ్ఱాతపడి నిన్ఱు ధారకమాకైయన్ఱిక్కే. కణ్డాలే కాణ వ్యామోహన్దాన్ ఒరువడివు ఎన్నలామ్పడి యిరుక్కై. (అழுక్కుడమ్బు ఎచ్చిల్‌వాయాల్) ఎత్తనై పేర్ కాలిలే విழுవ్దతు! ఎత్తనై పేరై స్తోత్రమ్ పణ్ణిఱ్ఱు! (తూయ్‌మైయిల్ - నాన్) తప్ప చ్చెయ్‌తో మెన్గిఱ అనుతాపము మిల్లాత నాన్. (తొణ్డనేన్ నాన్) కణ్డతెల్లావఱ్ఱిలుమ్ తొణ్డుపట్టు త్తిరిన్ద నాన్. (శొల్లినేన్ తొల్లై నామమ్) నిత్యసూరికళ్ ఇని ఎన్కొణ్డు జీవిక్కక్కడవర్ కళ్? శొల్లియఱ్ఱతు. ఇతుక్కు మున్బు అழிన్దతియాతతొన్ఱు, "నమో నారాయణాయ" ఎన్ఱు పల్లాణ్డు పాడి [1]జీవిక్కక్కడవర్‌కళ్ ఇని ఎన్కొణ్డు జీవిక్కక్కడవర్‌కళ్.

(పావియేన్ పిழைత్తవాఱెన్ఱు అఞ్జినేఱ్కు) - తొల్లై నామత్తై నాన్ శొల్లివిడుకై యన్ఱిక్కే, "నానుమ్ శొన్నేన్ నమరుముఱైమిన్" ఎన్ఱు ఇప్పడి అழைప్పారుణ్డో?

1. జీవిక్క కడవ అవరకళ్ - పాఠాంతరం.

సాత్త్వికనాయిరుప్పానొరువన్, రజస్సు తలై యెడుత్తు మధ్యరాత్రత్తిలే గృహత్తిలే నెరుప్పై వైత్తు సత్త్వమ్ తలైయెడుత్తవాఱే అనుతపిక్కుమాపోలే, పావియేన్ నాన్ తప్పినే వెన్ఱు అఞ్జినేనుక్కు.

(అఞ్జలెన్ఱు) ఉన్ కార్యమ్ ఉనక్కే భరమో? ఎన్ఱు, "మా శుచః" ఎన్ఱు "అఞ్జాతే" యెన్ఱు. (కావిపోల్ వణ్ణర్ వన్ఱు) వడివళ్ళగై క్కాట్టి [1]మరున్దై యిట్టు ప్పొరుద్దవిట్టార్. (కావి)-కరుజ్గువళై. ఇవ్వడివై నమ్ కణ్ణాలే నోక్కి అళ్ళిక్కవొణ్ణాతెన్ఱు కణ్ణై చ్చెమ్బళిత్తేన్. (కణ్ణుళ్ళే తోన్ఱినారే) [2]కణ్ణుక్కుళ్ళే తోన్ఱినార్. ఇవర్ కణ్ శెమ్బళిత్తు పార్క్కిఱ తెప్పోతో? ఎన్ఱు పార్త్తిరున్దాన్‌పోలే కాణుమ్ అవనుమ్.

అరు :- వన్నిరణ్డామ్‌పాట్టు- *(ఆవియై) (ఉభయవిభూతి)* ఆవియై ఎన్దైయాలే- [3]*అవ్విభూతి తోఱ్ఱుకిఱతు. తొల్లై నామమ్ ఎన్దైయాలే- నిత్యసూరికళనుభావ్యమ్ తోఱ్ఱుకిఱతు. పిళ్ళై- తప్పు. కణ్ శెమ్బళిక్కై- స్వయత్నమఱుకై.*

భావదీపిక-అవ : నమ్మాళ్వార్లకు "వళవేళ్ళులకు" (తిరువాయ్-1-5) దశకంలో కల్గిన అనుభవంవంటిదే ఈ పాశురంలో తిరుమజ్గై ఆళ్వార్లకు కల్గిన అనుభవం. భగవానుని అనుభవించడానికి యోగ్యతను లేనివాడననే భావనతో వీరికి భగవానునినుండి దూరంగా తొలగిపోయే దశ కల్గింది. "అతనినిగూర్చి పలికే యోగ్యత లేని నేను అతనిని, అతని సంపద అయిన ఉభయ విభూతినిగూర్చి పలకాలని ఆరంభించి, వానిని పాడుచేయడమే చేశాను"- అని తలచి వీరు తొలగి పోవాలని ప్రయత్నించగా, భగవానుడు వీరి కన్నులలో ప్రత్యక్షం కావడాన్నిగూర్చి పల్కుతున్నారు.

వ్యాఖ్యానం : (ఆవియై) "ఉలకజ్గట్కెల్లామ్ ఓరుయిరేయో !" (తిరువాయ్-8-1-5) (లోకాలకు అన్నిటికి అద్వితీయమైన ఓ ప్రాణమా!) అని కీర్తింపబడ్డ అతనివికదా యోగ్యత లేని నేను దరిజేరి పాడుచేయ బోయాను!

(అరజ్గమాలై) పరదశవలె కంటికి స్ఫురించని రీతిలో ఉండి ధరింపజేసేదిగా ఉండకుండా, "ప్రేమే రూపు దిద్దుకొన్నది" అనే రీతిలో కంటితో దర్శించగల్గిన అర్చావతారాన్నికదా నేను పాడుచేయబోయాను!.

(అళుక్కుడమ్బు ఎచ్చిల్ వాయాల్) - ఈ శరీరం ఎంతమంది కాళ్ళపై పడి ముటికిపట్టి పడి ఉన్నది. ఎంతమందివి స్తుతించింది ఈ ఎంగిలి నోరు! వాటితో అతనిని నమస్కరించడం, అతనిని స్తుతించడం తగనిదికదా !

(తూయ్‌మైయిల్ నాన్) - ఈ విధంగా పెద్ద తప్పు చేసి, "ఈ విధంగా చాలా తప్పు చేశానే!" అనే పశ్చాత్తాపం లేని నేను.

1. మరుట్టి యిట్టు -పాఠాంతరం 2. కణ్ణుళ్ళే - పాఠాంతరం. 3. ఇవ్విభూతి - పాఠాంతరం

(తొణ్డనేన్ నాన్) -కనబడినవారికి అందరికి దాసుడనై తిరిగిన నేను.

(శొల్లినేన్ తొల్లై నామమ్) - నిత్యసూరులు పలికే తిరునామాన్ని నేను పల్కి దానిని పాడుచేశాను. నిత్యసూరులు ఇక దేనిని అనుసంధించి ఉజ్జీవించబోతారు? దీనికి ముందు ఏనాడూ పాడు కాని తిరునామం నా ఎంగిలి నోటిలో పడి బయటకు వచ్చిన తరువాత పాడయిపోయిందే! "నమో నారాయణాయ ఎన్ఱు పల్లాణ్డుమ్ పరమాత్మనై శూழ்న్దిరున్దేత్తువర్ పల్లాణ్డే" (తిరుప్పల్లాణ్డు-12) (పరమాత్మకు ప్రదక్షణం చేస్తూ, నమో నారాయణాయ అని అంటూ మంగళాశాసనాన్ని చేస్తారు) అని పల్లాణ్డు పాడేవారు ఇకపై దేనితో ఉజ్జీవిస్తారు! అయ్యో!

(పావియేన్ పిழைత్త వాఱెన్ఱు అఞ్జినేఱ్కు)- అనాది అయిన తిరునామాన్ని నేను పల్కడమే కాక, "నానుమ్ శొన్నేన్ నమరుమ్ ఉరైమిన్ నమో నారాయణమే" (పెరియ తిరు 6-10-10) (నమో నారాయణాయ అని నేను పలికాను, మీరుకూడా పలకండి) అని నావంటి మిగిలినవారినికూడ అనుసంధించమని పల్కి పాడుచేశానే! సత్త్వగుణాన్ని కలవాడొకడు రజోగుణం అతిశయించినపుడు అర్ధరాత్రిలో ఇంకొకని ఇంటికి నిప్పు పెట్టి, తిరిగి సత్త్వగుణం ఉద్బుద్ధం కాగానే అనుతపించేటట్లుగా, "పావియేన్ నాన్ తవఱు శెయ్తువిట్టేన్" (పాపిని నేను తప్పు చేసివేశానే) అని భయపడిన నాకు.

(అఞ్జలెన్ఱు) - 'మా శుచః" (శోకించవద్దు) (గీత-18-6) అని అర్జునునితో "నీకార్యం నీకు బాధ్యత కాదు. భయపడకు" అని పల్కినట్లుగా నాతోకూడా "భయపడకు" అని పలికారు.

(కావిపోల్వణ్ణర్ వన్దు) - నల్లకలువలవంటి రూపసౌందర్యాన్ని దర్శింపజేసి "మీరు నాదరి చేరనందువల్ల నాకు ఏ విధమైన కొఱత కలుగలేదు సుమా!" అని తన రూపసౌందర్యాన్ని చూపి "అయోగ్యుణ్ణి" అని తొలగిపోయే నా బాధకు మందు వేసి, సాంత్వనను కల్గించడానికి ప్రయత్నించాడు. అపుడుకూడా "ఈ రూపాన్ని నేను కన్నులతో చూచి పాడుచేయకూడదు"- అని నా కన్నులను మూసికొన్నాను.

(కణ్ణుళ్ళే తోన్ఱినారే) - అపుడు కూడా నన్ను విడువకుండా నా కన్నులలో దర్శనాన్ని అనుగ్రహించాడు. "వీరు కన్నులను మూసికొని చూడడం ఎప్పుడు జరుగుతుంది?" అని ఎదురు చూస్తూ ఉన్నవానివలె నా నేత్రాలలోపల దర్శనాన్ని అనుగ్రహించాడు.

దివ్యార్థదీపిక :- పరమపురుషుడైన భగవానుని చాలా అపవిత్రుడనైన నేను నా ఎంగిలి నోటితో సంకీర్తనం చేసి "అయ్యో! ఈ విధంగా అపచారపడ్డామే!"

అని భీతిల్లిన నా భయం తీరేటట్లు ఆస్వామి వచ్చి నా కన్నుల లోపల ప్రత్యక్షమై, అభయాన్ని ఇచ్చాడు- అని అంటున్నారు.

(ఆవియై) - "ఓరుయిరేయో ఉలకఙ్గట్కెల్లామ్" (లోకాలకు అన్నిటికి అద్వితీయమైన ప్రాణమా!) అనే రీతిలో లోకానికి అంతటికి ప్రాణభూతుడై ఉండేవాడు, భగవానుడు. ఇటువంటివానిని కదా నేను నా ఎంగిలి నోటితో పాడు చేశాను - అని భావం.

(అరఙ్గమాలై) -కంటికి కన్పించని రీతిలో ఉండే ప్రాణంవలె కాకుండా, అందఱికీ దర్శించే రీతిలో శ్రీరంగంలోని దివ్యాలయంలో దర్శనాన్ని అనుగ్రహించి ఆశ్రితులపట్లగల వ్యామోహమే మూర్తీభవించినట్లుండే భగవానునికదా నేను దూషించాను - అని భావం. దూషించడం అంటే- ఎంగిలి నోటితో స్తుతించడం. దానిని గూర్చి ప్రస్తావిస్తున్నారు- "అழுక్కుడమ్బెచ్చిల్ వాయాల్" అని అంటూ. కన్పించినవారి కాలిలో పడి శరీరం మలినమైనది. కనబడిన వారిని అంతా స్తుతించి నోరు ఎంగిలి అయినది. "అయ్యో! తప్పుగా వీటిని చేశానే!" అనే పశ్చాత్తాపం కూడాలేనందువల్ల "తూయ్మై *అల్లా* తొణ్డనేన్" (పవిత్రతను ఏమాత్రం లేనివాడను అయ్యాను) అయినాను. ఇటువంటి నేను ఈ మలినశరీరంలోని ఎంగిలి నోటితో-

(శొల్లినేన్ తొల్లైనామమ్) - "తొల్లైనామమ్" అనేది అనాదికాలంగా నిత్యసూరులు మొదలైనవారికి జీవనమై ఉండే తిరునామాలను - అని భావం. "పలువురు మహాత్ములకు ఉపయోగపడే వస్తువును అన్యాయంగా నేను నా నోటితో పాడుచేశానే! ఇక వారు ఏవిధంగా జీవించగలరు?"- అని నైచ్యానుసంధానరూపంగా పల్కిన తీరు ఇది.

అనాదికాలంగా నిత్యసూరులకు జీవనమై ఉండే నామాలను - "అழుక్కు డమ్బు ఎచ్చిల్ వాయాల్" నేను పల్కడం మాత్రమేనా! "నామమ్ శొన్నేన్ నమరుమురైమిన్" (నేను పలికాను, మీరూ పల్కండి) అని భక్తులచే కూడా అనుసంధింపజేసికదా పాడుచేశాను. "హా ! హా ! ఏమి అపచారాన్ని చేశాను! ఏమి అపచారాన్ని చేశాను! ఇక మనకు ఉజ్జీవించేమార్గం ఉన్నదా!" అని నేను భయపడిన సమయంలో "అழ్వార్లూ! భయపడవద్దు" అని రూపసౌందర్యాన్ని చూపి, మందు వేసి ఆశ్వాసం కల్గించాడు భగవానుడు- అని అంటున్నారు.

13. ఇరుమ్బనన్షుణ్డ నీరుమ్ పోతరుమ్ కొళ్క ఎన్దన్,
అరుమ్ పిణిపావమెల్లా మకన్దన ఎన్నై విట్టు,

చ్చురుమ్బుమర్ శోలై శూళ్న్ద అరఙ్గమా కోయిల్ కొణ్డ,
కరుమ్బినై క్కణ్డుకొణ్డు ఎన్ కణ్ణిణై కళిక్కుమాతే.

ఇరుమ్బు = ఇనుము, అనన్ఱు = బాగా కాగి, ఉణ్డ = పీల్చిన, నీరుమ్ = జలంకూడా, పోతరుమ్ = బయటకు వస్తుంది, కొళ్క = (దీనిని) స్థిరమని గ్రహించండి, ఎన్తన్ = నాయొక్క, అరుమ్ పిణి పావమ్ ఎల్లామ్ = (నేను) అనుభవించే తీరవలసిన దుష్కర్మలు, (వాటి ఫలమైన) దుఃఖాలు అన్నీ, ఎన్నై విట్టు = నన్ను విడచి, అకన్ఱన = దూరంగా పోయాయి, శురుమ్బు అమర్ శోలై = తుమ్మెదలు అమరి ఉండే ఉద్యానవనాలచే, శూళ్న్ద = పరివేష్టితమైన, అరఙ్గమా = శ్రీరంగమనే నగరాన్ని, కోయిల్ కొణ్డ = నిత్యవాసంగా పరిగ్రహించిన, కరుమ్బినై = చెఱకువలె మధురమైనవానిని, కణ్డుకొణ్డు = నిరంతరం దర్శించి, ఎన్ కణ్ ఇణై = నా రెండు కళ్ళు, కళిక్కుమాతే = ఏవిధంగా ఆనందిస్తున్నాయో!

వ్యా :- పతిన్ మూన్ఱామ్పాట్టు- (ఇరుమ్బు అనన్ఱుణ్డ నీరుమ్ పోతరుమ్ కొళ్క) అగ్నియాలే సంతప్తమాన ఇరుమ్బాలే పీతమాన జలముమ్ పోతరుమ్. ఎత్తాలే? ఎన్నిల్, (ఎన్తన్ అరుమ్ పిణి పావమెల్లామకన్ఱన ఎన్నై విట్టు) ఇరుమ్బుణ్డ నీర్ పోతర చ్చొల్లవేణుమో? నాన్ పణ్ణిన దుష్కర్మఙ్గళుమ్, తత్ఫలమాన దుఃఖఙ్గళుమన్ఱో ఎన్నై విట్టుప్పోయిన్ఱు! ఆత్మావుక్కు విరూపకధర్మమాన జ్ఞానానన్దఙ్గళోపాతి ఇతువుమ్ సహజమెన్నుమ్పడి పోన్ద ఇవైయుమన్ఱో ఎన్నై విట్టతు! ఎన్బోరుమానై అకలుకైయాల్ వన్ద వ్యసనముమ్ అకలుకైక్కు హేతుక్కళుమ్ పోయిన్ఱెన్నవుమామ్.

"అవై పోయిన్ఱాకిల్ నీర్ పిన్బు శెయ్‌తతెన్?" ఎన్నిల్ (శురుమ్బుమరిత్యాది) వణ్డుకళ్ పారున్ది యిరున్దుళ్ళ శోలైయాలే శూళప్పట్ట అరఙ్గమాకిఱ పెరియకోయిలై త్తనక్కు క్కోయిలాకక్కొణ్డ.

(కరుమ్బినై క్కణ్డు) ఇతు కణ్ణాలే తిన్నుమ్ కరుమ్బు. (ఎన్ కణ్ణిణై కళిక్కుమాతే) ఎవ్విషయఙ్గళై క్కణ్డుకళిత్త కణ్గళ్ ఎవ్విషయఙ్గళై క్కణ్డు కళిక్కిఱతు ? ప్రీతితత్త్వమ్ కనా క్కణ్డతియాత కణ్గకళ్ కిడీర్ ఇన్ఱు కళిక్కిఱతు.

అరు :- పతిన్ మూన్ఱామ్పాట్టు (ఇరుమ్బు) అనన్ఱు- కాయ్‌న్దు. అనలుకై- కాయ్‌కై. జలముమ్ పోరుమ్ - తమ్ముడైయ పాపత్తై పోక్కిన అఘటితఘటనా సామర్థ్యత్తాలే ఇరుమ్బుణ్డ జలముమ్ పుఱప్పడుమెన్ఱు, కొళ్క- ఉఙ్గళ్ మనస్సిలే కొళ్ళుఙ్గోళ్ - ఎన్ఱపడి. పాపమ్ పోనపోతే ఇరుమ్బుణ్డ జలమ్ వరుమ్ ఎన్నైక్కు జ్ఞాపకమేతు? ఎన్న; అరుళిచ్చెయ్‌కిఱార్ (ఆత్మావుక్కిత్యాది) "అరుమ్ పిణి"

ఎన్నైయాలే- సహజ మెన్నుమ్పడి స్వాభావికమాయ్ త్త్రోత్రుమెన్నపడి. ఎన్ కణ్ - విషయజ్గళై క్కణ్ణ కణ్ణెన్నుతల్; సన్తోషమ్ వ్యుత్పత్తి పణ్ణాత కణ్ణెన్నుతల్.

భావదీపిక-అవ : తమ అయోగ్యతను అనుసంధించి వెనుకకు తగ్గే స్థితి తొలగి తమ నేత్రాలు ఆనందించడాన్నిగూర్చి ఆళ్వార్లు ఇందులో పల్కుతున్నారు.

వ్యాఖ్యానం : (ఇరుమ్బు ఉణ్డ నీరుమ్ పోతరుమ్ కొళ్క) - అగ్నిచేత బాగా తప్తమైన ఇనుము పీల్చిన నీరు మళ్ళీ బయటకు వస్తుందనే సంగతిని అందఱు గ్రహించవచ్చు. ఇది ఏవిధంగా అంటే-

(ఎన్తన్ అరుమ్ పిణి పావమ్ ఎల్లామ్ అకన్ఱ ఎన్నై విట్టు) - నేను చేసిన పాపాలనే దుష్కర్మలు, వాటివల్ల కలిగే తీవ్రమైన బాధలనే దుఃఖాలు నన్ను విడచిపోయాయే! ఇది సంభవించినపుడు ఇనుము పీల్చిన నీరు మళ్ళీ ఎందుకు బయటకు రాకూడదు?

(ఎన్తన్ అరుమ్ పిణి పావమెల్లామ్) - ఆత్మకు స్వరూపాన్ని నిరూపించే ధర్మాలైన జ్ఞానానందాలవలె ఈ పాపాలు మొదలైనవి అనాదిగా నాతో పెనవేసికొని ఉన్నాయి. జ్ఞానానందాలవలె నా స్వరూపంలోకి అంతర్భవించాయా ఇవి! - అని భావించేటట్లున్న ఇవి కదా (పాపాలు- దుఃఖాలు) నన్ను విడచి వెళ్ళిపోయాయి!

(అరుమ్ పిణి పావమ్) - "అయోగ్యుణ్ణి" అని అనుసంధించి, భగవానుని విడచి తొలగిపోవడం పాపమని, దానివల్ల కల్గిన దుఃఖాన్ని "పిణి" అని అంటున్నట్లుగా భావించి, "అవి, వాటికి కారణాలు- అనే అన్నీ నన్ను విడచి తొలగిపోయాయి" అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. అవి తొలగిపోయాయి అంటే దానికి తరువాత మీరు చేసినది ఏమి ? అనే ప్రశ్నకు పాశురంలోని ఉత్తరార్ధం ద్వారా బదులిస్తున్నారు.

(కరుమ్బుమర్ శోలై శూళ్న్ద అరజ్గమాకోయిల్ కొణ్డ) - తుమ్మెదలు పొందికగా నిలచి ఉండే తోటలను చుట్టూ కల్గిన శ్రీరంగమనే పెరియకోయిల్‌ను తనకు నివాసంగా గ్రహించిన.

(కరుమ్బినై క్కణ్డుకొణ్డు) - ఇది కంటితో భుజించే చెఱకు.

(ఎన్కణ్ణిణై కళిక్కుమాఱే) - "పూర్వం ఎంతో నీచవిషయాలను చూచి ఆనందించిన నా కన్నులు ఇపుడు చాలా ఉన్నతమైన భగవద్విషయాన్ని దర్శించి ఆనందించాయి!" అని ఆశ్చర్యపడుతున్నారు- అని భావం. లేక, "ఆనందమనేది ఏమి! అని కలను కనికూడా తెలియని నా కన్నులుకదా ఈ నాడు అత్యంతం గొప్పదైన ఆనందాన్ని పొందాయి" అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు.

దివ్యార్థదీపిక :- తమను విడచి ఏనాడూ విశ్లేషించి ఉండని వ్యాధులు, పాపాలు అన్నీ తొలగి పోయిన ఆశ్చర్యంవల్ల "ఇరుమ్బువణ్ణ నీరుమ్ పోతరుమ్" అని అంటున్నారు. ఇనుము బాగా తప్తం చేయబడి, నీటిని పీల్చినట్లయితే, అది పీల్చిన నీరు అంతా ఇనుములో ఇంకి పోతుందే తప్ప, ఆ ఇనుమునుండి నీటిని బయటకు తెప్పించడం సాధ్యం కాదు - అనేది లోకానుభవసిద్ధమైనా, ఆ నీరు కూడా ఆ ఇనుమునుండి బయటకు వస్తుంది - అని నిశ్చయించవచ్చు. ఎందుకు? అంటే, తప్తమైన ఇమమువంటి నావద్దనుండి ప్రత్యేకంగా విడదీసి తొలగించవలసిన అక్కర లేనట్లుగా లోపలే ఇమిడి ఉండే అరుదైన వ్యాధులు, పాపాలు బహిర్గతమయ్యాయి కదా! అందువల్ల, ఈ రీతిలోనే అదికూడా సంభవించవచ్చు- అని అంటున్నారు.

"అరుమ్ పిణిపావమ్ ఎల్లామ్" (తొలగడానికి వీలు కాని వ్యాధులు, పాపాలు) తొలగి పోగానే, శ్రీరంగం దివ్యాలయంలో నిత్యసాన్నిధ్యాన్ని కల్గి వేంచేసి ఉండే పరమభోగ్యుడైన స్వామిని కళ్ళార దర్శించి, ఆనందించగలిగాను - అని అంటు న్నారు, ఉత్తరార్ధంలో. తగని విషయాలను చూచి ఆనందించిన నా కన్నులు ఇపుడు స్వరూపానురూపమైన విషయాన్ని దర్శించి ఆనందిచగల్గడం ఏమి భాగ్యం! అని ఆశ్చర్యపడుతున్నారు.

14. కావియై వెన్ఱ కణ్ణార్ కలవియే కరుతి నాళుమ్,
పావియేనాక ఎణ్ణి అతనుళ్ళే పళ్ళుత్తొళ్ళిన్దేన్,
తూవిశేరన్న మన్నుమ్ శూழ్ పునల్ కుడన్దైయానై,
ప్పావియేన్ పావియాతు పావియేనాయినేనే.

కావియై = నల్ల కలువలను, వెన్ఱ = జయించిన, కణ్ణాల్ = కన్నులను కల స్త్రీలతో, కలవియే = సంభోగాన్నే, కరుతి = భావించి, నాళుమ్ = అన్ని సమయాలలో (ప్రతిదినం), పావియేనాక ఎణ్ణి = గొప్ప పాపాలను చేయడానికే తలచి, అతనుళ్ళే= ఆ పాపపు పాడు గోతిలోనే, పళ్ళుత్తు ఒళ్ళిన్దేన్ = బాగా కూరుకొని మునిగిపోయాను, తూవి శేర్ = అందమైన రెక్కలను కల, అన్నమ్ మన్నుమ్ = హంసలు జంటలు వీడకుండా నిత్యవాసం చేసే, శూழ్ పునల్ = చుట్టూ జలప్రవాహాలతో కూడుకొన్న, కుడన్దైయానై = తిరుక్కుడన్దైలో శయనించి ఉండే అరావముదస్వామిని, పావి యేన్ = (గడచిన నాళ్ళలో వ్యర్థంగా గడపిన) పాపాన్ని చేసిన దాసుడనైన నన్ను, పావియాతు= భావించకుండా, పావియేన్ ఆయినేన్ = పాపులలో అగ్రేసరుడను అయ్యాను.

వ్యా :- పలినాలాప్పాట్టు - (కావియై యిత్యాది) కరుఞ్గువళైయై వెన్ఱ కణ్ణార్ కలవియే కరుతి. ఎప్పోతుమ్, "అవర్ తరుమ్ కలవియే కరుతి ఓడినేన్" ఎన్నుమ్పడియే అవర్కళ్ కలవియే కరుతి. "వినైయేనుడైయ వేదనై" ఎన్నుమ్పడియే అతుక్కు ఎతిరత్తాక ఇతైయే వినైత్తు.

(నాళుమ్ పావియేనాక వేణ్ణ్డి) అనాదికాలమ్ ఒరు సుకృతలేశముమ్ పణ్ణాత మహాపాపియాక మనోరథిత్తు. (అతనుళ్ళే పళ్ళుల్తాళ్ళ్వేన్) చక్రవర్తి పెణ్కొళ్ళిక్కుప్పై విళ్ళిలే పళ్ళుత్తాప్పోలవుమ్, ఆళ్ళ్వార్ "ఉనతు పాలే పోల్ శీరిల్ పళ్ళుత్తాళ్ళ్వాప్పో లవుమ్.

(తూవిశేరన్నమ్ మన్నుమ్) శిఱకైయుడైయ అన్నమ్ పిరియాతే వర్త్తిక్కిఱ దేశమ్. హంస పరమహంసర్ పిరియాతే వర్త్తిక్కిఱ దేశమ్.

(పావియేన్) వకుత్త విషయమ్ అసన్నిహితమాయ్ ఇళ్ళన్దేనో? "వాళా విరువ్వాళ్ళ్వేన్ కీళ్ళ్వాళ్కళెల్లామ్" ఎన్నుమ్, "పళ్ళుతే పల పకలుమ్ పోయిన వెన్ఱక్షే యళ్ళుతేన్" ఎన్నుమ్ శొల్లుమాపోలవుమ్ ఇళ్ళన్ద నాళైక్కు దుఃఖమ్ కొణ్డాడుకిఱార్.

(పావియాతు) వినైయాతు. (పావియేనాయినేన్) పావికళ్ ఎన్నుక్కు ప్పిఱ విరలానేన్. మున్పు పణ్ణిన పాపమితువానాల్ ఇతుక్కు మేలుమ్ ఫలిప్పతు ఇజ్గనే యిత్తే. తీయతుమ్ నల్లతుమ్ కార్యకారణభావత్తాలేయితే వరువతు.

అరు : పలినాలాప్పాట్టు -(కావియై) కరుఞ్గువళై- కరునెయ్తల్. (నాళుమ్) ఎన్ఱు- కీళ్ళుమ్ మేలుమ్ కూట్టువతు.

హంసమ్ "కుడిప్పిర్మైయిలన్నమ్" పెరియాళ్ళ్వార్ పోల్వార్. పరమహంసర్-నాథయామునర్పోల్వార్. శిఱు విరల్-మన్నుఱ ఎణ్ణప్పడుమవన్. వినైయావిట్టాల్ పావఫలమాక వేణుమో? వేతాన్తాకాతో? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్ (మున్పు పణ్ణినవిత్యాది) ఇతువానాల్- వినైయానై ఫలమానాల్. పాపియాకైయాలే వినైక్కవిల్లై-వినైయామైయాలే పాపియానేనెన్ఱపడి. ఇప్పడి ఒన్ఱే కార్యముమ్ కారణముమాక క్కూడుమో? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్ (తీయతు మిత్యాది).

భావదీపిక-అవ : చాలా గొప్పదైన ఆనందాన్ని పొందిన తాము అనాదికాలంగా దీనిని కోల్పోవడాన్నిగూర్చి తలచి గర్హిస్తున్నారు.

వ్యాఖ్యానం : (కావియై వెన్ఱ కణ్ణార్ కలవియే కరుతి) - నల్ల కలువల పూలను జయించిన కన్నులను కల వనితలతో అల్పానందాన్ని అనుభవించాలనే తలచి.

(వాళుమ్) - ఎల్లప్పుడు. దీనికి (ఈ పదాన్ని)ముందు, వెనుకలలో అన్వయించాలి.

(వాళుమ్ కలవియే కరుది) - "అవర్ తరుమ్ కలవియే కరుతి ఓడినేన్" (పెరియ తిరు-1-1-1) (అందమైన స్త్రీలు కలిగించే సంగమాన్ని గూర్చి భావించి పరుగులు పెట్టాను) అనే రీతిలో వారు ఇచ్చే ఆల్వానందాన్నే భావించి. "విసైత్తిరున్దే శిరమమ్ తీర్న్దేన్" (పెరియాళ్వార్ తిరు-5-4-8) అని భగవద్విషయాన్నే భావించ వలసినవాడను దానికి పూర్తివిరుద్ధంగా దీనినే తలచి.

(వాళుమ్ పాదయేవాక ఎణ్ణి) - అనాదికాలంగా ఏ సత్కార్యాన్ని చేయుని మహాపాపిని కావడానికి మనస్సులో ప్రయత్నించి.

(అతనుళ్ళే పళుత్తొళిన్దేన్) - ఆ పాపాలలోనే మునిగి ముదిరి పండి పోయాను. దశరథచక్రవర్తి శ్వేతచ్ఛత్రచ్ఛాయలో ఉండి చిరకాలం పాలించి, తలనెరసి నట్లు, నమ్మాళ్వార్లు "ఉనతు పాలేపోల్ శీరిల్ పళుత్తొళిన్దేన్" (పెరియ తిరువన్దాది-58) (నీ, పాలవలె భోగ్యాలైన కల్యాణగుణాలలో పండిపోయాను) అని పల్కినట్లు, ఈ మహాపాపం చేయడంకోసమైన ప్రయత్నంలోనే పరిణతిని పొందాను.

(తూవి శేర్ అన్నమ్ మన్నుమ్) - అందమైన రెక్కలను కల హంసలు ఏనాడూ విడువకుండా ఎల్లప్పుడు నివసించే దివ్యదేశం. "కుడిచ్చీర్‌మైయిలన్నఙ్గళే" (తిరు విరు-29) అనే రీతిలో, స్వాపదేశంలో "అన్నమ్" అనే ఈ పదం పరమశుద్ధులైన పెరియాళ్వార్లవంటివారిని సూచిస్తుంది.

(శూళ్ పునల్ కుడన్దైయానై ప్పావియేనై) - స్వరూపానికి తగిన భగవద్విషయానికి సమీపంలో లేనందువల్ల కోల్పోయానా ? కావేరీనదియొక్క పలు పాయలు చుట్టి ఉండే తిరుక్కుడన్దై సమీపంలో ఉండికదా కోల్పోయాను! ఇది నేను చేసిన పాపంయొక్క ఫలంకదా! "వాళా విరున్దొళిన్దేన్ కీళ్ నాళ్‌కళెల్లామ్" (పెరియ తిరువన్దాది-82) (గడచిన దినాలన్నింటిని వ్యర్థంగా గడిపాను) "పళుతే పల పకలుమ్ పోయిన వెన్ఱు అఞ్జి అళుతేన్" (ముదల్ తిరు-16) (వ్యర్థంగా పలుదినాలు గడచిపోయాయే! అయ్యో! అని భయపడి రోదించాను) అని మిగిలిన ఆళ్వార్లవలె కోల్పోయినవాళ్ళ కోసం బాధపడుతున్నారు.

(పావియాతు) - తిరుక్కుడన్దైలో నిదురించే ఆరావముదస్వామిని భావించకుండా.

(పావియేన్ ఆయినేన్) - పాపులను లెక్కించడం ఆరంభిస్తే చిటికెన వేలితో మొదట లెక్కించవలసినట్లుగా పాపులలో మొదటివాడనయ్యాను.

(పావియేన్ పావియాతు పావియేనాయినేనే) - గొప్ప పాపాన్ని చేసినందువల్ల ఆరావముదన్‌ను భావించకుండా తత్ఫలంగా ఇంకా ఇంకా పాపాలను చేశాను. పుణ్యాలు ఇంకా ఇంకా పుణ్యాలను వృద్ధి చేసేవిగాను, పాపాలు ఇంకా ఇంకా పాపాలను వృద్ధి చేసేవిగాను ఉన్నందువల్ల "పావియేన్ పావియేనాయినేనే" అని అంటున్నారు.

దివ్యార్థదీపిక :- గడచిన పాశురంలో "కరుమ్బినై క్కణ్డుకొణ్డు ఎన్ కణ్ణిణై కళిక్కుమాఱే" అని ఆనందపరవశులై పల్కిన ఆళ్వార్లు "అయ్యో ! "పழுతే పలపకలుమ్ పోయిన" (వ్యర్థంగా పలు దినాలు గడచిపోయాయే) అని బాధపడి, "కీழ் నాళ్‌కళెల్లామ్ వాళా విరున్దొழிన్దేన్" (గడచిన దినాలను అన్నిటినీ వ్యర్థంగా వెళ్ళబుచ్చానే), "పావియానేన్" అని తలపై మోదు కొంటున్నారు.

"కరియవాకి పుడై పరన్దు మిళిర్న్దు శెవ్వరి యోడు, నీణ్డ అప్పెరియవాయ కణ్‌గళ్ ఎన్నై ప్పేదమై శెయ్‌దనవే" (నల్లనివై, బాగా విస్తరించి, మెఱిసి ఎఱ్ఱని రేఖలను చివరలో కల్గినవై, ఆకర్ణాంతాలైన ఆ పెద్ద కన్నులు) అని అభినివేశాన్ని పొందవలసిన తిరునేత్రాలను విడచిపెట్టి, చీకిరి కళ్ళను కల స్త్రీలను నల్ల కలువలను మించిన కళ్ళను కలవారిగా భ్రమించి వారితో కలసి ఉజ్జీవించడమే పరమ పురుషార్థంగా భావించి, సుకృతలేశం అయినా చేయని మహాపాపిని కావడంకోసమే దారిని వెదకి, దశరథచక్రవర్తి శ్వేతచ్ఛత్రం నీడలో పండిపోయినట్లు, నమ్మాళ్వార్లు "ఉనతు పాలేపోల్ శీరిల్ పழுత్తొழிన్దేన్" (పాలవంటి నీ కల్యాణగుణాలలో బాగా పండిపోయాను) అని భగవద్గుణాలలో పండిపోయినట్లు) ఆ పాపాలలోనే నేను పండిపోయాను. పరమభోగ్యమైన తిరుక్కుడన్దై నగరంలో నిద్రిస్తున్న ఆరావ ముదాళ్వార్‌ను కొంచెం అయినా మనస్సులో భావించినవాడనయితే పాపాలను పోగొట్టుకొని ఉండేవాడను. దానిని చేయనందువల్లకదా పాపిని అయ్యాను" అని అంటున్నారు.

(కావి) - నల్లకలువపూవు. లౌకిక విషయాలలో విరక్తులైన వీరు (ఆళ్వార్లు) "కావియై వెన్ఱ కణ్ణార్" అనే ప్రయోగంలో స్త్రీలను నిర్దేశించడం తగునా? అని అడగవద్దు. వారి సంగమాన్ని కోరిన కాలంలోని భావనను అనువాదం చేసిన తీరు ఇది. లేక, వ్యతిరేక లక్షణాప్రయోగం కావచ్చు. కవిసమయానికి తగినట్లుగా, లోకంలో ప్రయోగించే మాటలతో నిర్దేశించినట్లుగాకూడా చెప్పవచ్చు.

(తూవిశేరన్న మన్నుమ్ కుడన్దై) - జ్ఞానం, అనుష్ఠానం -అనే రెండు ఱెక్కలను కల "హంసలు, పరమహంసలు" అనే రీతిలోని మహాత్ములు నివసించే చోటు- అనే స్వాపదేశార్థాన్ని ఇక్కడ తెలుపుతారు.

15. మున్ పాలా ఇరావణన్దన్ ముదుమతిళ్ ఇలజ్జై వేవిత్తు,
అన్బినాల్ అనుమన్ వన్దు ఆజ్ఞడియిణై పణియ నిన్ఱార్క్కు,
ఎన్బెలా మురుకి యుక్కిట్టు ఎన్నుడై నెఞ్జమెన్నుమ్,
అన్బినాల్ ఞాననీర్ కొణ్డు ఆట్టువనడియనేనే.

మున్ = పూర్వకాలంలో, పాలా = క్రూరుడైన, ఇరావణన్‌తన్ = రావణుని యొక్క, ముదు మదిళ్ = మిక్కిలి బలిష్ఠమైన కోటలను కల, ఇలజ్జై = లంకను, వేవిత్తు = దగ్ధం వేసి, అనుమన్ =హనుమానుడు, అన్బినాల్ = సీతాదేవిని చూచిన ఆనందంతో, వన్దు = వచ్చి, అజ్ఞ = ఆ ఋశ్యమూకపర్వతంపై, అడి యిణై = తమ శ్రీచరణాలను, పణియ నిన్ఱార్క్కు = సేవించేటట్లు వేంచేసి ఉండే శ్రీరామచంద్రునకు, ఎన్బు ఎలామ్ ఉరుకి = ఎముకలు మొత్తం కఱిగిపోయి, ఉక్కిట్టు = శిథిలమై, ఎన్నుడై = నాయొక్క, నెఞ్జమ్ ఎన్నుమ్ = మనస్సు అనే, అన్బినాల్ = ప్రేమతో, ఞాన నీర్ కొణ్డు = జ్ఞానమనే తిరుమంజన తీర్థంతో, అడియనేన్ = దాసుడనైన నేను, ఆట్టువన్ = తిరుమంజనం చేయిస్తాను.

అవ : పతినఞ్జామ్పాట్టు :- (మున్‌పాలా ఇత్యాది) మున్బుత్తై ఇఴ్రవెల్లామ్ తీర నీరాట్టుకిఱార్.

వ్యా :- (మున్ పాలా ఇత్యాది) అతువు మొరుకాలమే! ఎన్డు వయిఱు పిడిక్కిఱార్. శ్రీరామాయణత్తిల్ పేశిన పరప్పు ఎల్లామ్ ఒరు వార్తైయాలే శొల్లుకిఱార్. ఏకద్రవ్యత్తై భిన్నమాక్కినాఱ్పోలే తాయైయుమ్ తమప్పనైయుమ్ పిరిత్త పైయల్. (ముదు మతిళ్) వలియ మదిళ్. (ఇలజ్జై వేవిత్తు) తిరువడివాలిల్ నెరుప్పాలే శుడువిత్తు. నెరుప్పుమ్ కాఱ్ఱుమ్ కూడినాఱ్పోలేయిఱే వాయుపుత్రన్ వాలిల్ నెరుప్పు. (అన్బినాలనుమన్ వన్దు) కాలాలన్నుపోలే, అవశనమ్ దీక్షిత్తుమ్, కడల్ కడన్దుమ్, యుద్ధమ్ పణ్ణియుమ్, ఇళైత్తిరుక్కచ్చెయ్‌తేయుమ్ పిరాట్టియై త్తిరువడి తొఴుతు, "దృష్టా సీతా" ఎన్డు పెరియప్రీతియోడేయిఱే వన్దతు. (అజ్ఞడియిణై పణియ నిన్ఱార్క్కు) పిరాట్టివృత్తాన్తమ్ కేట్టు స్తబ్ధరాయ్ నిన్ఱవర్క్కు.

(ఎన్బెలా మురుకి యుక్కిట్టు) అన్నిలైయై నినైత్తు శిథిలరావపడి. (ఎన్నుడై నెఞ్జమెన్నుమ్ అన్బినాలిత్యాది) ఎన్నెఞ్జిలే యుణ్డాన అన్బన్డు. నెఞ్జెన్డు పేరాయ్ భగవత్ప్రేమమే వడివాయిరుక్కిఱ అన్బాలే జ్ఞానమాకిఱ తిరుమఞ్జనత్తాలే నీరాట్టువన్. అమ్బుడనే కూడివ నీర్; అన్నీరుక్కు సంసారమిఱే అన్బు. (అడియనేనే) అజ్జుత్తైక్కు యోగ్యరావతు అడియారానాప్పోలే కాణుమ్.

అరు :- పలినైన్దామ్పాట్టు - (మున్ పాలా) వాలిలే కొళుత్తినాల్. ఇలజ్జై వేకవేణుమో? ఎన్న; అరుళిచ్చెయ్‌కిఱార్ (పెరుప్పుమ్ కారుణ్యమిత్యాది). ఎన్ను-ఎలుమ్బు - శేషశేషిముఱైయిలే అడిమై శెయ్‌కై.

భావదీపిక-అవ : పూర్వం శ్రీరామావతార కాలంలో స్వామి పడిన శ్రమ అంతా తీరే టట్లుగా స్వామికి తిరుమంజనం చేయిస్తున్నారు.

వ్యాఖ్యానం :- (మున్ పాలా ఇరావణన్) - "భగవానుడు ఈ లోకంలో జన్మించి, మానవులుగా పడరాని పాట్లు పడిన ఆ కాలంకూడా ఒక కాలమా!" అని తమ కడుపును పట్టుకొంటున్నారు (బాధను అనుభవిస్తున్నారు) "వన్‌తాళిన్ వణజ్గి" (పెరుమాళ్ తిరు-9) అనే దశకంలో కులశేఖరప్పెరుమాళ్ పడిన బాధ అంతా ఈ ఒక్క పాశురంలో వీరు కూడా అనుభవిస్తున్నారు. శ్రీరామాయణంలో 24,000 శ్లోకాలలో చెప్పబడ్డ విషయాలను అన్నిటినీ ఈ పాశురంలోని సూక్తితో సంగ్రహిస్తున్నారు.

(పాలా ఇరావణన్) - ఒకే ద్రవ్యాన్ని రెండుగా విడదీసినట్లు, తల్లిని తండ్రిని రెండుగా విడదీసిన నీచుడు కనుక "పాలా" అని అంటున్నారు.

(ముదు మదిళ్) - బలిమిని, దార్ఢ్యాన్ని మిక్కిలిగా కల కోటలను కల్గినది లంక.

(ఇలజ్జై వేవిత్తు) - హనుమానుని తోకలోని నిప్పుతో లంకను దగ్ధం చేసి - అని భావం. వాయుపుత్రుడైన హనుమంతుని తోకలో నిప్పును అంటించినందువల్ల అది నిప్పు, గాలి కలసినట్లుగా, లంకను చుట్టిముట్టి దగ్ధం చేసింది.

(అన్నివాల్ అనుమన్ వన్దు) - హనుమానుడు సీతాదేవివద్దకు దూతగా పోయి వచ్చినది కాళ్ళతో కాదు; ప్రేమతో - అని అంటున్నారు. సీతాదేవిని చూడ లేనందువల్ల ఉపవాసంతో ఉండి, సముద్రాన్ని దాటి, రాక్షసులతో యుద్ధం చేసి, చాలా అలసి పోయినా, సీతాదేవికి హనుమానుడు నమస్కరించి "సోఽభిగమ్య మహాత్మానం కృత్వా రామం ప్రదక్షిణమ్, న్యవేదయదమేయాత్మా దృష్టా సీతేతి తత్త్వతః" (రామా-బాల-1-78) (మహాపురుషుడైన శ్రీరాముని చేరి ప్రదక్షిణం చేసి, ఇంత అని పరిచ్ఛేదించలేని మాహాత్మ్యాన్ని కల హనుమంతుడు "సీతను చూచాను" అని యథాతథంగా విన్నపించాడు) అనే వార్తను చెప్పేటట్లుగా గొప్ప ప్రేమతోకదా హనుమానుడు దూతగా వచ్చాడు.

(అఙ్గు అడియుర్రై పణియ విన్దార్క్కు) - సీతాదేవినిగూర్చిన వార్తను పాదాలను సేవించి హనుమానుడు విన్నపించగా విని, ఒడలు మఱచి ఉండే శ్రీరామునకు- అని భావం.

(ఎన్బెలామ్ ఉరుకి ఉక్కిట్టు) - శ్రీరాముడుండే ఆ స్థితిని తలచి, ఆళ్వార్ల ఎముకలు అన్నీ కఱగిపోయి, శిథిలమయ్యాయి.

(ఎన్నుడై నెఞ్జమెన్నుమ్ అన్బినాల్ ఞాననీర్ కొణ్డు ఆట్టువన్) - నా మనస్సులో ఉండే ప్రేమ- అని అనడంలేదు. నా మనస్సు అనే అన్బు -అని అంటున్నాడు. నా మనస్సు అనేది పేరు మాత్రమే. భగవానునిపట్ల ప్రేమే రూపుదిద్దుకొన్న నా మనస్సుతో జ్ఞానమనే తిరుమంజన తీర్థంతో తిరుమంజనం చేస్తాను - అని భావం. ఇక్కడ జ్ఞానం అని అనబడేది "భగవానుడు శేషి నేను శేషభూతుడను" అనే జ్ఞానం.

(అన్బినాల్ ఞానవీర్) - ప్రేమతో కూడిన నీరు. తిరుమంజన తీర్థానికి చేర్చే ఏలకులు, లంవగాలు, పచ్చకర్పూరం మొదలైన సంస్కారాలవంటిది ఞానజలానికి ప్రేమ.

(అడియనేనే) - దాసుడనైన నేను. భగవానునకు తిరుమంజనం మొదలైన కైంకర్యాలను చేయడానికి యోగ్యతను ఇచ్చేది దాసుడు కావడమే- అనే విషయాన్ని తెలుపుతున్నారు. తిరుమఙ్గైయాళ్వార్ల "వెణ్ణై యళైన్ద కుణుఙ్గు" (పెరియాళ్వార్ తిరు-2-4) ఈ పాశురం. భగవానుని తిరుమంజన సమయంలో సేవించే పాశురం ఇది.

దివ్యార్థదీపిక :- భగవానునకు అభిషేకం చేయించడం, పూలు అలంక రించడం (నీరాట్టమ్, పూచ్చూట్టల్) మొదలైన కైంకర్యాలతో సాక్షాత్తుగా ఆవందింపజేసి సంతోషించింది యశోదామాత. ఆమె చేసిన రీతులను అనుసరిస్తూ పల్కి ఆనందించారు పెరియాళ్వార్లు. ఈ ఆళ్వార్లు ఆ విధంగా కూడా కొన్ని సేవలను ఆచరించాలి - అని ఆశపడి మానసికంగానే అభిషేకం చేయించడం, పూవులను అలంకరించడం చేసి ఆనందిస్తున్నారు- ఈ పాశురంలోను. అనంతర పాశురం లోను.

భగవానుడు పరమసంతోషంగా వేంచేసి ఉండే ఒక సమయవిశేషాన్ని గూర్చి ప్రస్తావించి, ఆ స్థితిలో అభిషేకం స్వీకరించేటట్లు చేస్తాను - అని అంటున్నారు. సీతాదేవి ఉన్న చోటును వెదకి తెలిసికొని రమ్మని శ్రీరామునిచేత ఆజ్ఞాపింపబడి పంపబడిన వానరవీరులలో ప్రధానుడైన శిఱియతిరువడి లంకకు వచ్చి చూచి,

ఆ సీత చేతిలో "ఇత్తక్కైయాలడైయాళమీదవన్ కైమోదిరమే" అని శ్రీరామ నామాంకితమైన ఉంగరాన్ని ఇచ్చి, చూడామణిని గ్రహించి, "శత్రువుల బలం ఎంతటిది ?" అని శ్రీరాముడు అడిగితే "అది నాకు తెలియదు" అని చెప్పకూడదు కనుక, దానిని తెలిసికొనిపోవాలి- అని భావించి అందుకోసం కొన్ని పనులను చేసి, తన తోకలోని నిప్పుతో లంకను దహించి, "చూచాను సీతను" అని తిరిగివచ్చి విన్నపించినపుడు, ఆనందసముద్రంలో మునిగిపోయిన శ్రీరామునకు, ఆ సన్నివేశాన్ని తలచి అభినివిష్టుడైన శ్రీరాముని విషయంగా ప్రేమయే నామనస్సు రూపాన్ని పొందినందువల్ల, నా మనస్సు అనే ప్రేమతో జ్ఞానమనే తిరుమంజన తీర్థంతో తిరుమంజనం చేయిస్తాను- అని అంటున్నారు. తీర్థానికి పరిమళద్రవ్యాలు సంస్కారాన్ని కల్గించేటట్లే, ఇక్కడ జ్ఞానతీర్థానికి ప్రేమ సంస్కారంగా గ్రహింప బడింది. ఇందువల్ల మానసికం అయిన తిరుమంజనాన్ని చెప్పి నట్లయినది.

**(మున్)** - "అదికూడా ఒక కాలమేనా!" అని కడుపును పట్టుకొంటున్నారు. "అతువు మొరుకాలమే ఎన్ఱు వయిఱు పిడిక్కిఱార్" అనే వ్యాఖ్యాన శ్రీసూక్తిని గ్రహించాలి.

**(పొలా)** - "పొల్లా" అని అర్థం. "తొకుత్తల్ వికారమ్" రాగా "పొల్లా" అనే పదం "పొలా" అనే రూపాన్ని పొందింది. "శురికుళ్గల్ కనివాయ్ త్తిరువినై ప్పిరిత్త క్కొడుమైయిఱ్కడువిశై యరక్కన్" (గుండ్రని ముంగురులను కల, దొండపండు వంటి అధరాన్ని కల సీతాదేవిని విడదీసిన, కాఠిన్యంలో అధికుడైన రాక్షసుడు) కనుక "దుష్టుడు" అని సాధారణంగా చెప్పవచ్చు తప్ప, వివరించి పలుకడం సాధ్యం కాదు - అని భావం.

16. మాయ మాన్ మాయ చ్చెర్ఱు మరుతిఱ వడన్దు,
వైయమ్ తాయమా పరవై పొఙ్గ త్తడవర్రై తిరిత్తు, వానోర్క్కు
ఈయుమాల్ ఎమ్బిరానార్క్కు ఎన్నుడై చ్చొల్లాళెన్నుమ్,
తూయ మామాలై కొణ్డు శూట్టువన్ తొణ్డనేనే.

మాయ మాన్ = వంచనను కల (మారీచుడనే) మృగం, మాయ శెర్ఱు = పూర్తిగా నశించేటట్లుగా వధించి, మరుతు =మద్దిచెట్లు, ఇఱ నడన్దు = విఱిగి పడేటట్లు వాటిమధ్య దోగాడుతూ పోయి, వైయమ్ తాయ్ = భూమిని స్పృశించి కొలిచి, ఆ మా పరవై పొఙ్గ = ఆ గొప్ప మందర పర్వతాన్ని, తిరిత్తు = భ్రమించేటట్లు చేసి, వానోర్క్కు ఈయుమ్ =దేవతలకు (అమృతాన్ని) ఇచ్చే, మాల్ ఎమ్బిరా నార్క్కు= ప్రేమను కలవాడై నాకు ఉపకరించే స్వామికి, తొణ్డనేన్ = దాసుడనైన

నేను, ఎన్నుడై = నాయొక్క, శొల్కళ్ ఎన్నుమ్ = వాక్కులు అనే, తూయ = పవిత్రమైన, మా మాలై = గొప్ప మాలికను, కొణ్డు = తీసికొని, అట్టువన్ = తిరుమంజనం చేయిస్తాను.

అవ :- పతివాఱామ్పాట్టు. మాయమానిత్యాది. కీళ్ప్పాట్టిలే తిరుమఞ్జనమ్ పణ్ణి ఇప్పాట్టిలే తిరుమాలై శాత్తుకిఱార్.

వ్యా :- (మాయమాన్) "పాలా విరావణన్" ఎన్నతుక్కడియాన జన్తువిశేషమితే. (మాయ చ్చెత్తు) మున్పుపోలే తొత్తమ్పాక విడాతే పిణత్తైయుమ్ మాయ్‌త్తు. (మరుతిఱ నడన్దు) "అడల్ శేరిత్తై మరుతిత్తు వీళ్ నడై కత్తి" పనితే. తళర్‌నడై యిడుకిఱపోతే "ఒన్నార్ తళర" అడియిట్టపడి. (నైయుమ్ తాయ్) మున్పుత్తైయతు వళర్న్ద పిన్పు పణ్ణిన వ్యాపారమ్, నడువు తవళ్గుకిఱపోతై వ్యాపారమ్; ఇతు పిఱన్ద అన్తే పణ్ణిన వ్యాపారమితే. భూమియై అనాయాసేన అళన్దుకొణ్డు. (అమ్మా పరనై పాజ్గ) అప్పెరియకడల్ తయిర్తాళి పట్టతు పడ. (తడవరై తిరిత్తు) కడలై క్కణ్ శెటియిట్టాప్పోలేయాన మలైయై, పిళ్ళైకళ్ శిఱు తురుమ్పై త్తిరిక్కుమాపోలే తిరిత్తు.

(వానోర్‌క్కోయుమాల్) ఉడమ్పు నోవ క్కడల్ కడైన్దు కొడుత్తతు ప్రయోజనాన్తరపరర్క్కు. (మాల్) పిచ్చేతినవర్‌కళ్ ఎణ్ణియ్కుతే శెయ్‌వతు. (ఎమ్పిరానార్క్కు) ఎనక్కు ఉపకారకరానవర్క్కు. (ఎన్నుడై యిత్యాది) దేవజాతికళ్ శొల్ పోలన్ఱిక్కే. ప్రయోజననిరపేక్షమాన శొల్కళాకిఱ శెవ్వి అళ్ళియాత మాలైయై క్కొణ్డు. (శూట్టువన్ తొణ్డనేనే) ఇత్తాలల్లతు శెల్లాత చపలన్; అనసూయై పిరాట్టిక్కు చ్చాట్టినాప్పోలే.

అరు :- పతినాఱామ్పాట్టు. (మాయమాన్) పిణముమ్ కాణాతపడి నశిప్పిత్తు.

భావదీపిక-అవ : గడచిన పాశురంలో తిరుమంజనాన్ని చేసి ఈ పాశురంలో భగవానునకు పూలమాలికలను సమర్పిస్తున్నారు. తిరుమజ్జైయాళ్వార్లు "ఆనిరై మేయ్‌క్కై" (పెరియాళ్వార్ తిరు-2-7) ఈ పాశురం.

వ్యాఖ్యానం : (మాయమాన్) - వంచనను కల మారీచుడనే మృగం. 'పాలా ఇరావణన్' (15) అని చెప్పబడేవానికికూడా మూలకారణమై ఉండి, సహాయపడిన జంతువుకదా!

(మాయ చ్చెత్తు) - పూర్తిగా నశించేటట్లు సంహరించి - అని భావం. విశ్వామిత్రయాగసమయంలోవలె బాణాలు నాటుకొన్న శరీరంతో విడువకుండా. శవంకూడా కానరాని రీతిలో సంహరించి.

(మరుతిఱ నడన్దు) - "అడల్ శేర్ ఇణైమరుతిఱ్ఱు వీழ వడై కఱ్ఱు తెఱ్ఱల్ విన్నై పఱ్ఱఱుక్కుమ్ ఎతియే" (పెరియ తిరు-11-4-9) (మిక్కిలి దృఢమైన మద్దిచెట్ల జంట భగ్నమై కిందపడేటట్లు దోగాడిన తేటనైన జ్ఞానాన్ని కల చిన్న బాలుడైన శ్రీకృష్ణుడు మన పాపాలను తీరుస్తాడు. ఇది నిశ్చయం.) అని వీరు అనుగ్రహించిన రీతిలో మద్దిచెట్ల రూపంలో వచ్చిన ఆకారం విఱిగి పడేటట్లుగా నడకను నేర్చినవాడు కదా ఇతడు. "ఒన్నార్ తళర తళర్నడై నడన్దతనై" (పెరియా. తిరు. 1-7-11) (శత్రువులు భయపడేటట్లు బుడిబుడి నడకలు నడచినవాడు) అని పెరియాళ్వార్లు అనుగ్రహించిన రీతిలో బుడిబుడి నడకల పరువంలోనే విరోధులైన అసురులు నశించేట్లుగాకదా శ్రీపాదాలను మోపాడు.

(వైయమ్ తాయ్) - "మామాయన్ మాయ చ్చెఱ్ఱు"- పెరిగిన తరువాత చేసిన లీల ఇది. మద్దిచెట్లు విఱిగిపడేటట్లు నడచినది (ఎపుడు? అంటే) దోగాడే టపుడు చేసిన లీల. త్రివిక్రముడై భూమిని కొలిచినది, త్రివిక్రముడై అవతరించి నపుడే చేసిన లీలకదా. "తాయ్" - తడవి (అని అర్థం) భూమిని అవలీలగా కొలువడాన్ని ఈ పదం తెలుపుతున్నది.

(అమ్మా పరప్పై పొఙ్గ) - మిక్కిలి పెద్దదైన ఆ పాలకడలి పొంగేటట్లుగా- అని భావం. ఆ పెద్దసముద్రం పెరుగుబాన పడే పాట్లను పడేటట్లుగా.

(తడవరై తిరిత్తు) - పెద్ద పర్వతాన్ని తిరిగేటట్లు చేసి. సముద్రాన్నే ఆవరించేటట్లుగా ఉండే పర్వతాన్ని. చిన్న పిల్లలు చిన్న గడ్డితునకను తిప్పినటట్లుగా తిరిగేటట్లు చేసి.

(వానోర్క్కు ఈయుమ్ ఆల్) - వేయిబాహువులతో అలలను కల సముద్రాన్ని చిలికి, శరీరం నొప్పి పుట్టేటట్లు దేవకార్యాన్ని సాధించి, అమృతాన్ని అనుగ్రహించిన ప్రేమను కలవాడు. ఇంతటి పాటుపడి తనవద్ద అన్యఫలాలను ఆశించినవారైన దేవతలకోసం కార్యాన్ని చేశాడు. దానికి కారణం- భక్తులపట్ల ఇతనికి కల వ్యామోహం.

(మాల్) - వ్యామోహాన్ని పొందినవారు ఆలోచించి కార్యాన్ని చేయరు కదా!

(ఎమ్పిరానార్క్కు) - ఇటువంటివాడు నాకు తననే అనుగ్రహించి ఉపక రించాడు.

(ఎన్నుడై చ్చొల్క్కళెన్నుమ్ తూయ మామాలై కొణ్డు శూట్టువన్) - ఒక పనికోసం అతనికి దాసులైన దేవతలవలె కాకుండా ఏ ప్రయోజనాన్ని ఆశించని నా

పల్కుకలు అనే మిక్కిలి పవిత్రమైన, గొప్పదైన అపుడే వికసించిన పూవులవంటి పాశురంతో కూర్చిన మాలికలతో అలంకరిస్తాను.

(తొణ్డనేవ్) - ఈ మాలను అలంకరిస్తే తప్ప ధరించ లేని చాపల్యాన్ని కలవాడు. అత్రిమహర్షి పత్ని అయిన అనసూయ సీతాదేవియొక్క గొప్పతనాన్ని, అందాన్ని చూచి, మాలికను అలంకరిస్తే తప్ప నిలువలేక, సీతాదేవికి మాలను అలంకరించేటట్లు, వీరుకూడా భగవానునకు అలంకరిస్తున్నారు.

దివ్యార్థదీపిక :- గడచిన పాశురంలో తిరుమంజనాన్ని చేశారు. ఈ పాశురంలో పూమాలను అలంకరిస్తున్నారు. పూర్వపాదాలలో భగవానుని నాల్గు అవతారాలను సూచిస్తున్నారు. "మామాయన్ మాయ చ్చెర్ఱు" అని అన్నందువల్ల శ్రీరామావతారం; "మరుతిఱ వడన్దు" అని అన్నందువల్ల శ్రీకృష్ణావతారం; "వైయమ్ తాయ్" అని అన్నందువల్ల త్రివిక్రమావతారం; "అమ్మా పరవై పొఙ్గ త్తడవరై తిరిత్తు వానోర్క్కీయుమ్" అని అన్నందువల్ల కూర్మావతారం.

"పూర్వం విశ్వామిత్రుని యాగంలో మారీచుని ప్రాణాలను హరించి ఉండి ఉండాలి. అపుడు విడిచి పెట్టినందువల్లకదా ఇపుడు ఈ అనర్థం సంభవించింది" అని భావించి అతని ప్రాణాలు తీసివేశాడు.

(మరతిఱ వడన్దు) - శ్రీకృష్ణుడు బాలుడై ఉన్న సమయంలో, కష్టాలను కల్గించే పలు చేష్టలను (అతడు) చేయడాన్ని చూచి కోపించిన యశోద శ్రీకృష్ణుని నడుములో దారంతో కట్టి ఒక రోలుకు బంధించగా, శ్రీకృష్ణుడు ఆ రోలును ఈడ్చుకొంటూ దోగాడుతూ పోయి అక్కడ ఉండే మద్దిచెట్ల జంటమధ్యలోకి వెళ్ళినపుడు, ఆ రోలు అడ్డుపడగా, దానిని బలంగా లాగినందువల్ల, ఆ చెట్లు రెండు విఱిగి పడిపోగా, పూర్వం నారదుని శాపంవల్ల ఆ మద్దిచెట్ల రూపంలో పడి ఉన్న నలకూబరుడు, మణిగ్రీవుడు - అనే ఇద్దరు కుబేరపుత్రుల శాపం తీరి వెళ్ళిపోయారు. ఈ కుబేరపుత్రులు పూర్వం ఒకానొక సమయలో పలువురు అప్సరస స్త్రీలతో దిగంబరులై జలక్రీడను ఆడేటపుడు అక్కడికి నారదమహర్షి వచ్చాడు. ఆ అప్సరస్త్రీలు అందరు లజ్జతో వస్త్రాలను ధరించి అక్కడనుండి తొలగిపోగా, ఈ కుబేరపుత్రులు మాత్రం మధుపానమైకంవల్ల, వస్త్రవిహీనులై ఉండగా, నారదుడు చూచి కోపించి, "చెట్లవలె నిలబడి ఉండే మీరు వృక్షాలు కాగలరు" అని శపించాడు. వెంటనే వారు చాలః బాధపడి ప్రార్థించినందులకు దయజూపి - "చిరకాలం గడచిన తరువాత శ్రియఃపతి మీవద్దకు వచ్చిన సమయంలో ఈ రూపాన్ని వీడి మీ పూర్వరూపాన్ని పొందగలరు" అని శాపవిమోచ

నాన్ని పల్కి వెళ్ళిపోయాడు. ఈ విధంగా శాపంవల్ల వృక్షాలు అయిన వీటిలో కంసునిచే ఆజ్ఞాపింపబడిన ఇద్దరు అసురులు ఆవేశించి ఉన్నారు- అని కొన్ని పురాణాలు తెలుపుతున్నాయి. "పొయ్‌మ్మాయ మరుతాన వశురరై" అని పెరియాళ్వార్లు అనుగ్రహించారు.

(నైయమ్ తాయ్) - "తాయ్" అంటే "తావి" (వ్యాపించి) - అని అర్థం. "పాయోరడి నైత్తదన్ కీళ్ పురవ నిలమెల్లామ్ తాయ్" (తన అద్వితీయమైన శ్రీచరణాలను పెట్టి, దానితో విశాలమైన లోకాలను అన్నిటినీ వ్యాపించి) అనే తిరువాయ్‌మొళి సూక్తి గమవార్హం. "అమ్మా" అనేది "ఆమా" అనే పదంయొక్క "తొకుత్తల్‌వికారా"న్ని పొందిన రూపం.

ఈవిధంగా ఇటువంటి భగవానునకు నా ద్రావిడపాశురాలనే పవిత్రమైన గొప్ప మాలను కూర్చి సమర్పిస్తాను- అని అంటున్నారు.

17. పేశినార్ పిఱవి నీత్తార్ పేరుళాన్ పెరుమై పేశి,
ఏశివార్ ఉయ్‌న్దుపోనార్ ఎన్బతివ్వులకిన్ వణ్ణమ్,
పేశినేన్ ఏశమాట్టేన్ పేతైయేన్ పిఱవి నీత్తఱ్కు,
ఆశైయో పెరితు కొళ్క అలైకడల్ వణ్ణర్‌పాలే.

పేర్ ఉళాన్ = "తిరుప్పేర్‌నకర్" అనే దివ్యదేశంలో వేంచేసి ఉండే భగవానునియొక్క, పెరుమై పేశినార్ = గొప్పతనాన్నిగూర్చి పల్కినవారు, పిఱవి నీత్తార్ = సంసారాన్ని ఈది దాటారు, పెరుమై పేశి = అతని గొప్పతనాలను (దోషాలుగా) పల్కి, ఏశినార్ = నిందించిన శిశుపాలుడు మొదలైనవారు, ఉయ్‌న్దుపోనార్ = ఉజ్జీవనాన్ని పొందారు, ఎన్బదు = అని అనడం, ఇవ్వులకిన్ వణ్ణమ్ = శాస్త్రాల స్వభావం, పేదైయేన్ = జ్ఞానహీనుడనైన నేను, పేశినేన్ = ఏదో పలికాను, ఏశమాట్టేన్= (మోక్షాన్ని పొందడంకోసం కూడా) నిందించను, పిఱవి నీత్తఱ్కు = సంసారాన్ని విడచి పోవడానికి, అలై కడల్ వణ్ణర్ పాల్ =అలలు వీచే సముద్రంవంటి వర్ణాన్ని కలవానిపట్ల, ఆశైయో పెరితు = (నాకు) ఆశ మిక్కిలి పెద్దదిగా ఉన్నది. కొళ్క = ఇది నిశ్చయం.

వ్యా :- పతినేళ్లామ్పాట్టు. (పేశినార్ ఇత్యాది) తిరుప్పేర్‌నకరాన్ పెరుమై పేశినార్ సంసారత్తై క్కడన్దార్‌కళ్.

(పేరుళాన్ పెరుమై పేశి ఏశినార్ ఉయ్‌న్దుపోనార్)- ఇవన్ పెరుమైయై ప్పేశి ఏశిన శిశుపాలాదికళుమ్ ఉయ్‌న్దుపోనార్‌కళ్. (ఎన్బతివ్వులకిన్ వణ్ణమ్) ఎన్బతు

శాస్త్రమర్యాదై. ఏశువార్క్కుమ్ అవన్ గుణఙ్గళై చ్చొల్లి ఏశవేణుమే. "నాట్టై యుళ్ళి యాన్డైక్కైక్కాక శిశుపాలనై క్కొఱ్ఱవన్ వాశలుక్కుళ్ళే శుళ్ళుఱ్ఱి యెఱ్ఱివ్దావత్తై, రుచియున్నాక ప్పెఱువతితే పేఱావతు" ఎన్ఱు ఆళవన్దార్ అరుళిచ్చెయ్వర్.

(పేశినేన్) - ఉణ్ణప్పుక్కు మయిర్ప్పట్టు, "అళ్ళికితాక వున్దేన్" ఎన్నుమాపోలే. (ఏశమాట్టేన్) ఏశిప్పెఱుమ్ మోక్షమ్ వేణ్డా. (పేఱైయేన్) అఱివుకేడన్. (పిఱవి నీత్తఱ్కు ఆశైయో పెరితు కొళ్క) సంసారత్తై విడ ఆశై కరైపురణ్డిరానిన్దతు. ఆనాల్ కుఱ్ఱై ఎన్? ఎన్న, (అలైకడల్వణ్ణర్ పాలే) అతు అవన్కైయతాయిఱ్ఱో! నాన్ శెయవతెన్? క్రమప్రాప్తి పార్త్తిరుక్కవొణ్ణాత వడివు పడైత్తవర్.

*అరు :- పతినేళ్ళామ్పాట్టు. (పేశినార్) ఏశినార్ ఉజ్జీవిక్కక్కూడుమో? ఎన్న; అరుళిచ్చెయ్కిఱార్ (ఏశువారిత్యాది).* [1]*అతు ఉజ్జీవ్యమన్ఱు ఎమతుక్కు సంవాదమాక ఓరైతిహ్యమరుళిచ్చెయ్కిఱార్ (ఆళవన్దారిత్యాది) పేశినేన్-* [2]*నన్నాక ప్పేశినేనెన్ఱు వ్యఙ్గ్యమ్. ఆశై యుణ్డానాలుమ్ అవన్ కైపార్త్తిరుక్కవేణుమ్.*

భావదీపిక-అవ : ఈవిధంగా తిరుమంజనం చేయించడం, పూలమాలికలను అలంకరించడం ఏదైనా ఒక ఫలాన్ని ఆశించి చేస్తున్నారా? అని అంటే, "భక్తితో చేశానే తప్ప మోక్షాన్ని ఆశించి దీనిని చేయలేదు. అయితే, అతనిని పొగడుతూ పల్కినవారు, నిందించినవారు మోక్షాన్ని పొందారు - అని శాస్త్రం తెల్పుతున్నది. జ్ఞానహీనుడనైన నేను ఏదో పలికానే తప్ప నిందించను. జన్మ తొలగి అతనిని పొందాలనే ఆశ అయితే నాకు చాలా పెద్దదిగా ఉన్నది- అన్నది నిశ్చయం. అని అంటున్నారు.

వ్యాఖ్యానం : (పేరుళాన్ పెరుమై పేశినార్ పిఱవి నీత్తార్) తిరుప్పేర్‌నకర్‌లో వేంచేసి ఉండే భగవానుని మహిమను కీర్తించినవారు ఈ జన్మను ఈది దాటి అతనిని పొందారు.

(పేరుళాన్ పెరుమై పేశి ఏశినార్ ఉయ్న్దుపోనార్) - మహిమను పలికే వేయి నామాలను కలవాని మహిమనే చిన్నదిగా పల్కి నిందించిన శిశుపాలుడు మొదలైనవారు సైతం పరమపదాన్ని పొంది ఉజ్జీవించారు.

(ఎన్పతు ఇవ్వులకిన్ వణ్ణమ్) - అని శాస్త్రాలు పల్కుతున్నవి. (ఇక్కడ) "లోక" శబ్దం "లోక్యతే అనేన ఇతి లోకః" అనే వ్యుత్పత్తిలో ప్రయోగింపబడింది. "ఎల్లీరుమ్ వీడు పెఱ్ఱాల్ ఉలకిల్లై" (తిరువాయ్-4-10-6) (అందరూ పరమపదాన్ని పొందితే ఇక శాస్త్రాల ఆవశ్యకత లేదు), "అతోఽస్మి లోకే వేదే చ" (గీత-15-18).

---

1. అదు ఉజ్జీవనమన్తెన్నుమదుక్కు - పాఠాంతరం. 2. నన్నాక పేశినేనన్తెన్ఱు - పాఠాంతరం.

"న నిందితం కర్మ తదస్తి లోకే" (స్తోత్రరత్న-23) మొదలైనచోట్ల (ఈ విషయాన్ని) గమనించవచ్చు.

(పెరుమై పేశి ఏశినార్)-నిందించేవారుకూడా అతని గుణాలనుగూర్చి పల్కి, వాటిపై దోషాలను ఆరోపించికదా దూషించారు. శిశుపాలుడు "కేట్పార్ శెవి శుడు కీళ్మై వశవుకళే" (వినేవారి చెవులు దహించేటట్లుగా చాలా నీచమైన నిందలను) అన్నట్లుగా దూషించివా ఏవిధంగా మోక్షాన్ని పొందాడు? అని విచారణ ఏర్పడినపుడు, "శ్రీహస్తం, దానిచే ధరింపబడ్డ శ్రీసుదర్శనం అనే ఈ రెండిటి కలయికలోని అందాన్ని అంతిమదశలో శిశుపాలుడు భావించినందువల్ల మోక్షాన్ని పొందాడు" అని సమాధానం చెప్పబడింది. ఈవిధంగా పరిశీలించి కొంత మంచిని అతనిలో పల్కడం భగవానుని నిర్హేతుకకృపకు కొఱతను కల్గిస్తుంది. మోక్షానికి కారణంగా గ్రహించగల్గిన సాధనం ఒకటి అతనివద్ద ఉన్నదని నిరూపించడం సాధ్యంకాదే! అందువల్ల "ఈ శిశుపాలుడు ఇంకా ఈలోకంలో ఉంటే ఈ లోకం నశించి పోతుంది"- అని భగవానుడు చక్రాయుధంతో తిప్పి పరమపదం వాకిటి లోపలకు అతనిని విసరివేశాడు. నిజానికి ఇతడు మోక్షాన్ని పొందాలని కోరి, దానిని పొందలేదే! అందువల్ల ఇతడు పొందినది మోక్షమని చెప్పడం వీలుకాదు. భగవానుడు తన నిరంకుశస్వాతంత్ర్యంతో అతనిని పరమపదానికి పంపివేశాడు- అని చెప్పాలి" అనేది ఆళవన్దార్ నిర్వాహం. జయవిజయులుగా ఉన్నవారు మూడు జన్మలలో విరోధులుగా శాపంవల్ల జన్మించి తిరిగి వెళ్ళిపోయారు- అనే పౌరాణికకథకు ఇది పొసగుతుంది.

(పేశినేన్) - ఏదో పలికాను. భోజనం చేసేటపుడు, అన్నంతో కేశాలు నోటిలోకి రావడాన్ని చూచి "చాలా అందంగా భుజించాను" అని పలికే రీతిలో, తాను పల్కిన దానిలో తృప్తిలేకుండా "ఏదో పలికాను" అని అంటున్నారు.

(ఏశమాట్టేన్)- శిశుపాలునివలె మోక్షమే పొందే అవకాశం ఉన్నా, నేను నిందించను.

(పేదైయేన్) - జ్ఞానహీనుడను. మోక్షాన్ని పొందడానికి నావద్ద ఏదీ లేదు- అని భావం.

(పిఱవి నీత్తఱ్కు ఆశైయో పెరితు కొళ్క) - ఈ సంసారాన్ని విడచి మోక్షాన్ని పొందడంలో నాకు ఆశ మాత్రం కూలంకషంగా ఉన్నది. ఆ విధంగా అయితే కొఱత లేదే- అని అంటే,

(అలైకడల్ వణ్ణర్పాల్) - అది మిగిలిన విషయాలలో ఉంటే, ఏదో విధంగా పొందవచ్చు. అతనిని పొందాలనే ఆశ కనుక, దానిని అనుగ్రహించడం అతని

చేతిలోకదా ఉన్నది. మనం ఏమి చేయగలం? అతడు వీరిని (ఆళ్వార్లను) పురస్కరించుకొని చేయగోరిన దివ్యప్రబంధాలను వ్యక్తీకరించిన తరువాత మోక్షాన్ని అనుగ్రహించాలని భావించాడు. ఆ కాలహరణాన్ని సహించలేనందువల్ల వీరు ఈవిధంగా అంటున్నారు.

దివ్యార్థదీపిక :- "భగవానుని మహిమనుగూర్చి పలికే భక్తులు మోక్షాన్ని పొందు తున్నారు; ఆ స్వామిని నిందించే శిశుపాలాదులుకూడా మోక్షాన్ని పొందుతున్నారు - అని గ్రంథాలవల్ల తెలుస్తున్నది. ఈ రెండు వర్గాలలోను నాకు అన్వయం లేదు. భగవానుని మహిమనుగూర్చి అజ్ఞణ్ణే అయిన నేను ఏమని పలుకగలను? నాకు పల్కడం సాధ్యమా! సాధ్యం కాదు. కనుక "పేరుళాన్ పెరుమై పేశి ప్పిఆవి నీన్దార్" గోష్ఠిలో అన్వయించవచ్చునుకదా!- అని అంటే, నిందించి పొందే మోక్షం నాకు వద్దు. ఆ విధంగా మోక్షానికి పోకుండా, నరకానికి పోయినా పోతాను. భగవానుని నిందించకుండా ఉంటే చాలు. శిశుపాలాదుల కృత్యం నాకు వద్దు, వారు పొందిన ఫలంకూడా నాకు వద్దు. ఈవిధంగా నాకు ఈ రెండు రీతులలో మోక్షాన్ని పొందిడానికి ప్రాప్తి లేకుండా పోయింది. అయినా, మోక్షాన్ని పొందాలనే ఆశ అయితే నాకు అపారంగా ఉన్నది. అతని రూపసౌందర్యం నన్ను బాధిస్తున్నది. ఏమి చేయను ?"- అని అంటున్నారు.

(పేరుళాన్ పెరుమై పేశినార్ పిఆవి నీన్దార్) - "అప్పక్కుడత్తాన్ సన్నిధి" అని ప్రసిద్ధి పొందిన తిరుప్పేర్‌నకర్ ఒక్కటిని నిర్దేశించడం మిగిలిన దివ్యదేశాలకు కూడా ఉపలక్షణం. "తిరుప్పేర్" మొదలైన దివ్యదేశాలలో నిత్యసాన్నిధ్యాన్ని కల్గి ఉండేవాడైన భగవానుని మహిమను గూర్చి పలికేవారు ఉజ్జీవించారు - అనే దానికి ఉదాహరణాన్ని చూపించాలా?

(ఏశినార్ ఉయ్‌న్దుపోవార్) - "ఏశినారుమ్" (నిందించినవారుకూడా) అనే సముచ్చాయకాన్ని ("ఉమ్మై"- చకారం) గ్రహించాలి. - "కఱ్ఱినమ్ మెయ్‌క్కలుమ్ మెయ్‌క్కప్పెఱ్ఱాన్, కాడువాழ్‌శాతియుమాకప్పెఱ్ఱాన్, పఱ్ఱి యుర విడైయాప్పుముణ్డాన్, పావికాళ్! ఉజ్గళుక్కేచ్చుక్కొలో?" (లేగదూడల గుంపును మేపడమే వృత్తిగా కలవాడయ్యాడు. అరణ్యంలో నివసించే జాతిలో జన్మించాడు. రోటికి బంధింపబడ్డాడు. గుణాన్ని కూడా దూషించే పాపుల్లారా! మీకివి దూషణానికి పనికివచ్చాయా?) అని ఆణ్డాళ్ వ్యాకులంతో పలికే రీతిలో దూషించినవారిలో ప్రముఖుడైన శిశుపాలుడు మొదలైనవారు "ఏశినార్" అనే పదంద్వారా గ్రహింప బడతారు. నిందించేవాడుకూడా పేరును పల్కి నిందించవలసి ఉన్నది కనుక,

ఏదైనా ఒక రీతిలో నా తిరునామాన్ని పలికాడు - అని భావించి భగవానుడు తనను నిందించేవారికికూడా సద్గతిని అనుగ్రహిస్తాడు. శిశుపాలునకు మోక్షం లభించింది - అనే విషయాన్ని పరాశరమహర్షి పలికారు. "భగవచ్చక్రేణ వ్యాపాదిత స్తత్ స్మరణాద్దగ్ధాఖిలాఘసంచయో భగవతా అంతముపనీత స్తస్మిన్నేవ లయముప దధౌ" (భగవానుని చక్రంతో సంహరింపబడినవాడై, ఆ స్వామి స్మరణంవల్ల సమస్తపాపసమూహాలు దహింపబడినవాడై, భగవానునిచే అంతాన్ని పొంది, అతనిలోనే లయించాడు) అన్నది శ్రీవిష్ణుపురాణం. "కేట్పార్ శెవిశుడు కీழ్మై వశవుకళే నైయుమ్, కేట్పాల్ పழమ్ పకైవన్ శిశుపాలన్, తిరువడి తాట్పాల్ అడైన్ద" (వినేవారి చెవులనుకూడా దహించే దూషణాలను పలికే శత్రువైన శిశుపాలుని తన శ్రీచరణాల చెంతను పొందించినవాడు) అని అన్నారు నమ్మాழ్వార్లు కూడా. "చైద్యస్య కృష్ణ ప్రతిభవమపరాద్ధుర్మ్కగ్ది సాయుజ్యదోఽభూః" అని అన్నారు ఆళవన్దార్.

(ఎన్పదు ఇవ్వులకిన్ వణ్ణమ్) - లోకమనే పదంతో శాస్త్రాన్ని నిర్దేశించే సంప్రదాయం ఉన్నది. "ఎల్లీరుమ్ వీడు పెఱ్ఱాల్ ఉలకిల్లైయొన్తే" అనే తిరువాయ్మొழి వ్యాఖ్యానాలలోను, 'న నిందితం కర్మతదస్తి లోకే" అనే ఆళవన్దార్ స్తోత్రరత్న వ్యాఖ్యానాలలోను చూడవచ్చు. అందువల్ల ఇక్కడ "ఉలకిన్ వణ్ణమ్' అని శాస్త్రమర్యాదను చెప్పినట్లయినది. శాస్త్రాన్ని (లోకాన్ని) తెలిసినవారు అంటారు- అనే అర్థాన్ని గ్రహించినా గ్రహించవచ్చు.

(పేశినేన్) - భగవానుని మహిమనుగూర్చి నేను పలికాను- అనే అర్థాన్ని ఇచ్చదు. "హో ! మనం చాలా బాగా చదివాము !" అని అంటే బాగా చదవలేదు- అనే అర్థం స్ఫురించేటట్లే, ఇక్కడకూడా విపరీతలక్షణగా గ్రహించాలి. "భగవానుని మహిమనుగూర్చి పలుకగల్గిన అధికారి నేనా !" అని గర్విస్తూ పల్కడంలోనే ఉద్దేశ్యం. ఇక్కడి వ్యాఖ్యాన శ్రీసూక్తిని గమనించండి- "ఉణ్ణప్పుక్కు మయిర్ ప్పట్టు అழకిదాక ఉణ్డో మెన్నుమాపోలే" అని.

(ఏశమాట్టేన్) - నిందించి పొందదగినమోక్షం వద్దు- అని భావం.

'మోక్షాన్ని పొందడానికి రెండు దారులను శాస్త్రాలలో చూడగలం. భగవానుని మహిమలను కీర్తించి మోక్షాన్ని పొందాలి; శిశుపాలాదులవలె నిందించి అయినా మోక్షాన్ని పొందాలి. నాకు కీర్తించడం తెలియదు. నిందించడానికి ఇష్టం లేదు. అయ్యో! ఇక కోల్పోవలసినదే అంతే. మోక్షం పొందాలనే ఆశమాత్రం అంతు లేకుండా ఉన్నది. నేను ఏమి చేయను?"- అని అంటున్నారు.

18. ఇళైప్పినై ఇయక్కమ్ నీక్కి ఇరున్దు మున్నినైయై క్కూట్టి,
అళప్పిల్ ఐమ్బులనడక్కి అన్బవర్ కణ్ణే వైత్తు
తుళక్కమిల్ శిన్దై శెయ్‌తు తోన్డలుమ్ శుడర్ విట్టు ఆఙ్గే,
విళక్కినై విదియిల్ క్కాణ్బార్ మెయ్మ్మైయే కాణ్గిఱ్పారే.

ఇళైప్పినై = (అవిద్యాది అయిదు) క్లేశాలను, ఇయక్కమ్ నీక్కి = రాకుండా తొలగించి (నిరోధించి), ఇరున్దు = (మంచి ఆసనంలో) కూర్చుని ఉండి, మున్ ఇనైయై క్కూట్టి = ముక్కు చివర దృష్టిని నిలిపి, అళప్పిల్ = అవధి లేని, ఐమ్బులన్ కళ్ = అయిదు జ్ఞానేంద్రియాలను, అడక్కి = లోపల నిరోధించి, తుళక్కమ్ ఇల్ శిన్దై = నిరంతరమైన ధ్యానాన్ని, శెయ్‌తు = చేసి, (అది ముదిరిన తరువాత), అవర్‌కణ్ణే = ఆ భగవానునివద్దనే, అన్బై వైత్తు = భక్తి నిలిపి, అఙ్గు = ఆ దశలో, శుడర్ విట్టు = జ్యోతిస్సును వెలువరిస్తూ, తోన్డలుమ్ = ప్రకాశించే జ్ఞానంతో, విళక్కినై = (వేదంలో చెప్పబడ్డ) పరంజ్యోతి అయిన పరమాత్మను, విదియిల్ కాణ్బార్ = శాస్త్రాలలో చెప్పబడ్డ రీతిలో ఉపాసించేవారు, మెయ్మ్మైయే = నిజంగానే ధర్మంగానే, కాణ్గిప్పారే = అతనిని దర్శిస్తారా! (దర్శించలేరు).

**అవ :- పదివెట్టామ్బాట్టు. (ఇళైప్పినైయిత్యాది) ప్రయత్నత్తాల్ కాణ్బార్క్కు కాణప్పోకాదు - ఎన్గిఱతు.**

వ్యా :- (ఇళైప్పినై యియక్కమ్ నీక్కి) "అవిద్యాస్మితారాగద్వేషాభినివేశాః క్లేశాః" ఎన్నుమ్ శొల్లుకిఱ క్లేశఙ్గళుడైయ సఞ్చారత్తై త్తవిర్‌త్తు.

(ఇరున్దు) కా<u>ర్</u>ఱై ప్పిడిత్తు ఇరుత్తుమాపోలేయుతే. "నాత్యుచ్ఛ్రితమ్" ఇత్యాదియాల్ శొల్లుకిఱపడియే ఓరాసనత్తిలే యిరున్దు.

(మున్నినైయై క్కూట్టి) "సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్" ఎన్నుమ్బడియే ఉళ్ళే పార్‌క్కిల్ అనుభూతవిషయఙ్గళ్ తో<u>ఱ్ఱు</u>మ్; పుఱమ్బే పార్‌క్కిల్ విషయఙ్గళ్ తానాయిరుక్కుమెన్ఱు నడువే నిఱ్త్తై.

(అళప్పిల్ ఐమ్బులనడక్కి) అళవిఱన్ద ఇన్ద్రియఙ్గళై ప్రత్యాక్కాక్కి. (అన్బవర్‌కణ్ణే వైత్తు త్తుళక్క మిల్ శిన్దై శెయ్‌తు) అవిచ్ఛిన్నస్మృతిరూపమాన భక్తియై ప్పణ్ణి. (శుడర్ విట్టు తోన్డలుమ్) ఇప్పడి శుడర్‌విట్టు త్తోన్ఱుకిఱ జ్ఞానత్తాలే. (విళక్కినై) వేదవిళక్కినై, వేదఙ్గళాలే జ్యోతిస్స్వరూపనాక ప్రతిపాదిక్కప్పట్ట విళక్కై. (విదియిల్ కాణ్బార్) శాస్త్రఙ్గళిల్ విధిత్త పడియే ఉపాసిత్తు అవనై క్కాణ్బార్. (మెయ్మ్మైయే క్కాణ్గిఱ్పారే) ఎన్నుమ్ ఉళనాయిరుక్కిఱ సర్వేశ్వరనై క్కాణనల్లరే? కాణమాట్టారెన్రపడి. అథవా,

ఇప్పడి యోగశాస్త్రత్తిల్ శొల్లుకిఱపడియే ఉపాసిత్తు క్కాణ్బార్క్కు క్కాణలా మెన్నుమామ్.

అరు :- పతినెట్టామ్బొట్టు. (ఇళైప్పినై) అవిద్యై -అహమభిమానమాతల్, మరణత్రాసమాతల్. మనప్పోదే ఇరుక్కవేణ్డుకైయాలే *(కాఱ్ఱై ప్పిడిత్తు ఎన్నతు)* నాత్యుచ్ఛ్రితమ్ - ఉయర్న్దుమ్ *తాழ்న్దుమిన్ఱి* సమమాక. అనుభూతమాన విషయత్తై క్కణ్డాల్ పరమాత్మ ధ్యానమ్ కూడాతు, *ఈడుపడుత్తుమ్. (కాణ్గిఱ్పారే)* పిరినిలై యాతల్; *తేఱ్ఱమాతల్.* అఙ్గప్రపత్తి ఇల్లావిట్టాల్ కాణమాట్టారెన్ఱపడి.

భావదీపిక-అవ : యోగాభ్యాసాన్ని చేసి తమ ప్రయత్నంతో అతనిని దర్శించాలని అనుకొనేవారికి అతనిని దర్శించడం సాధ్యం కాదు- అని అంటున్నారు

వ్యాఖ్యానం : (ఇళైప్పినై ఇయక్కమ్ నీక్కి) - "అవిద్యా- అస్మిత- రాగ, ద్వేషాభినివేశాః క్లేశాః" (పాతంజలయోగసూత్రాణి-2-3) (అజ్ఞానం, అహంకారం, రాగం, ద్వేషం, అభినివేశం- అనే అయిదు క్లేశాలనబడతాయి) అని చెప్పబడే అయిదు క్లేశాలు కలుగకుండా నిరోధించి - అని భావం. వీటిని అణచే దారి పతంజలి యోగసూత్రంలో చెప్పబడింది.

(ఇరున్దు) - గాలిని బంధించి ఒకచోట నిలిపేటట్లుగా, చాలా చంచలమైన మనస్సును ఏకముఖంగా చేయడానికి సాధనమైన ఒక చక్కని ఆసనంలో కూర్చుండి. ఈ సందర్భంలో "శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః, నాత్యుచ్ఛ్రితం నాతి నీచం చేలాజినకుశోత్తరమ్, తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః, ఉపవిశ్యాసనే యుంజ్యాత్ యోగ మాత్మవిశుద్ధయే" (గీత- 6-11,12) (పరిశుద్ధమైన చోట తనకు- (కొయ్యమొదలైన వానితో చేయబడి) స్థిరంగా ఉన్నది, మిక్కిలి ఉన్నతంగా కాకుండా, చాలా కిందకు కాకుండా ఉన్నది, దర్భలు, కృష్ణాజినం, పట్టువస్త్రం మొదలైనవానితో పైన పఱచబడినది అయిన ఆసనాన్ని స్థిరంగా నిలుపుకొని, ఆ ఆసనంలో కూర్చుని మనస్సును ఏకాగ్రతతో నిలిపి, చిత్తవ్యాపారాలను, ఇంద్రియక్రియలను ఇష్టం వచ్చినట్లు కాకుండా అణచుకొన్నవాడై, సంసారబంధం తొలగడంకోసం ఆత్మదర్శనాన్ని చేయాలి) అనే ఈ రెండు గీతాశ్లోకాలు, వాటికి గల గీతావ్యాఖ్యాన వివరణాలు అనుసంధేయాలు. ఈ రెండు శ్లోకాలలో తెలుపబడ్డ బాహ్యోప కరణాలలోని నియమం, వాటిద్వారా మనస్సు ఆత్మలో ఏకాగ్రతతో నిలుపడం- అనే అర్థాలు పాశురంలో గల "ఇరున్దు" అనే పదంతో తెలుపబడినవి. అనంతరం, గీతలోని తరువాతి రెండు శ్లోకాలతో బాహ్యోపకరణాల కంటే అంతరంగమైన

శరీరంయొక్క, దానికంటే అంతరంగమైన మనస్సుయొక్క నియమాలు తెలుప బడడాన్ని పాశురంలోని తరువాతి పదంతో తెలుపుతున్నారు.

(మున్ ఇరుత్తి క్కూట్టి) - ఇక్కడ- "సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరమ్, సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్.... ప్రశాంతాత్మా విగతభీః బ్రహ్మచారివ్రతే స్థితః, మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః" (గీత-6-13, 14) (శరీరం, తల, కంఠం - అనే మూడింటిని నేరుగా, కదలకుండా స్థిరంగా నిలుపుకొని, దిక్కుల వైపు అటు ఇటు చూడకుండా, తన నాసిక చివరి భాగాన్ని చూస్తూ, చాలా సంతోషాన్ని పొందిన మనస్సును కలవాడై, భయరహితుడై, బ్రహ్మ చర్యాన్ని కలవాడై, మనస్సును నిరోధించి, నాపట్ల చిత్తాన్ని నిలిపినవాడై, గమనికను కలవాడై, నాపట్లనే అభినివేశాన్ని కలవాడై ఉండాలి) అనే రెండు శ్లోకాలు, వాటిని గల వ్యాఖ్యాన వివరణలు అనుసంధేయాలు. "దిక్కులను చూడకుండా నాసికాగ్రాన్ని చూస్తూ" అని ఈ శ్లోకంలో చెప్పడంలోని తాత్పర్యం ఏమి ? అంటే- కన్నులను మూసికొని, మనస్సులో బుద్ధిని ప్రసరింపజేస్తే, మనస్సు ద్వారా గతంలో అనుభవించిన శబ్దాదివిషయసుఖాలు స్మరణకు వస్తాయి. దిక్కులను చూస్తే మధ్యలో ఉండే లౌకికవిషయాలు అన్నీ కనిపిస్తాయి. అందువల్ల కన్నులను మూసికొని లోపల దర్శించకుండా, బయట ఉండే దిక్కులను చూడకుండా, తన ముక్కు చివరి భాగాన్ని కళ్ళతో చూస్తూ ఉంటే శబ్దాది విషయాలస్మరణ గాని, దర్శనంగాని కలుగదని భావం.

(అళప్పిల్ ఐమ్బులన్ అడక్కి) - చేష్టలతో (కార్యాలతో) అంతు లేని త్వక్కు, జిహ్వా, కన్ను, ముక్కు, చెవి- అనే అయిదు ఇంద్రియాలను బయట యథేష్టంగా వర్తించకుండా ఉండేటట్లు వాటిని నిరోధించి, అంతర్ముఖంగా ప్రవర్తింపజేసి- అని భావం. ఇక్కడ పంచేంద్రియాల నిరోధాన్నిగూర్చి పల్కడం "మన స్సంయమ్య" (గీత-6-14) అని గీతలో తెలుపబడ్డ మనఃసంయమనాదికికూడా ఉపలక్షణం.

(తుళక్కమిల్ శిన్దై శెయ్‌తు అన్బు అవర్ కణ్ణే వైత్తు) - నిరంతర ధ్యానరూపమై ఉండే భక్తిని భగవానుని విషయంలో కల్గి ఉండి - అని భావం. తైలధారవలె నిరంతరంగా సాగే ధ్యానాన్ని చేయడమే భక్తి (తైలధారావదవిచ్ఛిన్న ధ్యానసంతాన విశేషం) అని శ్రీభాష్యంలో చెప్పబడింది కదా!

(అఙ్గు శుడర్‌విట్టు తోన్ఱలుమ్) - ఆ దశలో ప్రకాశాన్ని వెలువరిస్తూ భాసించే జ్ఞానంతో.

(విళక్కినై) - "వేదవిళక్కినై" (తిరువాయ్-4-7-10) (వేదంలో ప్రకాశించే దీపంవంటి జ్యోతిస్స్వరూపుని) అనే రీతిలో వేదంలోని దీపంగా చెప్పబడ్డవానిని. "నారాయణ పరో జ్యోతిః" (తైత్తి. నారా-11) ఇత్యాది వేదవాక్యాలలో పరంజ్యోతి రూపంగా చెప్పడే నారాయణుని - అని భావం.

(వితియిల్ కాణ్బార్) - శాస్త్రాలలోని బ్రహ్మవిద్యలో విధింపబడ్డ రీతిలో ఉపాసనాన్ని చేసి, అతనిని దర్శించేవారు.

(మెయ్మ్మైయే కాణ్గిప్పారే) - నిత్యం అందరిలోను వ్యాపించి ఉండే సర్వేశ్వరుని దర్శించగలవారు కాగలరా ? దర్శించలేరని భావం. వారుకూడా తమ ఉపాసనమనే ప్రయత్నంలోమాత్రం అతనిని దర్శించడం సాధ్యం కాదు. స్వప్రయత్నాన్ని విడచి, అతని శ్రీచరణాలలో వాలడమనే అంగప్రపత్తిని సహాయం చేసికొనే అతనిని దర్శించడం సాధ్యం- అని భావం. ఈ విధంగా "కాణ్గిప్పారే ?" అనే పదంలోని ఏకారాన్ని వ్యవచ్ఛేదకంగా వ్యతిరేకార్థంలో గ్రహించి "దర్శించలేరు" అనే అర్థాన్ని గ్రహించడమే కాక, నిశ్చయార్థకంగా గ్రహించి, "ఈవిధంగా యోగశాస్త్రంలో చెప్పబడ్డ రీతిలోనే కఠినాలైన నియమాలను అనుష్ఠించి, ఉపాసనాన్ని చేసి దర్శించాలని ప్రయత్నించేవారు దర్శించవచ్చు" అనే అర్థాన్ని గ్రహించవచ్చు.

దివ్యార్థదీపిక :- భగవానుని స్వప్రయత్నంతో దర్శించాలని కోరేవారి కోరిక ఏనాడూ నెరవేరదు - అని అంటున్నారు.

(ఇళైప్పినై ఇయక్కమ్ నీక్కి) - "ఇళైప్పు" అంటే క్లేశం. క్లేశం అయిదు విధాలు. "అవిద్యాస్మితారాగద్వేషాభినివేశాః క్లేశాః" అని పాతంజలదర్శనంలో చెప్పబడింది. అవిద్య అంటే అజ్ఞానం. అస్మిత అంటే అహంకారం. రాగం అంటే ఇచ్ఛావిశేషం. ద్వేషమంటే పగ. అభినివేశమంటే మరణభయం. (అని కుసుమాంజలిలో వివరింపబడింది) అందువల్ల ఇటువంటి క్లేశాల సంచారాన్ని పోగొట్టి.

(ఇరున్దు) - గాలిమరవలె ఎల్లప్పుడు ఎగురుతూ ఉండే స్వభావం కలవారికి ఒకే చోట ఉండడం దుర్లభంగా ఉంటుంది. ఇటువంటి అరుదైన కృత్యమైన నిలకడగా ఉండడాన్ని చేసి.

(మున్నిమైయై క్కూట్టి) - ఏదిక్కును చూడకుండా తన నాసికాగ్రాన్నే చూస్తూ ఉండాలనే నియమం ప్రకారం చేసి- అని భావం. పై కనురెప్పను కింది కనురెప్పతో చేర్చడమే ఈ దశ.

(అళప్పిల్ ఐమ్పులదైక్కి) - అంతు లేని విషయాంతరాలలో యథేష్టంగా విహరించే పంచేంద్రియాలను అంతరవిషయం పై లగ్నమయేటట్లుచేసి.

(అమ్పు అవర్ కణ్ణే సైత్తు త్తుళక్క, మిల్ శిన్దై శెయ్‌తు) - తైలధారవలె అవిచ్ఛిన్నస్మృతిసంతానరూపమైన భక్తిని భగవద్విషయంగా చేసి- అని భావం.

(అజ్ఞే శుడర్ విట్టు త్తోన్రలుమ్ ఇత్యాది) - అందువల్ల ఇటువంటి రీతిలో జాజ్వల్యమానమై స్ఫురించే జ్ఞానంతో వేదదీపం అనే భగవానుని శాస్త్రాలలో విధించిన రీతిలోనే ఉపాసనను చేసి, సాక్షాత్కరించాలి- అనే గొప్ప ప్రయత్నం చేసేవారు అతనిని నిజంగా దర్శించగలరా?, ఆ భగవానుడు స్వయంగా తన నిర్హేతుక కృపతో తనను దర్శింపజేసి అనుగ్రహిస్తే దర్శించవచ్చు తప్ప. "ఊన్ వాడ వుణ్ణాతుయిర్ కావలిట్టు ఉడలిల్పిరియా పులనైన్దుమ్ నొన్దు వామ్ వాడ వాడ త్తవమ్" (శరీరం వాడేటట్లుగా తిండి తినకుండా, ప్రాణాలు శరీరంనుండి పోకుండా ఉండేటట్లు కావలి కాచి, అయిదు ఇంద్రియాలు క్లేశపడేటట్లు తపస్సు) చేయడమనే స్వప్రయత్నాలతో అతనిని సాక్షాత్కరించడం సులభమా!- అని భావం.

"పెణ్ణులామ్ శడైయినానుమ్ పిరమనుమ్ ఉన్నై క్కాణ్బాన్, ఎణ్ణిలా ఊழியూழி తవమ్ శెయ్‌దార్ వెళ్కి నిఱ్ప, విణ్ణులార్ వియప్ప వన్దు ఆనైక్కు అన్రు అరుళై ఈన్ద" (గంగాదేవి సంచరించే జటలను కల రుద్రుడు, బ్రహ్మ, నిన్నుచూడాలని కల్పాల తరబడి తపస్సు చేసినవారైనా, దర్శించలేక సిగ్గుతో నిలబడి ఉండగా, వచ్చి గజేంద్రుని ఆనాడు అనుగ్రహించిన) అనే రీతిలో పలు వేల కల్పాల తరబడి తపస్సు చేసి క్లేశపడేవారంతా లజ్జించి నిలచేటట్లుగా శ్రీగజేంద్రాழ్వాన్‌వంటి వారి విషయంలో పరమకృపను చేసేవాడైన భగవానునియొక్క స్వభావానికి తగినట్లు ఈ పాశురాన్ని ఈ విధంగా వ్యాఖ్యానించడం తగినది. పెరియవాచ్చాన్ పిళ్ళైవ్యాఖ్యానంలో ఈ రీతిలో విశదంగా వ్యాఖ్యానించిన తరువాత, "అథవా, ఇప్పడి యోగశాస్త్రత్తిల్ శొల్లుకిఱపడియే ఉపాసిత్తు క్కాణ్బార్‌క్కు క్కాణలామెన్నుమామ్" అనే ఇంకొక నిర్వాహంకూడా అనుగ్రహింపబడడాన్ని గమనించండి.

19. పిణ్డియార్ మణ్డై యేన్ది ప్పిఱర్ మనై తిరితన్దుణ్ణుమ్,
    ముణ్డియాన్ శాపమ్ తీర్‌త్త ఒరువనూర్, ఉలకమేత్తుమ్
    కణ్డియూర్ అరఙ్గమ్ మెయ్యమ్ కచ్చి పేర్ మల్లై యెన్రు
    మణ్డినార్, ఉయ్యలల్లాల్ మఱ్ఱైయార్‌క్కుయ్యలామే.

పిణ్డియార్ = (వెలసిపోయి) పొడి రాలే, మణ్డై ఏన్ది = కపాలాన్ని చేతిలో ధరించి, పిఱర్ మనై =ఇతరుల గృహాలలో, తిరితన్దు = తిరిగి, ఉణ్ణుమ్ = (బిచ్చమెత్తి) భుజించే, ముణ్డియాన్ = కేశపాశం లేని బట్టతలవాడైన రుద్రునియొక్క, శాపమ్ తీర్త్త = శాపాన్ని తీర్చిన, ఒరువన్ = సాటి లేనివానియొక్క, ఊర్ = ఊరై, ఉలకమ్ ఏత్తుమ్ = లోకం అంతా కీర్తించే రీతిలో ఉండే, కణ్డియూర్ = తిరుక్కణ్డియూర్, అరఙ్గమ్ = శ్రీరంగం, మెయ్యమ్ =తిరుమెయ్యమ్, కచ్చి = కాంచీపురం, పేర్ = తిరుప్పేర్ నకర్, మల్లై = తిరుక్కడల్ మల్లై, ఎన్ఱు మణ్డినార్ = అనే దివ్యతిరుపతులలో అభినివేశాన్ని కల్గినవారు, ఉయ్యల్ అల్లాల్ = ఉజ్జీవనం పొందగలరు తప్ప, మఱ్ఱైయార్క్కు = మిగిలినవారికి (ఆ విధంగా అభినివేశం లేనివారికి), ఉయ్యల్ ఆమే = ఉజ్జీవనం పొందడం సాధ్యమా!

వ్యా :- పత్తొన్పతామ్పాట్టు. (పిణ్డియార్ మణ్డై యేన్ది యిత్యాది) ఉళుత్తు అళమ్ పఱ్ఱిన శువర్ పోలే పొడియుతిరుకిఱ తలైయోట్టై క్కైయిలే యేన్ది. (పిఱర్ మనై తిరితన్దుణ్ణుమ్) "ముడైయడర్త్త శిరమేన్ది మూవులకుమ్ పలి తిరివోన్" ఎన్గిఱపడియే నెడుఙ్గాలమ్ కైయోట్టై క్కొణ్డు తిరిన్దు ఇరన్దుణ్డాన్. (ముణ్డియాన్) తాపసవేషత్తైయుడైయ రుద్రన్. (శాపమ్ తీర్త్త వొరువన్) బ్రహ్మశాపత్తాలే మణ్డై యేన్ది త్తిరిన్దవన్ శాపమ్ అవనై విట్టు ప్పోమ్పడి పణ్ణిన అద్వితీయన్.

(ఊరిత్యాది) అవనూరాన ఉలకమేత్తుమ్ తిరుక్కణ్డియూర్, కోయిల్ తిరుమెయ్యమ్, తిరుక్కచ్చి, తిరుప్పేర్, తిరుక్కడల్ మల్లై ఎన్ఱుమ్. (మణ్డినారుయ్య లల్లాల్) అవనుకన్దరుళిన ఇత్తిరుప్పతికళిలే నెఞ్జు మణ్డినవర్కళ్ ఉయ్యలల్లతు. (మఱ్ఱైయార్క్కుయ్యలామే) అల్లాతార్క్కు ఉజ్జీవిక్క విరకుణ్డో?

భావదీపిక-అవ : అర్చావతారంలోని అభినివేశమే మూర్తీభవించినవారైన తిరుమఙ్గై యాళ్వార్ తమ పరమసిద్ధాంతాన్ని ఈ పాశురంలో వ్యక్తం చేస్తున్నారు. ఉపాసనంతో భగవానుని దర్శించడం అరుదు- అని గత పాశురంలో అన్నారు. ఈ పాశురంలో, అర్చావతారంలో అభినివేశాన్ని కలవారికి అతనిని దర్శించి ఉజ్జీవించడం సులభం- అని అంటున్నారు.

వ్యాఖ్యానం : (పిణ్డియార్ మణ్డై యేన్ది) - వెలసిపోయి ఉప్పు పట్టిన గోడవలె పొడిని రాల్చే బ్రహ్మకపాలాన్ని చేతిలో ధరించి.

(పిఱర్మనై తిరిన్దుణ్ణు ముణ్డియాన్) - "ముడై యడర్త్త శిరమేన్ది మూవులకుమ్ పలి తిరివోన్" (పెరియతిరు-6-9-1) (దుర్గంధాన్ని వెలువరించే

కపాలాన్ని చేతిలో దాల్చి, ముల్లోకాలలో బిచ్చమెత్తి తిరిగే శివుడు) అనే రీతిలో శాపంతో చేతికి అంటుకొన్న ఆ బ్రహ్మకపాలం విడిపోవడంకోసం ఇతరుల గృహాలకు చిరకాలం చేతికపాలాన్ని గొని, తిరిగి బిచ్చమెత్తి భుజించినవాడు. "తిరితన్దు ఉణ్ణుమ్ ఉణ్డియాన్" అనే పదాన్ని విభజించి, ఈ విధంగా అర్థం చెప్పబడింది. "ఉణ్ణుమ్ ముణ్డియాన్" అనికూడా విభజించవచ్చు. "ముణ్డియాన్" - అంటే 'బట్టతలను కలవాడు" అని అర్థం. శాపం తీరడంకోసం ఈవిధంగా తపస్సు చేసినవాడు కనుక, దానికి తగినదైన వేషాన్ని కలవాడని భావం.

(శాపమ్ తీర్త్త ఒరువన్) - బ్రహ్మశాపంవల్ల బట్టతలను కలిగి తిరిగిన రుద్రుని శాపం అతనిని విడచి పోయేటట్లుచేసిన సాటి లేనివాడు.

(ఒరువనూర్ ఉలకమేత్తుమ్ కణ్డియూర్ అరఙ్గమ్ మెయ్యమ్ కచ్చి పేర్ మల్లై ఎన్ఱు మణ్డినార్) - అతని ఊరై. లోకంచేత కీర్తింపబడే తిరుక్కణ్డియూర్, తిరువరఙ్గమ్, తిరుమెయ్యమ్, తిరుక్కచ్చి, తిరుప్పేర్‌నకర్, తిరుక్కడల్ మల్లై-అనే అభినివేశాన్ని కలవారు. "ఉలకమేత్తుమ్" అనే ప్రయోగాన్ని అన్ని దివ్యదేశాలకు అన్వయించవచ్చు. "బ్రహ్మశిరఃఖండీశ్వర్" అనే పేరుతో నిత్యనివాసం చేస్తున్నందువల్ల శివుని తక్కువదనం, "హరశాపవిమోచనన్" అనే పేరుతో కోవెలను కలవాడై నందువల్ల భగవానుని గౌరవం ఈ ఊరిలో లోకం అంతా దర్శించగల్గడం చేత "ఉలకమేత్తుమ్ కణ్డియూర్" అని కణ్డియూర్‌కు మాత్రం అన్వయించి అర్థాన్ని చెప్పవచ్చు.

(మణ్డినార్ ఉయ్యలల్లాల్) - అతడు అభిమానించి వేంచేసి ఉండే ఈ దివ్యతిరుపతులలో మనస్సు అభినివేశాన్ని పొంది అతనిని పురస్కరించుకొని అతనిని పొందాలని తలచేవారు ఉజ్జీవించగలరే తప్ప,

(మఱ్ఱైయార్‌క్కు ఉయ్యలామే) - అర్చావతారంలో అభినివేశం లేకుండా తమ ప్రయత్నంతో అతనిని పొందవచ్చునని భావించేవారికి ఉజ్జీవించే దారి ఉన్నదా? వారు ఉజ్జీవించడం అరుదు- అని తాత్పర్యం.

దివ్యార్థదీపిక :- భగవానుడు అభిమానించిన దివ్యదేశాలలో అంతటా "పతియే పరవిత్తొழుమ్ తొణ్డర్" అనే రీతిలో అవగాహించినవారు ఉజ్జీవించేదారి ఉన్నది తప్ప, ఇతరులకు ఏనాడు ఉజ్జీవించే దారి లేదు- అని అంటున్నారు. ఒకానొక సమయంలో పరమశివుడు తనవలెనే బ్రహ్మకూడా అయిదు తలలను కలవాడై, ఉండడం పలువురు చూచి భ్రమించడానికి కారణం అవుతున్నదని

భావించి, అతని ఒక శిరస్సును గిల్లివేయగా, ఆ కపాలం శివుని చేతికి అంటుకొని పోయింది. అపుడతడు "దీనిని విడిపించుకోవడంకోసం ఏమి చేయాలి" అని చింతించగా, దేవతలు, మునులు "ఈపాపం పోవడం కోసం బిచ్చమెత్తాలి. ఏనాడూ కపాలం నిండుతుందో ఆనాడు ఇది నీ చేతిని వీడిపోతుంది" అని అనగా, శివుడు చాలాకాలం పలుచోట్లకు పోయి బిచ్చమెత్తుతూ బాధపడుతూ సంచరించినా, ఆ కపాలం వదలలేదు. తరువాత ఒకనాడు బదరికాశ్రమాన్ని చేరి అక్కడ వేంచేసి ఉండే నారాయణమూర్తికి నమస్కరించి, ప్రార్థించినపుడు ఆస్వామి "అక్షయం" అని బిచ్చం పెట్టగా, వెంటనే ఆ కపాలం నిండి చేతిని వీడిపోయింది- అనే ఐతిహ్యం తెలియదగినది.

"ఉణ్ణుమ్ ముణ్డియాన్", "ఉణ్ణుమ్ ఉణ్డియాన్" అనేవి పాఠభేదాలు. "తాపసవేషాన్ని కల్గిన రుద్రుడు" అనే వ్యాఖ్యానవాక్యం కన్పిస్తున్నందువల్ల "ముణ్డి యాన్" అనే పాఠం దానికి పొసగుతుంది. ప్రాసనుభగత్వానికి "ఉణ్డియాన్" అనే పాఠం పొసగుతుంది. "ఉణ్డి" -తిండి. బిచ్చమెత్తి భుజింపబడ్డ అన్నాన్ని కలవాడు - అని భావం.

(కణ్డియూర్) - చోళదేశంలోని దివ్యతిరుపతులలో ఒకటి.

(మెయ్యమ్) - పాండ్యదేశదివ్యతిరుపతులలో ఒకటి.

(కచ్చి) - తిరువెంఃకాలో దృష్టి , శయనించిన సన్నివేశంలో అమరి ఉండే దివ్యదేశాలు దీనికి ముందు, వెనుక ప్రస్తావింపబడడంవల్ల.

(పేర్) - తిరుప్పేర్‌నకర్. అప్పక్కుడత్తాన్ సన్నిధి.

(మల్లై) - తొండనాడు దివ్యదేశాలలో ఒకటైన తిరుక్కడల్ మల్లై.

"ఇళైప్పినై యియక్కమ్ నీక్కి" అనే గడచిన పాశురంలో చెప్పబడ్డవ్యర్థంగా క్లేశపడకుండా "కామ్బుఅత్తలై శిరైత్తు ఉన్ కడత్తలై యిరున్దు వాழ్ఉమ్ శోమ్బరై యుకత్తిపోలుమ్ శూழ్పునల్ అరఙ్గత్తానే!" (తోటలను చుట్టూ కలిగిన శ్రీరంగంలోని స్వామీ! ఉపాయాంతరాలలో తమకు గల సంబంధాన్ని సమూలంగా పోగొట్టుకొని తమ వద్దగల పాపాలను తీర్చుకొని నీ సన్నిధిలో నిలకడగా ఉండి వాసం చేసే సోమరులను - అనగా పరమప్రపన్నులను చూసి నీవు సంతోషిస్తావు.) అనే రీతిలో దివ్యదేశానుభవమే కాలక్షేపంగా కలవారికే భగవానుని అనుగ్రహం అంతు లేనిదిగా ఉంటుంది- అని భావం.

20. వానవర్ తజ్గళ్ కోనుమ్ మలర్‌మిశై అయనుమ్ నాళుమ్,
తేమలర్ తూవి ఏత్తుమ్ శేవడి చ్చెజ్గణ్‌మాలై,
మానవేఱ్కలియన్ శొన్న వణ్డమిழ் మాలై నాలైన్దు,
ఊనమతిన్ఱి వల్లార్ ఒళివిశుమ్బాళ్వర్ తామే.

వానవర్ తజ్గళ్ కోనుమ్ = దేవతల ప్రభువైన ఇంద్రుడు, మలర్ మిశై అయనుమ్ = నాభీపద్మంలో పుట్టిన బ్రహ్మ, నాళుమ్ = ప్రతినిత్యం, తే మలర్ = అందమైన పూవులను, తూవి = సమర్పించి, ఏత్తుమ్ = స్తుతించే, శే అడి = అందమైన శ్రీచరణాలను కలవాడై, శెమ్ కణ్ మాలై = ఎఱ్ఱని తిరునేత్రాలను కలవాడైన శ్రియఃపతిని గూర్చి, మావ వేల్ కలియన్ శొన్న = పెద్ద వేలాయుధాన్ని కల్గిన తిరుమంగై మన్నన్ అనుగ్రహించిన, వణ్ తమిழ் మాలై = గంభీరాలైన అర్థాలను కల ద్రావిడమాలిక అయిన, నాల్ ఐన్దు = ఈ ఇరవై పాశురాలను, ఊనమ్ అతు ఇన్ఱి = ఏ ఫలాన్ని ఆశించకుండా, వల్లార్ = అభ్యసించగల్గినవారు, ఒళి విశుమ్బు= పరమపదాన్ని, ఆళ్వర్‌తామే = ఏలగలరు.

వ్యా :- ఇరుపతామ్పాట్టు. నిగమనమ్. (వానవరిత్యాది) ఇన్ద్రనుమ్, బ్రహ్మావుమ్, ఎప్పోతుమ్ శెవ్వియైయుమ్ తేనైయుముడైత్తాన పుష్పజ్గళై ప్పణిమాఱి ఏత్తుమ్ అழகియ తిరువడిత్తామరైకళైయుడైయ పుణ్డరీకాక్షనై.

(మానవేలిత్యాది) పెరున్దన్మైయైయుడైయ వేలైయుడైయ ఆழ్వార్ అరుళిచ్చెయ్‌త పరమోదారమాన తమిழ்మాలై. నాలైన్దు- ఇరుపతైయుమ్ అనన్య ప్రయోజనరాయ్ క్కఱ్కవల్లవర్‌కళ్ తెళివిశుమ్బాన పరమపదత్తై ఆళప్పెఱువర్‌కళ్.

తిరుక్కుఱున్దాణ్డక వ్యాఖ్యానమ్ ముఱ్ఱిఱ్ఱు

అరు : ఇరుపతామ్పాట్టు - (వానవర్) మానవేల్- పెరియస్వభావత్తై యుడైయ వేల్.

అరుమ్బదమ్ ముఱ్ఱిఱ్ఱు



అడివరవు - నితియినై, కాఱ్ఱినై, పాయిరుమ్, కేట్క యాన్, ఇరుమ్బు నన్ఱుణ్ణ, మూవరిల్, ఇమ్మైయై, వానిడై, ఉళ్ళమో, శిత్తముమ్, తొణ్డెల్లామ్, ఆవియై, ఇరుమ్బు, కావియై వెన్ఱ, మున్ పొలా, మాయమాన్, పేశినార్, ఇఱైప్పినై, పిణ్ణియార్, వానవర్, మిన్నురు.

భావదీపిక-అవ : ఈ దివ్యప్రబంధాన్ని అధ్యయనందేసినవారికి కలిగే ఫలాన్ని ఇందులో తెలుపుతూ ఆళ్వార్లు ప్రబంధనిగమనాన్ని చేస్తున్నారు.

వ్యాఖ్యానం : **(వానవర్ తజ్గళ్‌కోనుమ్ మలర్‌మిశై యయనుమ్ నాళుమ్ తేమలర్ తూవి ఏత్తుమ్ శేవడి చ్చెజ్గణ్ మాలై)** - దేవతలకు ప్రభువైన ఇంద్రుడు, నాభీకమలంలో పుట్టిన బ్రహ్మ ఎల్లప్పుడు తేనెను, అందాన్ని కల పూలను శ్రీచరణాలలో సమర్పించి స్తుతించే అందమైన శ్రీచరణపద్మాలను కల పుండరీకాక్షుని - అని భావం. "శెజ్గణ్‌మాలై" అని అంటూ "యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ" (ఛాందో) (సూర్యునిచే వికసించిన రెండు తామరపూలవంటి కన్నులు పరమాత్మకు ఉన్నాయి) అని ఉపనిషత్తులలో చెప్పబడ్డ పరతత్త్వం ఇతడే అని, మిగిలిన దేవతలు ఇతనిని స్తుతించి, నమస్కరించడం తగినదే- అని తెలుపుతున్నారు.

**(మానవేల్ కలియన్ శొన్న వణ్డమిళ్మాలై)** - ఆళ్వార్లవలెనే గొప్ప స్వభావాన్ని కల వేలాయుధాన్ని ధరించిన ఆళ్వార్లు అనుగ్రహించిన చాలా గొప్ప ఉదారమైన, ద్రావిడభాషలో రచింపబడ్డ పాశురమాలికను.

**(నాలైన్దు)**- నాలుగైదు. ఇరవై పాశురాలను కల ఈ తిరుక్కుఱున్దాణ్డక ప్రబంధాన్ని.

**(ఊనమ్ అతిన్ఱి వల్లార్ ఒళివిశుమ్బు ఆళ్‌వర్‌తామే)** - దీనిని పారాయణం చేయగానే ఏమి ఫలం సిద్ధిస్తుంది? అని భావించకుండా, దీనిని పారాయణం చేయడమే గొప్ప ఫలం- అనే భావనతో, వేఱు ఫలాన్ని చేనినీ కోరకుండా అభ్యసించ గల్గినవారు, యథార్థజ్ఞానాన్నే స్వభావంగా కల పరమపదాన్ని పాలించగలరు. భ్రమించడమే స్వభాంగా కల ఈ లోకానికి విరుద్ధంగా ఉండడంవల్ల ఈ పరమ పదాన్ని "తెళి విశుమ్బు" (తిరువాయ్-9-7-5) (ప్రకాశించే స్వచ్ఛమైన పరమ పదం) అని నమ్మాళ్వార్లు అన్నారు కదా!

తిరుక్కుఱున్దాణ్డకమ్ వ్యాఖ్యానానువాదం సంపూర్ణం

దివ్యార్థదీపిక :- దేవతలకు ప్రభువైన ఇంద్రుడు, తిరునాభీకమలంలో ఆవిర్భవించిన చతుర్ముఖుడు నిరంతరం చక్కని పూలను సమర్పించి స్తుతించే పుండరీకాక్షుని విషయంగా విరోధినిరసనం చేసే గొప్ప వేలాయుధాన్ని కల కలియన్ పల్కిన ఈ ఇరవై పాశురాలను ప్రయోజనాంతరాలను ఆశించడమనే హైన్యాన్ని లేకుండా అనన్య ప్రయోజనులై అభ్యసించగల్గినవారు ప్రకాశించే పరమాకాశమైన

పరమపదాన్ని ఏలగలరు - అని అంటూ ప్రబంధాధ్యయనఫలాన్ని పల్కి ప్రబంధ నిగమనాన్ని (ఆళ్వార్లు) చేశారు.

దివ్యార్థదీపికా వ్యాఖ్యానానువాదం సంపూర్ణం

శ్రీకృష్ణసూరివివృతిం మధురాం లఘుదాండకాఖ్యభవ్యకృతేః ।
ఆంధ్ర్యాం వ్యతమత భక్త్యా దాసః శ్రీశింగరాచార్యః ॥

క్లుప్తాం కలిఘ్నన సువర్ణమాలాం సువాసితాం కృష్ణగురోః వివృత్యా ।
సంధార్య మాళా హృదయే చ కంఠే భక్త్యా నందంతు నిత్యం నితరామభిజ్ఞా॥



## అనుబంధం

## పాశురాల అకారాది సూచిక

| పాశురం - సంఖ్య | పాశురం - సంఖ్య |
|---|---|
| 1) అవిళ్లై - 12 | 11) తొణ్డెల్లామ్ - 11 |
| 2) ఇమ్మైయై - 7 | 12) నిదియినై - 1 |
| 3) ఇరుమ్బనన్నుణ్డ - 5 | 13) పాయిరుమ్ - 3 |
| 4) ఇరుమ్బనన్నుణ్డ - 13 | 14) పిణ్డియార్ - 19 |
| 5) ఇళైప్పినై - 18 | 15) పేశినార్ - 17 |
| 6) ఉళ్ళమో - 9 | 16) మాయమాన్ - 16 |
| 7) కావియై - 14 | 17) మున్బెలా - 15 |
| 8) కాఱ్ఱినై - 2 | 18) మూవరిల్ - 6 |
| 9) కేట్కు యాన్ - 4 | 19) వానవర్ -20 |
| 10) శిత్తముమ్ - 10 | 20) వానిడై - 8 |



శ్రీమతి కరాలపాటి నాగమణి, శ్రీమాన్ కరాలపాటి నాదబాబు దంపతులు,
వారి కుమారుడు శ్రీమాన్ కరాలపాటి వంశీకృష్ణ భక్తితో సమర్పించిన పవిత్ర ద్రవ్యంతో
ఆచార్య తిరునక్షత్రోత్సవ సందర్భంలో నూతన గృహప్రవేశ మహోత్సవ స్మృతిగా
ఈ గ్రంథం ముద్రింపబడినది.

ఉ.వే. శ్రీమాన్ కందాళ వేంకటాచార్య స్వామివారు,
వారి ధర్మపత్ని శ్రీమతి చిత్రా నీళ గారు



వాధూలాన్వయసంజాతమ్ అప్పలార్యతనూభవమ్।
గోపాలాచార్యసచ్ఛాత్రం వందే వేంకటదేశికమ్॥